# చేగొండి

## కథా కదంబం

### (చేగొండి సరదా సరస కథలు)

(వివిధ పత్రికలల్లో, అంతర్జాలంలో వచ్చిన కథల సంకలనం)

**మూడవ భాగం**

రచన

చేగొండి రామజోగయ్య



ప్రచురణ :

యువభారతి

రిజిష్టర్డ్ నెం. 1/64

సాహితీ సాంస్కృతిక సంస్థ

తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు

తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500001

# CHEGONDI KATHA KADAMBAM

(Compitation of Humourous and Romantic Stories Written by Sri Chegondi Ramajogaiah and Published in Various Magzines and or Internet)



ప్రచురణ సంఖ్య : 199

ప్రథమ ముద్రణ : ఆగష్టు 2022

ముద్రణ సహకారం : పుస్తక శిల్పి తాళ్ళపల్లి మురళీధర గౌడ్

ముఖ్యపత్ర రూప కల్పన : నవ్య ప్రింటర్స్, మోతీనగర్,
హైదరాబాద్ - 500014

అక్షరాల కూర్పు డి.టి.పి. : నారికిమెల్లి అంబిక

లే అవుట్ : మల్యాల హరి, బాలసాయి గ్రాఫిక్స్,
సనత్‌నగర్, హైదరాబాద్, 9985128532

ముద్రణ : కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
విద్యానగర్, హైదరాబాద్

ప్రతులకు : సాహిత్య సాంస్కృతిక సంస్థ
తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500001
చరవాణి - 9849909896, 9391373684

2. చేగొండి రామజోగయ్య, బ్లాక్ నెం. 11,
ఫ్లాట్ నం. 502, మైహోమ్ విహంగ, నానక్‌రామ్‌గూడ,
(నల్లగండ్ల), 'విప్రో' సర్కిల్, ఫైనాన్షియల్ డిస్ట్రిక్ట్ దగ్గర,
హైదరాబాద్ - 500032.
ఫోన్ - 9391007780, 99908036333

వెల : ₹ 150/- (గ్రంథాలయాలకు ఉచితం)

**డా. ఆచార్య ఫణీంద్ర 'యువభారతి' సాహితీ సాంస్కృతిక సంస్థ హైదరాబాద్**

# కథా గుచ్ఛం

సత్సాహిత్య పఠనం సామాజికుల హృదయాంతరాలలో దాగి ఉన్న సామానస్యాన్ని తట్టి లేపి, సాటివారితో సత్ప్రవర్తనతో మెలగి సల్లక్షణాన్ని పెంపొందించేందుకు దోహదపడుతుందని మా యువభారతీయుల విశ్వాసం.

'సత్సాంప్రదాయక సాహిత్యమే సదా మాన్యత గూర్చు సమాజమునకు, విఖ్యాత సాహితీవేత్తల గ్రంథాలె సౌమనస్యము బెంచు జనుల యందు, పండిత ప్రముఖుల ప్రాసంగిక విషయాలుద్ధరించును నవ యువత' ననుచు – ఆశావహ మహోన్నతాశయ సిద్ధికై సాహితీ సేవలో సఫల మగుచు ఆరువదేడుల పాటుగా నలుపెరుగక భవ్యమగు సభల్, సద్గ్రంథ ప్రచురణముల జరుపుచు సమస్త సాహితీపరుల హృదుల స్థిరముగా నిల్చె 'యువభారతి" ఘన సంస్థ!.

"యువభారతి" సాహితీ సాంస్కతిక సంస్థ ఈ సంవత్సరం విజయ దశమి పర్వదినం నాటికి షష్ఠిపూర్తికి సిద్ధమౌతున్న పరిణత మూర్తిమంతంతో సాహితీ లోకంలో నిటారుగా నిలువబోతున్నది. ఈ ఆరు దశాబ్దాల సుదీర్ఘ కాలంలో యువభారతి సంస్థ అనేక శ్రోతవ్య సాహితీ ప్రసంగాలతో కూడిన రసవత్సభలను నిర్వహించడంతోబాటు, బహుళాదరణను పొందిన సత్సాహిత్య గ్రంథాల నెన్నంటిన ముద్రించి పాఠకలోకానికి ఉపాయనంగా సమర్పించింది. ఈ సత్కార్య సాధనలో మా సంస్థ పూర్వాధ్యక్షులు డా. ఇరివెంటి కృష్ణమూర్తిగారు, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు, డా. తిరుమల శ్రీనివాసాచార్య గారు మరియు శ్రీ మాడభూషి అనంతాచార్యుల గారు సలిపిన విశేష కృషి సదా సంస్మరణీయం. అదే విధంగా ఆనాటి నుండి ఈ నాటి వరకు మా సంస్థ వ్యవస్థాపక ప్రముఖులు, సమావేశ కర్త అయిన ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారి మార్గదర్శనం మా కెంతో స్ఫూర్తిదాయకం.

ఈ సందర్భంగా యువభారతి గ్రంథ ప్రచురణల సంఖ్య కూడ త్వరలో 200కు చేరుకోబోతున్నదని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం. భారత స్వాతంత్ర్య పంచ సప్తతి వర్ష పరిపూర్తిని పురస్కరించుకొని, దేశమంతా ముదావహంగా జరుపుకుంటున్న అమృతోత్సవాల సందర్భంగా అలనాటి యువభారతి ప్రసిద్ధ గ్రంథం "మహతి"ని పునర్ముద్రించి మరొకమారు పాఠక లోకానికి నివేదించబోతున్నాం. దానితోబాటు "మహతి" కి కొనసాగింపుగా కడచిన ఏబదేండ్ల తెలుగు సాహితీ పరిణామ, ప్రస్థానాలపై వ్యాస సంకలనంగా "అమృతభారతి" అనే నూతన గ్రంథాన్ని కూడా వెలువరించే ప్రయత్నంలో ఉన్నాం.

ఇక.. ప్రస్తుత గ్రంథం – శ్రీ చేగొండి రామజోగయ్య గారు రచించిన కథా సంపుటి. రామజోగయ్య గారు మా సంస్థ సీనియర్ సభ్యులు, ఆయన లోగడ 2008లో యువభారతి ప్రచురణగా 'చేగొండి కథా కదంబం' పేరిట ఒక కథా సంపుటిని వెలువరించారు. ఇప్పుడు మరికొన్ని కథలను మరొక రెండు గ్రంథాలు (చేగొండి కథా కదంబం – 2, 3 భాగాలు) గా వెలువరిస్తున్నారు. ఇవి మా సంస్థ ద్వారా వెలువడుతున్న 198, 199వ ప్రచురణలు. ఈ గ్రంథాలలో రచయిత సమాజంలోని వివిధ అంశాలకు సంబంధించిన పలు కోణాలను స్పృశిస్తూ చక్కని కథలను అందించారు. ఈ గ్రంథం సాహిత్యాభిమానులను... ముఖ్యంగా కథా ప్రియులను అలరిస్తుందని ఆశిస్తున్నాం...

సం./–
(ఆచార్య ఫణీంద్ర)
అధ్యక్షుడు
యువభారతి

# నా మాట

నేను "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థలో ఐదున్నర దశాబ్దాలుగా సభ్యుడిని, మాతృభాషాభిమానినని, సగర్వంగా చెప్పుకోగలనే గాని, తెలుగు సాహిత్యలోకానికి, పాఠకలోకానికి పరిచయం అవసరంలేని ప్రముఖిడినో, లబ్ధప్రతిష్ఠుడినో మాత్రం కాను – అసాధారణ సాహిత్య సేవ చేసిన ధన్యుడిని కానే కాదు. ఒక సామాన్య రచయితను మాత్రమే.

విద్యార్థి దశలోనో కథలు, వ్యాసాలు వ్రాసిన నేపథ్యం, ఉద్యోగపర్వంలో తొలిరోజుల్లో అంటే చిరుద్యోగిగా ఉన్న కాలంలో రచనా వ్యాసంగం కొంత పరిమితంగా కొనసాగించినా, నా కథలు, వ్యాసాలు వివిధ పత్రికలలో 'సంకలనాల్లో' ప్రచురణ భాగ్యానికి నోచుకున్నా, పదోన్నతుల మూలంగా పెరిగిన ఉద్యోగ బాధ్యతలు భారం మూలంగాను, బదిలీల అసౌకర్యం కారణంగాను, ఉద్యోగ విరమణ చేసే వరకు విరివిగా రాసే అవకాశం లభించలేదు. ఎక్కువగా వ్రాయలేకపోవడానికి ప్రధాన కారణం 'రచనా ప్రతిభ' పరిమితంగానే ఉన్న వాడినన్న స్వీయ మూల్యాంకనం కావొచ్చు. ఇంకోకారణం 'యువభారతి' వంటి సాహిత్య సంస్థలో ఒక సామాన్య కార్యకర్తగా ఉంటేచాలు, అదే పదివేలు, అదే నాకు తగినపాత్ర అనిపించటమేమో కూడా!

ఏమైనా ఉద్యోగ విరమణ తర్వాత, 2003 నుంచి ఇంకో ఉద్యోగంలోనో, వ్యాపారంలోనో చేరడానికి 'ఇష్టం' లేకపోవడం రాజకీయాల్లో (మాది రాజకీయ నేపథ్యం బాగానే ఉన్న కుటుంబం) చేరాలన్న మూర్ఖత్వం కలగకపోవడం మూలాన, సన్నిహితుల మిత్రుల ప్రోద్భలంతో నా రచనా వ్యాసంగాన్ని సుదీర్ఘ విరామం తర్వాత పున: ప్రారంభించడం తప్పనిసరైంది. కాలక్షేపంకోసం కథలు, వచన కవితలు, వ్యంగ్య రచనలు, పరిమితంగాను, సమకాలీన రాజకీయ, సాంఘిక అంశాలపై విరివిగా వ్యాసాలు వ్రాయటం, అవి వివిధ పత్రికలలో ప్రచురించబడటం ఆ విధంగా భవదీయుడు పాఠక ప్రపంచానికి కాస్తో కూస్తో పరిచితుడు మాత్రం కావటం జరిగింది. లబ్ద ప్రతిష్ఠుడినైతే కాలేదనుకోండి. 2008లో 'చేగొండి కథా కదంబం' పేరున కథా సంకలనం, మాతృసంస్థ 'యువభారతి' ద్వారానే ప్రచురితం

కావటం జరిగింది – 2014 వరకు నా రచనా వ్యాసంగం బాగానే (అంటే ఎక్కువగా అని మాత్రమే అర్థం) జరిగింది. రాష్ట్ర విభజన తర్వాత కొన్ని వ్యక్తిగత కారణాలు, అసౌకర్యాలు మూలంగా మళ్లీ కొంత విరామం వచ్చింది. పూర్తిగా ఆగిపోలేదనుకోండి – ఇటీవల కాలంలో కథలు ప్రచురించే చాలా పత్రికలు మూత బడినందున కథల రచన అనివార్యంగా మందగించింది. అయితే 'కోవిడ్ కాలం'లో 'తీరిక' మరీ ఎక్కువైపోయి మళ్లీ కథలు రాయటం, అవి కొన్ని పత్రికలలో కొన్ని అంతర్జాల మాధ్యమంలో రావటం జరిగింది. ఇంకా జరుగుతోంది.

ఆ కథలలో కొన్ని ఎంపిక చేసిన వాటిని చేగొండి కథా కదంబం (2) మరియు (3) గా మాతృ సంస్థ 'యువభారతి' ద్వారానే రెండు సంకలనాలుగా ప్రచురించాలని, వాటిలో ఒకటి నాకు గురతుల్యులు, 'యువభారతి' పూర్వాధ్యక్షులు కీర్తిశేషులు శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారికి, రెండోది నా చిరకాల మిత్రుడు, నిరంతర మాతృభాషా సేవా తత్పరుడు, ప్రముఖ రచయిత శ్రీ ఆయల సోమయాజుల నాగేశ్వరరావు గారికి అంకితమివ్వాలన్న సత్సంకల్పం కలిగింది. ఈ రోజుల్లో 'అమూల్యం' అనే పదానికి విలువ పెద్దగా లేనందున ఈ పుస్తకాలకు కొంత వెల నిర్ణయించబడింది గాని తెలుగు రాష్ట్రాలలోని ఎంపిక చేసిన గ్రంధాలయాలకు ఉచితం గానే అందజేయాలన్న నా సంకల్పాన్ని గుర్తించి లాభాపేక్ష లేదని గ్రహించగలరు.

ఈ పుస్తకాల ప్రచురణకు అంగీకరించిన 'యువభారతి' అధ్యక్షులు ఆచార్య ఫణీంద్ర గారికి, ఇతర కార్యవర్గ సభ్యులకి పలువిధాలుగా సహకరించిన తాళ్లపల్లి మురళీధర్ గౌడ్ గారికి, నన్ను అన్నివిధాలా అన్నలా ఎల్లవేళలా ప్రోత్సహిస్తూ వెన్ను దన్నుగా 'మార్గదర్శి'గా నిలిచిన ఆచార్య వంగపల్లి విశ్వనాధం గారికి, అంకితానికి అంగీకరించిన శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారి కుటుంబ సభ్యులకు, శ్రీ నాగేశ్వరరావు గారికి కృతజ్ఞతాపూర్వక వందనాలు.

భవదీయుడు
చేగొండి రామజోగయ్య
సెల్ నెం. 9391007780



# కృతజ్ఞతలు

ఆప్తమిత్రులు, యువభారతిలో చిరకాల సభ్యులు, కధకులు శ్రీ చేగొండి రామజోగయ్య గారు ఆత్మీయతతో అందించిన ఈ కధాకదంబాన్ని వినమ్రంగా స్వీకరిస్తున్నాను. వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

ఇట్లు
ఆయలసోమయాజుల నాగేశ్వరరావు
కృతి స్వీకర్త



# చేగొండి కథా కదంబం

## మూడవ భాగం

### విషయాను క్రమణిక

# అదేదో సామెత చెప్పినట్లు

భార్యగా, కోడలిగా, తల్లిగా, బంధువుగా... అలా అన్ని పాత్రల్లో చక్కగా ఒదిగిపోయే ఎవరికైనా సాధ్యమైన మేరకు సాయపడాలని తపించే మంచి మనిషి మా ఆవిడ. అందుకే తనని అందరూ బాగా ఇష్టపడేవారు. కానీ ఇటీవల ఆమెని అభిమానించే వారంతా ఆమెతో మాట్లాడటానికే ఇష్టపడనంతగా పరిస్థితి తారుమారై పోయింది! ఉద్దేశపూర్వకంగా కాకపోయినా, దానికి కారకురాలు మా దూరపు బంధువు, వృత్తిరీత్యా తెలుగు ఉపాధ్యాయిని, "ఉదయిని"!

'ఉదయిని' పది నెలల కిందట ఒక ఉదయాన, మా ఇంటికొచ్చి సాయంత్రం వరకూ ఉండి, వెళ్లిపోయింది. మధ్యాహ్నం భోజనాలయ్యాక ఉదయినీ, మా ఆవిడా కబుర్లలో పడ్డారు. నేను వాళ్లకి దగ్గర్లోనే, కూర్చున్నాను. ఎందుకు, ఎలా జరిగిందో తెలియదు గానీ, వాళ్లిద్దరి సంభాషణ 'సామెత'ల వైపు మళ్లింది. సహజంగా 'వాగుడుకాయ' అయిన మాఆవిడ మాటల్ని, మంచి భోజనం చేసిన విశ్వాసంతో, అప్పటిదాకా వినయంగా, ఎదురు ప్రశ్నలు లేకుండా వింటూ వచ్చిన, ఆ ఉపాధ్యాయిని, ఆకస్మాత్తుగా విజృంభించింది.

'సుశీలా, ఏ తలమాసినవాడైనా తెలుగు కన్నా గొప్పభాష ఏదైనా ఉందంటే, వాడితల గొరిగెయ్యాలి. వాడి చెప్పు తోనే అన్నిపళ్లూ ఊడగొట్టాలి' అంటూ ఆగ్రహంతో ఊగిపోయింది. ఇంగ్లిష్ లెక్చరర్నైన నేను భోజనం చేస్తున్నప్పుడు మాటల సందర్భంలో, 'ఇంగ్లిష్ ఈ జ్ దక్వీన్ ఆఫ్ ఆల్ లాంగ్వేజస్' అని యథాలాపంగా అన్నమాటకు, అప్పుడేమీ అనకుండా, ఇప్పుడు దారుణంగా దండెత్తుతోందేమిటా? అనుకుంటూ తల తడుముకున్నాను. దాన్ని గమనించకుండా, ఉదయిని ఉద్వేగంగా చెప్పుకు పోతోంది. 'ఇతర భాషల్లోనూ మంచి సామెతలు, జాతీయాలు ఉండొచ్చుగాని, మన తెలుగులో ఉన్నంత – లోతైన భావం, స్పష్టత, క్లుప్తత, హాస్యం, వ్యంగ్యం, వాటిలో ఉండవుగాక ఉండవు. ఏంటలా వెర్రిమొఖం వేశావు. అసలు 'సామెతలంటే ఏంటో తెలుసా?"......... అవడానికి తెలుగు బిడ్డే అయినా, విద్యాభ్యాస మంతా ఆంగ్ల మాధ్యమంలో రాష్ట్రేతర ప్రాంతాల్లో కానిచ్చేసిన మా ఆవిడకు ఉదయిని తెలుగు ప్రసంగం పూర్తిగా అర్థం కావటం లేదేమోనని

ఆమె ముఖం చూస్తే అనిపించింది. తనకష్టం తర్వాత చెప్పుకుని, అసలావిడ చెప్పిన దానికి అర్థం వివరించాలని ఉభయ భాషా ప్రవీణుడినైన నన్నే అడగనుంది కదా అనుకుని, ఆ తెలుగు పండితురాలు మరింత ఉత్సాహంగా కొనసాగించిన ప్రసంగాన్ని శ్రద్ధగా వినసాగేను.

"కాబట్టి సుశీలా, మనకు తెలిసిన మంచి సామెతల్ని మన సంభాషణల్లో సందర్భోచితంగా విరివిగా వినియోగించి ఎదుటివారిని, పక్కన వినేవాళ్లని ఆనందింప జేయవచ్చు. ఒక ఉదాహరణ చెబుతా విను. ఒకసారి నేను, మా ప్రదానోపాధ్యాయుడి మనవడు, ఆరేళ్లవాడు, ఒకపాట పాడిన సందర్భంలో 'పువ్వు పుట్టగానే పరిమళించు' అన్నాను. నా సహోపాధ్యాయుడొకాయన నన్ను అనుసరిస్తూ 'పిట్ట కొంచెం – కూత ఘనం' అని అన్నాడు". అవి ఎంత బాగా "పండాయంటే", ఆ మాటలే వాడి అమ్మమ్మ తాతయ్యలకు ఎక్కువ ఆనందాన్ని కలిగించాయి. ఇతరులు ఇచ్చిన కానుకల కన్నా! ఇప్పటికైనా తెలిసిందా మన తెలుగు సామెతల ఘనత?" అని కాస్త ఆయాసం వచ్చి ఆగింది.

అదంతా విన్న నేను 'నిజమే కదా' అనుకున్నాను. వెంటనే 'దేశ భాషలందు తెలుగు లెస్స' అన్నాను కూడా. దానికి ఆవిడేమీ మాట్లాడలేదు. నా ఉంగరాల జుట్టువైపు చూస్తూ ఉండిపోయింది. నాకు గుండె బేజారయింది. ప్రసంగారంభంలో 'ఏ తల మాసినవాడైనా తెలుగు కన్నా వేరే భాష గొప్పదంటే వాడితల గొరిగేయాలి…' అన్న ఆవిడమాటలు గుర్తొచ్చి.

అయితే నావంక 'అదోలా' చూస్తున్న ఆవిడని, మా ఆవిడ"అపార్థం" చేసుకుందో ఏమోగానీ, 'మేం ఆడవాళ్లం మాట్లాడుకుంటుంటే మీరెందుకిక్కడ?' అని నిర్మొహమాటంగా కసిరింది. పక్క గదిలోకి నిష్క్రమించాను. 'కొంచెం అతిగా మాట్లాడి ఉండొచ్చుగానీ, సామెతల ప్రభావం గురించి ఆ "తెలుగు భాషాభిమాని" చెప్పింది నిజమే కదా అనుకున్నాను. అయితే, సందర్భోచితంగా వాడితే మంచిదేగానీ.. అనుచితంగా, అనాలోచితంగా సామెతలు వాడితే అపార్థాలు, అవాంఛిత పరిణామాలు తప్పవు కదా' అని నాకెందుకో ఆ సమయంలో తోచలేదు!

తర్వాత వారం రోజులు మామూలు గానే గడిచాయి. కానీ, నా భార్యామణి ఖాళీగా ఉన్నప్పుడల్లా దీర్ఘాలోచనలో ఎందుకుంటోందో అర్థంకాలేదు. ఒకరోజు అకస్మాత్తుగా 'ఏమండీ, నాకు తెలుగు సామెతల పుస్తకమొకటి తెచ్చివ్వండి' అని గోముగా అడిగింది. నేను కొంచెం బిత్తర చూపులు చూస్తుంటే, 'మిస్టర్! నేను బెంగళూరులో ఇంగ్లిష్ మీడియంలో చదువుకున్నా, కాలేజీకి వచ్చే వరకు "టెల్గూ వాజ్ మై సెకండ్ లాంగ్వేజ్", సో ఐ కెన్ రీడ్ అండ్ అండర్‌స్టాండ్ టెల్గూ యూనో' అని మిశ్రమ, అంటే కిచిడీ భాషలో కసురుకుంది. ఆ తర్వాత ఏమనుకుందో ఏమో, 'ఐ విల్ గెటిట్ మై సెల్ఫ్' అంది. ఆ తర్వాత కూడా తను ఎడతెగని ఆలోచనల్లో మౌనంగా ఉండి పోవడం, ఒకే పుస్తకం తాదాత్మ్యంగా పదేపదే చదువుతూ ఉండిపోవడం గమనించినా, దాని గురించి తనతో చర్చించలేదు, కనీసం 'ఎందుకని' కూడా అడగలేదు. అదే నా కొంప ముంచింది. మా ఆవిడ ఉదయిని ప్రసంగాన్ని బాగా వంట బట్టించుకుందని, సామెతల ద్వారా అందర్నీ అలరించాలని గట్టి నిర్ణయం తీసుకుందని నాకు సకాలంలో తెలియలేదు. తన సామెతల ప్రయోగాలు వికటించి ఒక అనర్థం తర్వాత మరో అనర్థం జరిగి పోయాయి. తెలిసీ తెలియక అనుచితంగా సామెతలు వాడితే ఎలాంటి దుష్పరిణామాలు సంభవిస్తాయో అనుభవం లోకి వచ్చింది. మచ్చుకు కొన్ని ఉదాహరణలు...

ఒకసారి మా చిన్నాన్న, పిన్ని, వాళ్లమ్మాయితో సహా వచ్చి, "మీ ఆడబడుచుకి పెళ్లికుదిరిందమ్మా"– అని సంతోషంగా చెప్పి యధాలాపంగా – మా ఆవిడవైపు చూస్తూ "ఇక నీదేనమ్మా భారం" అన్నారు. మా చిన్నాన్న ఉద్దేశం 'ఇంటి కోడలి' గా పెళ్లిపనులు, "పిలుపులు" వగైరా భారమంతా పుచ్చు కోవాలనే తప్ప, మా నుంచి ఎలాంటి ఆర్థిక సాయం కోరడం కాదు. వాళ్లకే కావాల్సినంత ఆర్థిక బలం ఉంది. ఆయితే మా ఆవిడ పల్లికిలిస్తూ "ఎంకి పెళ్లి సుబ్బి చావు కొచ్చినట్టు" అన్న సామెత పేల్చేసింది. వాళ్ల ముఖాలు మాడిపోయాయి, అవమానాగ్నితో.

నిజానికి అంతక ముందు నాతో ఎన్నోసార్లు" మీకెలానూ సొంత అక్కా చెల్లెళ్ళు లేరు. "అనసూయే" నాకున్న ఒక్కగానొక్క ఆడపడుచు. పని గట్టుకుని

మీరు కొత్తగా ఏమీ ఇవ్వనక్కర్లేదు గాని, నాకున్న నగల్లో ఒకటి దాని పెళ్లప్పుడు ఇచ్చేద్దాం" అంది. అది వాళ్ళకు తెలియదు కదా! ఆమె తెలిసీ తెలియక అన్నదానికి "మీ నుంచి ఏ సాయం అవసరం లేదు. పెళ్లికి రాకపోయినా పర్వాలేదు" అని నిష్టూరమాడి అసలు విషయం చెబుతున్నా వినకుండా రుసరుసలాడుతూ తక్షణం వెళ్ళిపోయారు. కాని, సుశీలకు ఆ సంఘటనతో గుణపాఠం రాలేదు. "ఆ పుస్తకంలో సామెత అలాగే ఉంది" అని సమర్థించు కుంది.

ఇంకోసారి మా బంధువొకాయన వచ్చి "మా అబ్బాయికి రోగం నయమై పోయింది. ఇప్పుడు ఎంతో తెలివిగా మాట్లాడుతున్నాడు" అని చెప్పాడు ఆనందంగా, ఆ కుర్రాడికి వచ్చి తగ్గిన రోగం 'పిచ్చి' అని సుశీలకు తెలియదు. 'తెలివిగా మాట్లాడుతున్నాడిప్పుడు" అన్నాడు కదా, తనూ తెలివిగా మాట్లాడాలనుకొని కాబోలు సగం గుర్తొచ్చిన సామెతను వాడేసింది. "అంటే రోకలి తలకి చుట్టమంటున్నాడా? అని. మీ వాడిపిచ్చి ఎప్పటికీ తగ్గని రోగం అని ఎద్దేవా చేస్తోందని అపార్థం చేసుకుని కోపంగా వెళ్లి పోయారాయన. చేసిన తప్పేంటో మా ఆవిడకి మాత్రం అర్థం కాలేదు.

మరోసారి మా పక్కింటావిడ వాళ్ళ దొడ్లో విరబూసిన మల్లెపూలతో దండ చేసి మా ఆవిడ కిద్దామని వచ్చి సరదాగా అంది "నా కొంగులో ఏం దాచానో చెప్పుకో" అని, అంతే సరదాగా జవాబు చెప్పాలనుకున్న సుశీల ఠక్కున 'చల్లకొచ్చి ముంత దాచట మెందుకో?" అంది. దాంతో ఆవిడ 'నేనేమీ మీ దగ్గరకి ఏ అప్పుకోసమో, మరేదో వస్తువు కోసమో రాలేదు మహాతల్లీ. "కటువుగా అని, మల్లెల దండ ఇవ్వకుండానే వెళ్ళిపోయింది. నిజానికి ఆవిడ తరచుగా అందరి దగ్గరా ఉప్పు, పప్పు, బెల్లాలు అరువుగా తీసుకుంటూనే ఉంటుంది. అందుకే మా ఆవిడ పేల్చిన సామెత కంత ఉక్రోషం వచ్చిందన్నది వేరే విషయం. "మామూలు సామెత చెబితే అంత కోపమెందు కొచ్చిందో ఆవిడకి" అని గొణుక్కుంటూ ఉండి పోయిందీవిడ.

ఒక్కసారి చుట్టాలింటికి భోజనానికి ఆహ్వానిస్తే ఇద్దరం వెళ్లాం. వంటింట్లో ఉన్న పెద్ద కోడలి చెయ్యి జారి కాబోలు ఒక గిన్నె పడిన శబ్దం వినపడింది. మా ఆవిడ నోట్లోంచి అప్రయత్నంగా సామెత వెలువడింది. 'అత్తమీద కోపం దుత్త

మీద” అని. దాంతో అత్త కోపంతో ఊగిపోతూ, ‘ఏవమ్మో, నేనూ మా ఇద్దరు కోడళ్ళూ ఎంతో అన్యోన్యంగా ఉంటున్నాం. మా మధ్య“తంపులు”, పెడితే ఊరుకునేది లేదు ఇక దయ చెయ్యండి” అని గుమ్మం వైపు చూపించింది. చేసేదేం లేక ఇద్దరం బయటపడ్డాం. ఇంట్లో తింటానికి ఏమీ లేదు కాబట్టి దార్లో హోటల్లో తినేశాం. తింటున్నంత సేపూ, “నేనన్న సామెతలో తప్పేం ఉంది” అని గొణుగుతూనే ఉంది.

మా ఆఫీసులో నాతోబాటు పనిచేసే ఒకాయన హాస్పిటల్‌లో ఉన్నాడని తెలిసి చూడ్డానికి ఇద్దరం వెళ్లాం. మేం వెళ్లేసరికి డాక్టరు గారు ఆయన చేతిపైన గాయానికి ‘బ్యాండేజ్ చుట్టుతున్నారు. మా ఆవిడ మదిలో ‘పుండు’ అన్న పదం మెదిలింది. దానికి సంబంధించిన ‘సామెత’ నాలిక మీదకి వచ్చి, “ఎద్దుపుండు కాకికి రుచి” అనేసింది. ఏదో సామెత చెప్పాలన్న ఉత్సాహమే తప్ప, నా సహోద్యోగిని ఎద్దుతో, డాక్టరుని కాకితో పోల్చాలన్న ఉద్దేశ్యం నా జీవన సహచరికి ఏ కోశానా లేదు. కానీ, కొంచెం స్థూలకాయుడైన మావాడు, నల్లగా ఉండే డాక్టరూ అలాగే ‘అపార్థం’ చేసుకుని కళ్ళు ఇంతవి చేశారు.

మరోసారి ఇలాగే తెలిసిన వ్యక్తి ఆస్పత్రిలో ఉంటే ఇద్దరూ వెళ్లాల్సొచ్చింది. గత అనుభవాన్ని దృష్టిలో పెట్టుకుని ఆస్పత్రిలో ఏ సామెతలూ వాడొద్దని గట్టిగా చెప్పాను. సరేనని తలూపి అలాగే ఆస్పత్రిలో చాలా సేపు మౌనంగానే ఉంది. కానీ వచ్చేటప్పుడు “మీరు చిరాయువు”అంది. అయితే ఆ రోగి నవ్వాలో ఏడవాలో తెలియనట్లు ముఖం పెట్టాడు. ‘పాపి చిరాయువు’ అన్న సామెత ఉందని తనకి తెలియదని, కేవలం నిండా నూరేళ్లు బతకండి అనే అర్థంతో మాత్రమే అలా అన్నానని తర్వాత చెప్పిందిలెండి. కానీ ఏం ప్రయోజనం? జరగాల్సిన నష్టం జరిగిపోయిందిగా!

ఇలా మా ఆవిడి వికట ప్రయోగాలు చెప్పుకు పోతే అదొక బృహద్గ్రంథం అవుతుంది. పది నెలల్లో ఇలాంటి ఎన్నో దుస్సంఘనలవల్ల తను ఎవరికీ గిట్టనిది అయిపోయింది. బంధు మిత్రులు ఇరుగు పొరుగు అంతా తనతో మాట్లాడ్డానికే ఇష్టపడడం లేదు.

"ఎంత ప్రయత్నించినా ఈ పాడు వ్యసనాన్ని వదల్లేక పోతున్నానండీ. ఆ రోజు ఉదయినక్క సామెతల గురించి చెప్పిన మాటలు మనసులో నాటుకు పోయాయి. సామెతలతో అందర్నీ మెప్పించాలనే కోరిక బాగా బలపడి పోయింది. అంతేగానీ నొప్పించాలన్న ఉద్దేశం అస్సలు లేదండీ. నన్ను నేను నియంత్రించు కోలేక పోతున్నాను. ఎంత వద్దనుకున్నా బట్టీ పట్టి మెదడులో దాచుకున్న సామెతలు నాలిక మీదకి వచ్చేస్తున్నాయి. నేనేం చెయ్యాలో" అంటూ ఓ రోజు ఏడ్చేసింది సుశీల. నాకూ ఏం చెయ్యాలో అర్థంకాలేదు. అప్పుడు –

ఓ ఆదివారం తనని ఇంకో ఊళ్లో ఉండే ఉదయిని దగ్గరికి తీసుకెళ్ళాను. ఇద్దరం ఓ గంట సేపు ఆక్రోశంగా చెప్పుకున్నదంతా సావధానంగా విన్నదామె. "నువ్వే నాకు సొల్యూషన్ చెప్పాలక్కా ఇప్పుడు అందరూ నన్ను "సామెతల వాతలమ్మ" అని పిలుస్తున్నారు. దగ్గిరకి చేరడం లేదు. నేను సామెతల జోలికి పోకుండా ఉండాలంటే ఏం చెయ్యాలో చెప్పి పుణ్యం కట్టుకో అక్కా" అని ఏడ్చేసింది..........

ఆవిడ ఎక్కువ సేపు ఆలోచించ కుండా"ఏముందీ, ఒకసారి కాశీకి వెళ్ళి 'నాకిష్టమైన సామెతలు పలికే అలవాటుని వదిలేస్తున్నాను' అని 'సంకల్పం చెప్పుకో. రోజూ ఉదయం లేచిన వెంటనే సరస్వతీ దేవి పటం ముందు నిల్చుని 'అమ్మా నా బుర్రలోని సామెతల్ని మాయం చేసెయ్. నా నాలిక మీదకి ఏ సామెతా రాకుండా చెయ్యితల్లీ' అని ప్రార్థించు" అని సలహా ఇచ్చింది. అప్పటికే భోజన సమయం అయినా, ఆ మాటే ఎత్తలేదావిడ! ఆవిడిచ్చిన సలహానే మృష్టాన్నంగా భావించి మా ఊరికి తిరుగు ముఖం పట్టాం. గుమ్మం దాకా వీడ్కోలు పలకడానికి వచ్చి "అంతగా నిగ్రహించు కోలేకపోతే అదేదో సామెత చెప్పినట్లు" అని ఊరుకో, కానీ ఏ సామెతా చెప్పకు అని మరో సలహా ఇచ్చి తలుపులు మూసుకుంది. ఈ సలహా ఇంకా బాగా నచ్చినట్లుంది. మా ఆవిడ సంతృప్తిగా తలూపింది. దార్లో "వచ్చేవారమే కాశీ వెళ్దామండీ" అని కూడా అంది. "కాశీ యాత్ర తర్వాత పరిస్థితి ఎలా ఉంటుందో మరి "అదేదో సామెత చెప్పినట్లు" వెంటనే తనే అని ఊరుకుంది అంటే 'కాశీకి పోయినా "ఖర్మం" శని తప్పలేదు" అన్న సామెత గుర్తొచ్చినా ఆ మె బయటికి చెప్పలేదు. దాంతో నాలో వెయ్యి ఆశాకిరణాలు చూడాలి మరి.... ఏం జరుగుతుందో?

(తెలుగు వెలుగు డిసెంబర్ 21 అంతర్జాల మాస పత్రికలో ప్రచురితం)

# ఘటికురాలు

"సత్యం, శివం, సుందరం" – ఈ ముగ్గురూ ఎప్పుడో పదిహేనేళ్ళ క్రితం గుడివాడ లోని ఒక ఇంజనీరింగు కాలేజీలో కలసి చదువుకున్నారు. నాలుగేళ్లూ 'రూమ్మేట్లు'గా ఉండి, చాలా ఆప్తమిత్రులుగా మెలిగారు. చదువైపోయిన తర్వాత విడిపోయి, తలోదారై పోయి, ఇన్నేళ్ళుగా ఒకరి నొకరు కలుసుకోలేక పోయారు. కనీసం ఉత్తరాల ద్వారా గానీ, ఫోన్ల ద్వారానైనా, ఒకరి సంగతు లొకరికి తెలియకుండా ఉండి పోయారు. పదిహేనేళ్ళ తర్వాత, తమ కాలేజీ 'స్వర్ణోత్సవాల' సందర్భంగా జరిగిన "పూర్వ విద్యార్థుల" 'సమ్మేళనంలో, పాల్గొనటానికి వచ్చి, అంతమంది లోనూ, పరస్పరం గుర్తుపట్టుకుని, ఆ రోజంతా కలిసి ఉండి, పాత జ్ఞాపకాలు పంచు కున్నారు. ప్రస్తుత స్థితిగతులు పరస్పరం తెలుసుకున్నారు – "సత్యం" ఇప్పుడు హైదరాబాద్‌లో ఒకప్రముఖ నిర్మాణ సంస్థలో ఎమ్.డి.గా ఉ న్నాడని, "శివం" బెంగుళూరులో ఒకకంప్యూటర్ కంపెనీలో మంచి ఉద్యోగంలో ఉన్నాడని, ఇక మూడో మిత్రుడు "సుందరం" చదువుకున్న పట్టణం గుడివాడలోనే స్థిరపడిపోయి, చదువుకి ఏమాత్రం సంబంధం లేని హొటల్ బిజినెస్‌లో కుదురుకున్నాడని, ముగ్గురికీ పెళ్ళిళ్లయి, తలో ఇద్దరు పిల్లల్ని కలిగి సంసార సాగరాన్ని ఈదుతున్నారని తెలుసుకున్నారు. కాలేజీ ఫంక్షన్ ముగిసిన తర్వాత, అందరూ పూర్వ విద్యార్థులతో బాటు సత్యం, శివం, సుందరంలు కూడా బరువెక్కిన గుండెలతో తిరుగు ప్రయాణ మయ్యారు ఆ సాయంత్రమే.

మిత్రులిద్దరినీ సాగనంపటానికి స్థానికుడు సుందరం రైల్వేస్టేషన్‌కి వచ్చాడు. వాళ్ళెక్కాల్సిన "రైళ్ళు" రావడానికింకా కొంత సమయమున్నందున, క్యాంటీన్‌లో కాఫీ తాగి, వెయిటింగ్ రూమ్‌లో పక్కపక్కనే ఆసీనులయ్యారు. అప్పుడు ఎందుకనో ఆ రూమ్‌లో తాము తప్ప ఇంకెవరూ లేకపోవటం వాళ్ళకానందాన్ని కల్గించింది. అక్కడ కాలేజీ ప్రాంగణంలో అంతమంది మధ్యన, స్వేచ్ఛగా మాట్లాడుకోలేక పోయిన వ్యక్తిగత విషయాల్ని ఇప్పుడు చెప్పుకోవడానికి అవకాశం లభించిందను కున్నారు.

సత్యం ముందు అందుకున్నాడు – "మీ ఇద్దరికీ జ్ఞాపకం ఉందో లేదో – విడిపోయిన రోజున మనం ఎలాంటి ఉద్యోగాల్లో స్థిరపడాలో చర్చించుకున్నాం.

దానికన్నా ఎక్కువగా "ఎలాంటి భార్య" వస్తే బాగుంటుందో, కూడాతర్జన భర్జన పడ్డాం కదా! వెంటనే స్పందించాడు శివం - "ఔను సత్యం! నేనూ సుందరం అయితే, ఏదో సంసారపక్షంగా ఉండేది, గయ్యాళితనం, దుబారా ఖర్చుల అలవాట్లు లేనిది భార్యగా రావాలి. మొగుడితోపాటు అత్తమామల్ని బాగా చూసుకునేదైతే, అదే పదివేలు అన్నాం. కానీ నువ్వైతే మాత్రం పెద్ద లిస్టు చదివావు. నీ భార్యఎలా ఉండాలో"'.........

"మంచి అందం, మనసు, చదువు, సంస్కారాలతో పాటు భర్త అడుగు జాడల్లో నడిచే అణకువ, అత్త మామల, ఆడబడుచుల పట్ల విధేయత గలదే" నీ భార్యగా రావాలని, అంతేకాదు పుట్టింటి నుంచి మెట్టినింటికి అపారమైన సంపదతెచ్చేదై ఉండాలని స్పష్టంగా చెప్పావు. మరి "అలాంటి భార్యే వచ్చిందా?.."

"ఏం చెప్పమంటార్రా!.. తానొకటి తలిస్తే దైవం మరొకటి తలచినట్లైంది... నేను కోరుకున్న గుణాలేవీ లేవు మా ఆవిడలో... వివరాలు చెప్పి మీ మనసుల్ని బాధించలేను. అందుకే ఒకే మాటలో చెబుతా... తనని వర్ణిస్తా... అది... అది గయ్యాళి" ఎటో చూస్తూ క్లుప్తంగా, స్పష్టంగా సత్యం పలికాడు సత్యం.

ముగ్గురి మధ్య కాసేపు మౌనం రాజ్యం చేసింది - వాతావరణాన్ని తేలిక పరిచే ఉద్దేశంతో శివం మెల్లగా అన్నాడు - "నేనూ మా ఆవిడ గురించి ఒకే మాటలో చెబుతా - "ఆమె మంచిది".

"పోన్లే అదృష్టవంతుడివి" అన్నట్లు శివం వైపు చూశారే గానీ మిత్రులిద్దరూ "మంచిది" అంటే ఎలా ఎంత, ఆ వివరాలడగలేదు. మరీ అతి మంచితనంతో నీకే మీ ఇబ్బంది కలగజేయటం లేదుకదా, అన్న అనుమానమూ వ్యక్త పరచలేదు. ఒక్క పదంతో చెబితే చాలు వివరాలేమీ అడగకూడదు" అన్న అలిఖిత ఒప్పందమేమో తమ మధ్యన ఉన్నట్లుగా -

ఇక, సుందరం వంతు వచ్చింది. తన భార్య ఎలాంటిదో చెప్పడానికి, కానీ అతను మౌనంగానే ఉండిపోయాడు.

"ఫర్వాలేదు చెప్పు సోదరా! నేను చెప్పలేదా? నా పెళ్ళాం గురించి ఒకే

పదంలో 'గయ్యాళి' అని. నువ్వూ ఒకే పదంలో చెప్పు" అన్నాడు.

ఇక తప్పదనుకుని మెల్లగా గొంతు విప్పాడు సుందరం. తనలో తనే మాట్లాడుకునే ధోరణిలో ఉన్నాడు – "నా భార్య గురించి చెప్పాలంటే తెలుగులో ఎన్నో మంచి పదాలున్నాయి. వాటికెన్నో పర్యాయ పదాలున్నాయి. తనని సంపూర్ణంగా వర్ణించడానికి ఏ ఒక్క పదమూ చాలదు. నేను ఎన్నోసార్లు విన్నాను. అందరితో కాదు గానీ, తన అత్యంత సన్నిహితులతో సగర్వంగా, ఆత్మవిశ్వాసంతో తన గురించి చెప్పే మాట– 'నేను ఘటికురాల్ని' అనేది. నేనూ అదే మాట వాడుతా. నా భార్యఘటికురాలు.

సత్యం, శివం కాసేపు అయోమయంలో మునిగి పోయారు. "గయ్యాళి" అంటే, "మంచిది" అంటే అందరికీ స్పష్టంగా తెలిసే అర్థాలున్నాయి. కానీ ఘటికురాలంటే? ఏమిటర్థం?

"ఏమీ అనుకోకు సుందరం – "ఘటికురాలు" అంటే మాయ మాటలు చెప్పి తన కార్యం సాధించు కునేదన్న అర్థం కూడా ఉందేమో" కొంచెం సంకోచిస్తూనే అన్నాడు సత్యం.

ఆ మాటలకి సుందరం కొంచెం నొచ్చుకున్నా డనిపించి శివం సముదా యింపుగా అన్నాడు "సత్యం ఉద్దేశం ఘటికురాలు అంటే మోసకారి అని కాదు. తను అనుకున్నది, కోరుకున్నది అది మంచిదైనా, చెడ్డదైనా సరే, చాలా తెలివిగా ఎదోలా సాధించుకునేవాళ్ళను కూడా ఘటికురాలు అంటారు కదా – ఉదాహరణకి ఇందిరా గాంధీని, మాయావతిని, జయలలితను అలా అంటూ ఉంటారు. మీ ఆవిడ గురించి ఏమీ తెలియదు గానీ"– ఈ సారి సుందరం మిత్రుల కళ్ళలోకి నేరుగా చూస్తూ అన్నాడు. "చాలా సమర్థురాలు" ఇతరులకి అసాధ్యమైనవి కూడా అతి సులభంగా సాధించగల్గే ఘటికురాలు, అపూర్వమైన తెలివి తేటలు గలది అని చెప్పటమే నా ఉద్దేశం. ఘటికురాలు అన్నపదం వేర్వేరు సందర్భాల్లో కూడా ఇంకా ఎంతమంది పట్లనో వాడవచ్చున్నది వాస్తవమే. కానీ మా ఆవిడ ఎలాంటి "ఘటికురాలో" మీకు స్పష్టంగా తెలియాలంటే ఎన్నో వివరాలు చెప్పాలి. మీ రైళ్ళు రావడానికి ఇంకా సమయం ఉంది కాబట్టి కొన్ని ముఖ్యమైనవి మాత్రం

చెబుతాను, నా తృప్తికోసం కూడా".

అంతకన్న కావల్సిందే ముందన్నట్లు మిత్రులిద్దరూ సుందరంకి దగ్గరగా జరిగి, ఉత్కంఠతో అతని మాటలు వినసాగారు.

"మీకు మొదటగా చెప్పాల్సింది, మాకు పెళ్ళయిన – కాదు కాదు, తను నన్ను పెళ్ళి చేసుకున్న వైనం. నా చదువు పూర్తవటం, మా నాన్న రిటైరవటం దాదాపు ఒకేసారి జరిగింది. నాన్న ఉన్న కాసిన్ని డబ్బులతో గుడివాడలో ఒక పెంకుటిల్లు కొన్నాడు. ఇన్నాళ్ళకు సొంతింటిలో ఉంటున్నామన్న తృప్తిని అమ్మకు, నాకు, చెల్లికి కల్పించారు. అప్పుడే మా ఇంటి పక్కనే ఉన్న ఒక మేడను కొనుక్కుని, నాయుడి గారి కుటుంబం అందులో దిగారు. నాయుడు గారి భార్యకాంతం గారు చాలా మంచిదని, వాళ్ళ ఏకైక కుమార్తె "ప్రతిభ" చాలా పద్ధతైన "పిల్ల" అని మా అమ్మ, నాన్నతో చెబుతుంటే విన్నాను. అందగత్తె కూడా, అని కొసరింది కూడా. అయినా నేను పెద్దగా పట్టించు కోలేదు. ఔను, ఇంకా స్థిరపడని నాకు'ప్రేమా దోమా' అనుకునే పరిస్థితి లేదుకదా అప్పుడు?అందుకే అప్పుడప్పుడు మధురంగా నన్ను పలకరించినా "ప్రతిభ"తో ముభావంగానే ఉండేవాణ్ని. అంత అందమైన అమ్మాయి పలకరిస్తున్నందుకు మది పులకరించేది గానీ పొడి పొడి గానే జవాబిచ్చి తప్పుకునేవాణ్ని. నాకన్నా అందమైన, తెలివైన, డబ్బున్న అమ్మాయితో ఎక్కువ "చనువు" మేలుకాదన్న "న్యూనతాభావం" కూడా ఉండేది నాలో. ఇక నాతో లాభం లేదు, అట్నుంచి నరుక్కుని రావాలనుకుందను కుంటాను. ప్రతిభ నేనున్నప్పుడు, లేనప్పుడు మా ఇంటికి రాకపోకలు ఎక్కువ చేసింది. వాళ్ళింట్లోంచి తినుబండారాలు తెచ్చేది. అమ్మకి వంటల్లో సాయం చేసేది. క్రమంగా 'అత్తమ్మ' అంటూ వరుసా కలిపింది. నాన్నతో చదరంగం ఆడేది.

ఓ శుభదినాన, నాయుడు గారు భార్యతో సహా నేను లేనప్పుడు మా ఇంటికి వచ్చి నాన్నతో, అమ్మ ఆనందంగా వింటుండగా అన్ని వివరాలు మాట్లాడేసి, సంబంధం ఖాయం చేసేసుకున్నారు. "మీ ఇంటి పక్కనున్న ఈ మేడమా అమ్మాయి పేరు మీదనే కొన్నాం. అందులోకి మీ కుటుంబం మారిపోయి, మీ పెంకుటింటిని అద్దెకిచ్చేసు కోవచ్చు. లేదా మీ అమ్మాయికి పెళ్ళిలో కట్నంగా ఇచ్చుకోవచ్చు. మేం ఊళ్ళోనే మాకున్న ఇంకో మేడలోకి మారిపోతాం. అందరం ఇరుకుగా ఈ

మేడలోని ఉండాల్సొస్తుందేమో అనుకోవద్దు. ఇకపోతే మాకున్న నాలుగు హొటళ్లలో రెండు అల్లుడికిచ్చేస్తాం. వాటిని చూసుకుంటే చాలదా, వేరే ఉద్యోగం ఎందుకు? ఏమైనా మీ గౌరవానికి ఎప్పుడూ భంగం కలగదు నమ్మండి– మా తదనంతరం మా ఆస్తి అంతా అమ్మాయికే దక్కుతుంది. తనే మా ఏకైక సంతానం అని తెలుసుకదా" ఇలాంటి మాటలతో మావాళ్ళు పడిపోయారు. నా ప్రమేయం లేకుండా సంబంధం కుదిరి పోయింది. వెంటనే మా వివాహం వైభవంగా జరిగి పోయింది. పెళ్ళిరోజునే 'ఎలా సాధించావే' అని ఎవరో స్నేహితురాలు తన చెవిలో గుసగుసగా అడిగితే, మా ఆవిడ నాకు వినపడేలానే సగర్వంగా చెప్పింది, 'నేను ఘటికురాలిని' అని. 'నిజమే... ఘటికురాలే' అని నేనుకూడా అనుకున్నాను. తర్వాత కూడా తను ఘటికురాలినని నిర్ధారించే సంఘటనలెన్నో జరిగాయి. కొన్నే చెబుతాను. వివాహం ద్వారా నా చేతికి వచ్చిన రెండు హొటళ్ళను ఆదాయపరంగా, ప్రతిష్ఠపరంగా కూడా అనతి కాలంలో ఎంతో అభివృద్ధి పరచగలిగానంటే అదంతా నా గొప్పేమీ కాదు. ఇంటిపనుల్తో, అత్తమామల సేవలతోపాటు, వ్యాపారాల నిర్వహణలో కూడా ప్రతిక్షణం మా ఆవిడ "ప్రతిభ, ప్రతిభావంతంగా నాకు మార్గదర్శనం చేయటమే ప్రధాన కారణం, మా వ్యాపార ప్రగతికి.

ఇంకో ప్రధాన సంఘటన చెబుతా – మా చెల్లి మాకు తెలియకుండానే ప్రేమ వ్యవహారంలో పడి, కొంత దూరం వెళ్ళాక, అతగాడు తల్లిదండ్రులకు జడిసి కాబోలు "ముఖం చాటేస్తే" ఆత్మహత్యా ప్రయత్నం చేసింది. సమయానికి మా ఆవిడే దాన్ని కాపాడింది. అంతేకాదు అతడిని వెతికి పట్టుకుని పోలీసు కేసు పెడతానని, మహిళా సంఘాలను కూడగట్టి మీడియాలో నానా గొడవ చేస్తానని భయపెట్టి దారిలోకి తెచ్చింది. మంచి కట్నం ఆశచూపి మా చెల్లితో పెళ్ళికి అతడి తల్లిదండ్రులకు అభ్యంతరం లేకుండా చేసిన "ఘటికురాలు" మా ఆవిడ. పెళ్ళయ్యాక బావకి మా హొటల్‌లో "మేనేజర్" ఉద్యోగం ఇప్పించిన ముందు చూపు గలది. ఏమైనా, మా చెల్లికాపురం చక్కగా ఉందంటే అదంతా మా ఆవిడ ప్రతిభే.

ఓసారి నేను నిర్వహిస్తున్న ఓ హొటల్ మీద పోలీస్ దాడి జరిగి, ఒక రూమ్‌లో ఒక వేశ్య, విటుడు పట్టుబడ్డారు. మాపై క్రిమినల్ కేసు దాఖలైంది. ఏంచేయాలో తెలియక నిశ్చేష్టుడినై నేనుండగా, మా ఆవిడ రంగం లోకి దిగి

ఇదంతా మా వ్యాపార ప్రత్యర్థులు చేసిన కుట్ర అని, పట్టుబడ్డ వేశ్యతోనే సాక్ష్యం ఇప్పించి కోర్టులో కేసు కొట్టేయించింది. చాలా "ఘటికురాలే"– అని మా వ్యాపార ప్రత్యర్థులే అన్నారప్పుడు. ఆఖరిగా ఇంకోటి చెబుతాను. కొంచెం నలతగా ఉందని వైద్యపరీక్షలు చేయించుకుంటే నా రెండు కిడ్నీలు చెడిపోయేయన్న భయంకర సత్యం తెలిసింది. ఇకనా పనైపోయిందని ఏడుస్తుంటే, కేవలం సముదాయించడానికే కాబోలు మా అమ్మ నా తల నిమురుతూ అంది, "భయపడకురా కన్నా – నీకేం కానీయదు మీ ఆవిడ– సతీసావిత్రిలా నీ ప్రాణాన్ని కాపాడుతుంది' అని. 'నిజంగానే అదే జరిగింది'. వివరాలు మాకెవరికీ తెలియనీయకుండా ప్రతిభ నాకు "మూత్రపిండ మార్పిడిఆపరేషన్"కి అన్ని ఏర్పాట్లు చేసింది. భర్తని మృత్యుముఖం నుండి రక్షించిన ఘటికురాలు బాబూ మీ ఆవిడ" అని నాకు ఆపరేషన్ చేసిన డాక్టరు గారు అన్నప్పుడు తన కోసం చుట్టూ చూశాను. కనపడలేదు. 'నీ ఆపరేషన్ సక్సెస్ అయింది. నీ భార్యేనీ కిడ్నీదాత' అని డాక్టరుగారు అన్నప్పుడు నాకు అసలు విషయం – అదే ప్రతిభ చేసిన త్యాగం గురించి తెలిసింది. 'మీ ఆవిడ పక్కరూమ్ లోనే ఉంది. త్వరలోనే కోలుకుంటుంది' అని డాక్టరుగారు చెప్పారు. కానీ..." ఇంక మాటలు రాక సుందరం భోరున ఏడ్వసాగాడు.

"ఏమైంది? సత్యం, శివం ఒకేసారి అరిచారు. "ప్రతిభ కోలుకోలేదు. ఏదో ఇన్ఫెక్షన్ వచ్చి ఎంత చికిత్స జరిగినా నెలరోజుల తర్వాత కోమాలోకి వెళ్ళిపోయింది. రెండురోజుల్లో నన్ను శాశ్వతంగా విడిచిపోయింది. చనిపోయింది. కాదు తను చచ్చిపోలేదు. మూత్రపిండం నాకు దానమిచ్చి నాలో బతికి ఉంది. అంతేకాదు, తను కోరిన ప్రకారం బ్రెయిన్‌డెడ్ అయిన తర్వాత తన శరీరంలోని మరికొన్ని భాగాలు – గుండె, లివర్, ఊపిరితిత్తులు, రెటీనా వంటివి తీసి, మరో అయిదుగురు సంబంధిత రోగులకు అమర్చారు. ఆవిధంగా నా "ఘటికురాలు" నాతోపాటు మరో ఐదుగురు మనుషుల్లో జీవిస్తున్నది".

ముగ్గురు మిత్రులూ చాలాసేపు మౌనంగా ఏడుస్తూ ఉండి పోయారు.

(అమ్మనుడి" 2015 మే నెల సంచికలో ప్రచురితమైంది)

# సార్థక నామధేయుడు, 'సాహస్'

'ఉత్తర సాహస్ కుమార్', ('ఉత్తర' ఇంటి పేరులెండి) పసివాడిగా ఉన్నప్పుడు, మాటిమాటికి చిన్నచిన్న శబ్దాలకే ఉలికిపడటం, చీకటంటే భయపడటం, అమ్మని తప్ప అందర్నీ అపనమ్మకంగా, బెదురుచూపులతో చూడటం, అకారణంగా గుక్కపట్టి ఏడ్వటం, చేసేవాడు. ఇది గమనించిన వాడి నాన్న'ఉత్తర ఉత్తమ శాస్త్రి' కి, బాగా బెంగ పట్టుకుంది, అంత అందంగా దృఢంగా కూడా ఉన్న తన కొడుకు పెద్దయ్యాక కూడా పిరికి పందలా మిగిలిపోయి, బతకటానికి బాగా 'ఇబ్బంది' పడతాడేమోనని! వాడిని సరైన పెంపకం, శిక్షణ ద్వారా 'సాహసశీలి' గా తీర్చిదిద్దటం తండ్రిగా తన 'కర్తవ్యమని', నిర్ణయించుకున్నాడు. అందుకు నాందిగా నామకరణ మహోత్సవం నాడు 'నీనాన్న పేరు పెట్టరా', 'మా నాన్న పేరు పెట్టండి' అన్న అమ్మ, భార్యామణిల అభ్యర్ధనలను పెడచెవిన పెట్టి, బియ్యంలో 'సాహస్ కుమార్' అని వ్రాసి మనసులో 'మావాడిని సార్ధక నామధేయుడిని చెయ్యాలి స్వామీ' అని దేవుడిని వేడుకున్నాడు. తన వంతు 'మానవ ప్రయత్నాలలో' భాగంగా, పిల్లవాడికి ఆడుకోవడానికి దెయ్యాల, రాక్షసుల, భారీ సర్పాల క్రూర మృగాల బొమ్మలనే ఎక్కడికెక్కడికో వెళ్లి సేకరించి ఇచ్చేవాడు.

"ఇదేం చోద్యం",! అని అమ్మ లక్కలు బుగ్గలు నొక్కుకున్నా లెక్క చేయలేదు. పిల్లాడిని నిద్రబుచ్చడానికి మంద్రంగా జోలపాటలు పాడుతున్న తల్లిని కసిరి పంపేసి, భీకర శబ్దాల 'మ్యూజిక్ రికార్డులు' పెట్టేవాడు. వాడికి మూడు నాలుగేళ్లొచ్చాయో లేదో, తన వళ్లో కూర్చో పెట్టుకుని, టీవీలో క్రూరమృగాల, పోరాటాలను, "హారర్ సినిమాలను", యుద్ధాల సీన్లను చూపించేవాడు. బాలుడు భయపడిపోయి, గుక్కపట్టి ఏడ్చినా, ఆపేవాడుకాదు. రాత్రుళ్లు కుమారుడిని పక్కలో పడుకోబెట్టుకుని, వీరుల, ధీరుల కథల్ని చెప్పేవాడు. ఇవి మాత్రం సాహస్, ఇంచక్కా వినేవాడు. ఇంకా ఇంకా, చెప్పమనేవాడు. ఒకసారి శాస్త్రి నాలుగేళ్ల కుమారుడిని 'కన్నా నీకునిప్పు అంటే భయమా' అని అడిగితే వాడు మహా తెలివిగా, ముద్దుముద్దుగా, "నిప్పుకి భయపడిపోతే 'బువ్వ' ఎలా వత్తాది నాన్న- దూరంగా ఉండాలంతే" అని అనే సరికి 'మావాడికి బుద్ధి బలం బాగానేఉంది. శారీరక బలం కూడా ఉండేలా

చేయాలని'తోచి, సాహస్‌కి అయిదేళ్లైనా నిండక ముందే, వాళ్లూరికి ఐదుమైళ్ల దూరాన ఉన్న నదీ తీరానికి రోజూ సాయంత్రం స్కూటర్ మీద తీసుకుని వెళ్లి, తనకూ రాదు కాబట్టి అక్కడి బెస్తవాళ్లకి బాగా డబ్బులిచ్చి, "ఈత" నేర్పించటం ప్రారంభించాడు. 'సాహస్ కూడాఎంతో ఇష్టంగా నేర్చుకుంటూ, త్వరలో బాగా లోతు నీళ్లలో కూడా, ఈత కొట్టటంలో ప్రావీణుడై పోయాడు. దాంతో తృప్తిపడి ఊరుకోకుండా, కరాటే 'శిక్షణ'కి కూడా పంపించేడు. ఒకటిరెండు సార్లుబాగానే దెబ్బలు తగిలినా, సాహస్ మానేస్తానని అనకపోవటంతో 'మనవాడు' బాగానే రాటుదేలుతున్నాడని ఆనందపడిపోయాడు శాస్త్రి.

అయితే, సాహస్‌కి, పదేళ్లవయసు వచ్చిన తర్వాత జరిగిన రెండు 'ఘటనలు' తండ్రిని కలవరపరిచాయి. ఒకరోజు సాయంత్రం కాస్త పొద్దెక్కాక తల్లి గాయత్రి ఒరే, కాస్త ఈ పుస్తకం పక్క వీధిలో ఉండే మాశారదత్తయ్యకి ఇచ్చి రారా' అని పురమాయిస్తే, సాహస్ 'ఇంత' రాత్రి పూట ఎందుకులే అమ్మా రేపు 'పగటిపూట, వెళ్తాలే' అని గొణిగేసి తన గదిలోకి దూరిపోయేడు. తల్లీ 'సరేలే', అని ఊరుకుంది గాని, తండ్రిమదిలో అనుమానభూతం దూరింది. వీళ్లింటికి, ఆ శారదత్తయ్య ఇంటికి మధ్యలో దారిలో ఉన్నఒక నిర్మానుష్య మైదానంలోని చింత చెట్టు మీద 'దెయ్యం' ఉందన్న పుకారు ఊళ్లో ఉంది! దానికి భయపడే 'సాహస్' అమ్మచెప్పిన పనిని రేపటి పగటి పూటకి వాయిదా వేశాడేమోనన్న అనుమానం రానే వచ్చింది, శాస్త్రికి. కాని 'ఇప్పుడేవెళ్లు' అని కొడుకుని పిల్చి శాసించ లేకపోయాడు, ఎంతైనా, తండ్రి మనసు కదా తనది! మౌనంగానే ఉండి పోయేడు.

ఇంకో రెండు రోజుల తర్వాత శాస్త్రికి, సంతలో యాదృచ్ఛికంగా, ఒకాయన కలిసి తను, సాహస్ 'క్లాస్ టీచరున'ని పరిచయం చేసుకున్నాడు. మాటల్లో యధాలాపంగా 'మీవాడు, మరీ మెతకఅండీ' బల్లి అన్నా గజగజా వణికి పోతాడు. తన కన్నా బక్కవాడు తిట్టినా కిమ్మనడు. ఏంటో చాలా మెతక అన్నాడు, 'పిరికి పంద' అనలేదు. అయినా, శాస్త్రి గుండెల్లో నిరాశా గునపం గుచ్చుకుంది. 'తన ప్రయత్నాలన్నీ వృథా అయ్యాయా', అన్న ఆందోళనతో వళ్లుమండింది–మనసు కూడా– తర్వాత రెండు రోజులు శాస్త్రిగారు కొడుకుని ఏమీ అడగలేదు గాని

అనుక్షణం ఎంతో మధన పడిపోయారు మనసులో 'ఇన్నితంటాలు పడుతున్నానా కొడుకు, 'ఉత్తర సాహస్ కుమార్' "సాహస్" లోపించిన "ఉత్తర కుమార్" లా మిగిలిపోతున్నాడా'- అని. కాని మూడో రోజు ఉదయాన జరిగిన 'సంఘటన'తో, ఆయన ఉబ్బితబ్బిబ్బై పోయేడు. ఆరోజు ఉదయం, ఊళ్లోని పెద్దలు, పిల్లలు, స్త్రీలు ఊరి మధ్యలో ఉన్న ఒక చెరువుగట్టు మీద గుమిగూడి ఉన్నారు, గ్రామ దేవత 'గంగానమ్మ' పూజ సందర్భంగా–తోపులాట మూలం గానో, గట్టు చివరకు చేరితేనో, మట్టిపెళ్ల విరిగితేనో, ఎనిమిదేళ్ల 'బాలుడు'. ఒకడు, చెరువులో పడిపోయి మునకలు వేస్తూ అలల తాకిడికి ఇంకా లోపలికి, లోతుల్లోకి కొట్టుకు పోసాగేడు. గట్టు మీదున్న జనాలంతా హాహాకారాలు చేశారు–నేటి స్మార్ట్ ఫోన్ (కలి) 'యుగ ధర్మానికనుగుణంగా' కొంతమంది యువకులు, ఆ బాలుడు నిస్సహాయంగా కొట్టుకుపోతున్న, మునిగిపోతున్న వైనాన్ని, అత్యుత్సాహంగా వీడియో తీయసాగేరు! అంతేగాని, బాలుడిని రక్షించడానికి ఎవరూ పూనుకోలేదు!! అక్కడున్న స్త్రీలు వాడి దుస్థితికి జాలిపడుతూనే, తమ తాలూకు మగవాళ్లని, కళ్లతోనే శాసిస్తున్నారు, వారిస్తున్నారు పిచ్చివేషాలు అంటే "ప్రాణాంతకపు పనులు" చేయొద్దని...

నిజమే మరి చెరువునిండా తామరతూళ్లు పెరిగిపోయి ఉన్నాయి. ఇంతలో "ఆహా–ఓహెూ–లతో కూడిన జయధ్వానాలతో పరిసరాలన్నీ మోగిపోయాయి. మరి, ఎప్పుడు దూకాడో ఏమో, శాస్త్రితో సహా ఎవరూ గమనించలేదు గాని, 'సాహస్ కుమార్' చెరువు మధ్యలోకి 'బారఈతతో' చేరుకుని, మునిగిపోతున్న బాలుడిజుత్తుపట్టుకుని వేగంగా గట్టు మీదికి లాక్కొచ్చేశాడు. తను ఒగురుస్తూనే వాడిపొట్ట నైపుణ్యంగా నొక్కి, తాగిన పసరు నీళ్లన్నీ కక్కించేశాకనే తలపైకెత్తి చూశాడు అందర్నీ", నాన్న శాస్త్రి గారి ముఖంలోకి మాత్రం సగర్వంగా చూశాడు. ఆయనా ఆనందం పట్టలేక గర్వంగా, గాఢంగా కుమారుడిని హృదయానికి హత్తుకుని వలవలా ఏడ్చేశాడు, ఇంతటి "ధీరుడి"ని, తను 'ఉత్తరకుమారుని' గా 'పిరికి పంద'గా తప్పుగా అర్థం చేసుకున్నానన్న పశ్చాత్తాపంతో స్మార్ట్ యువకులు తమ స్మార్ట్ ఫోన్‌లలో అతి స్మార్ట్‌గా ఈ రక్షణ కార్యకలాపాన్నంతా చిత్రీకరించేశారు. ఊరి సర్పంచ్‌కి, జిల్లా కలెక్టర్ సన్నిహిత బంధువు ద్వారా, కలెక్టర్ గారికి ఈ సమాచారంమంతా,

వీడియో సాక్షాలతో సహా, రాష్ట్ర కేంద్రప్రభుత్వాలకి చేరింది. స్థానికమీడియా ప్రతినిధులు ఆగమేఘాల మీద ఇక్కడికి చేరుకుని, "సాహస్" అతని తల్లితండ్రులనే కాదు సహచర విద్యార్థులను, ఉపాధ్యాయులను కూడా ఇంటర్వ్యూలు, చేసి పలు విధాలుగా 'సాహస్, సాహసచర్యకు" బహుళప్రాచుర్యం కల్పించారని వేరే చెప్పాలా?

ఈ సంఘటన జరిగి నెల గడిచిందో లేదో, రాష్ట్రపతి ప్రతి సంవత్సరం ప్రకటించే సాహసబాలల జాబితాలో 'ఉత్తర సాహస్ కుమార్' పేరు, చోటు చేసుకుంది. తర్వాత వచ్చిన 'రిపబ్లిక్ డే' కి రాష్ట్రపతి భవన్' కి వచ్చి అవార్డ్ తీసుకోమన్న ఆహ్వానం కూడావచ్చింది. ఒకసారి 'ప్రఖ్యాతి' వచ్చాక ఏ వ్యక్తికైనా, ఆత్మ విశ్వాసంతో పాటు ఇంకా గొప్ప వాడిని కావాలన్న పట్టుదల పెరుగుతుంది కదా. ఆదే జరిగింది. బంగారానికి తావి అబ్బినట్లు ధైర్యం పెరగటంతో బాటు సాహస్‌కి బుద్ధి బలం కూడా పెరుగుతూ వచ్చింది. గుడ్డిగా మంటల్లోకి దూకటం లాంటివి చేయలేదు గాని, అడపాదడపా మరిన్ని సాహసకార్యాలు చేశాడు. ఉదాహరణకి ఒకసారి ఒకస్థూలకాయురాలు నూతిలోకి దూకితే తనూ ఆ ఇరుకు బావిలోకి దూకలేదు! అలా చేస్తే ఇద్దరూ ఇరుకు బావిలో చచ్చేవాళ్ళు. ఒకతాడు అందించి తన బాహుబలంతో పైకి లాగేడు ఆమెని. ఇంకోసారి ఒక ఎలుగుబంటి ఊళ్లోకి చొరబడి, స్వైరవిహారం చేస్తోంటే, దాంతో తలబడలేదు, గుడ్డిగా! తెలివిగా బంధించి, అటవీశాఖ అధికారులకు అప్పజెప్పాడు. మరోసారి ఒకపెద్ద కొండచిలువ ఎందుకో, ఎలాగో, ఊళ్లోకి వచ్చి మత్తుగా పడుకుని ఉండిపోతే, దాన్ని కవ్వించ కుండా, నోట్లో తలపెట్టకుండా, యుక్తిగా పెద్దగోనెసంచిలో దూరేలా చేసి, తర్వాత అడవిలో వదిలే ఏర్పాటు చేశాడు. వీటన్నిటికీ కూడా, రాష్ట్రవ్యాప్త ప్రచారం లభించింది.

శాస్త్రి గారు, ఆ విధంగా జన్మత: పెద్ద ధ్కైర్యశాలి కాదని తననుకున్న కుమారుడు సాహస్ 'సార్థక నామదేయుడయ్యాడన్న తృప్తితో, సాహస్ బి.ఏ. పట్టా తీసుకున్న కొద్దిరోజుల పిమ్మట మరణించారు. ఆయన మరణించడానికి ముందే, సాహస్‌కి రాష్ట్ర పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో 'ఎస్సై' గా ఉద్యోగ నియామక పత్రం అందింది. అదెలా జరిగిందంటే, ఊరి సర్పంచ్ అప్పటికి రాజకీయంగా ఎదిగి

రాష్ట్ర మంత్రి అయ్యాడు. గతంలో జిల్లాకలెక్టర్‌గా పని చేసిన ఆయన రాష్ట్ర హోంశాఖకి ప్రిన్సిపల్ సెక్రటరీ అయ్యాడు. వీళ్లిద్దరూ పూనుకుని. మంత్రివర్గంలో ప్రత్యేకంగా తీర్మానం చేయించి, ఒక 'జీవో' ద్వారా ఎటువంటి ప్రవేశ పరీక్ష లేకుండా ఆ నియామకం చేయించారు. అందుకు గతంలో సాహస్‌కి వచ్చిన రాష్ట్రపతి అవార్డ్ దోహదపడిందిలెండి. ఆ ఉద్యోగంలో తప్పకుండా చేరమని కుమారుడిని ప్రోత్సాహించడమే కాదు ఎప్పటికైనా 'ఐ.పి.యస్'వి కావాలని ఆశీర్వదించడం కూడా జరిగింది. తర్వాతనే శాస్త్రిగారు మరణించారు. 'ఎస్సైగా' డ్యూటీలో చేరి, శిక్షణాకాలం పూర్తయ్యాక, సివిల్స్ రాయాలి అన్న తండ్రి అంతిమ కోరిక తప్పక తీర్చాలని సాహస్ అనుకోక పోలేదు. కాని అన్నీ అనుకూలించాలి కదా! వెంటనే సివిల్స్ రాయటం సాధ్యపడలేదు. వివిధ కారణాల వల్లపై అధికారులకు సాహస్ గత చరిత్ర తెలిసినందున, 'రఫ్ అండ్ టఫ్' కేసులన్నీఅతనికే అప్పజెప్పేవారు, కొందరు అభిమానంతో, కొందరు అసూయతో!

ఒకరకంగా చెప్పాలంటే, చేస్తున్నది అట్టడుగు స్థాయి ఉద్యోగమే అయినా అతనికి ఎన్నోసార్లు చెప్పుకోదగ్గ 'సాహసకార్యాలు' చేసే అవకాశాలు, 'అనివార్యతలూ' కూడా ఏర్పడేవి. అదృష్టం కలిసొచ్చి చాలా సార్లు విజయాలు సాధించడమే కాదు, వాటికి తగు ప్రచారం కూడా లభించేది.

డ్యూటీలో చేరి మూడు సంవత్సరాలు పూర్తయింది. వేరే పోలీస్ స్టేషన్ పరిధిలో రాష్ట్రవ్యాప్తంగా సంచలనం సృష్టించిన ఒకఘోర సంఘటన, దారుణం జరిగింది. 'మునీర్' అనే పాతికేళ్లకాముకుడు, కీచకుడు, పక్కింటి పదేళ్ల బాలిక పై ఏకాంతంగా ఉన్నప్పుడు అత్యాచారం చేసి అంతటితో ఆగకుండా, పెట్రోల్ పోసి తగలబెట్టి పారిపోయేడు. 75 శాతం కాలిన గాయాలతో ఆ బాలికను హాస్పిటల్‌లో చేర్పించారు ఎవరో. రెండురోజులు మృత్యువుతో పోరాడి, మరణించే ముందు, ఆపిల్ల మేజిస్ట్రేట్ సమక్షంలో నిందితుడెవ్వరో స్పష్టంగా చెప్పింది. వాడిని పోలీసులు అరెస్ట్ చేశారు గాని తగిన సాక్ష్యాధారాలు సమర్పించలేదన్న కారణంగా పదిరోజుల్లోపే బెయిల్ దొరికింది వాడికి.

దాంతో సమాజం అట్టుడికి పోయింది. మహిళా సంఘాలు ఉద్యమాలు

చేశాయి. తప్పని పరిస్థితుల్లో, మళ్లీ ఆ 'నిందితుడిని జైల్లో పెట్టక పోతే నేను ఆత్మహత్య చేసుకుంటానని', మరణించిన బాలిక తల్లి ప్రకటిస్తే, వేరే ఏదో కేసులో అరెస్ట్ చేసి 'మునీర్' ని మళ్లీ జైల్లో పెట్టారు పోలీసులు. వారానికోసారి జైలు నుండి నిందితుడిని కోర్టులో హాజరు పరుస్తున్నారు, గాని సరైన సాక్ష్యాధారాలు సమర్పించటంలో విఫలమవుతూనే ఉన్నారు. 'ఫాస్ట్‌కోర్టు'లో కేసు నత్త నడకన సాగుతూనే ఉంది. అంతవరకుఈ కేసుతో సాహస్ కి సంబంధం లేదు. కాని 'మునీర్' ఎవరో తెలుసు!!

ఒక శుభోదయాన దృశ్య మీడియాలో "బ్రేకింగ్ న్యూస్" అని, అన్ని వార్తా పత్రికలలో పతాకశీర్షిక 'కీచకుడు' 'మునీర్ ఎన్‌కౌంటర్' అని వచ్చింది. అయితే పోలీసుల వెర్షన్ ఈ విధంగా ఉంది. "నిందితుడు నిన్న సాయంత్రం పొద్దుపోయాక 'గుండె నొప్పి' అని నాటకమాడటం మొదలెట్టాడు 'రిస్క్' లేదా ఛాన్స్ తీసుకోకూడదు కాబట్టి, 'ఎస్కార్ట్‌తో', జీప్‌లో వాడిని సత్వర చికిత్స కోసం తరలించటం జరిగింది. అయితే దారి మధ్యలో ఒకనిర్మానుష్య ప్రాంతంలో (ఆ దారిలో ఎందుకు వెళ్తున్నారో వివరణ లేదు) నిందితుడు (బేడీ లెందుకు లేవో ఆ వివరణా లేదు) కానిస్టేబుల్ చేతులోంచి గన్‌లాక్కుని జీపులోంచి దూకేసి గన్ పేలుస్తూ పారి పోసాగేడు. "ఎస్కార్ట్ బృందం" "అధికారి, ఇతర పోలీసులను వాడి గన్ కాల్పుల నుంచి రక్షించటం కోసం అనివార్య పరిస్థితుల్లో తన పిస్టల్‌తో నిందితుడిని "హతం" చేయాల్సొచ్చింది. డిపార్ట్‌మెంట్ అధికారికంగా ప్రకటించక పోయినా 'ఎన్‌కౌంటర్' చేసిన పోలీస్ అధికారి ఎవరో, ఎలా వెల్లడైందో గాని, ఆ రోజే ఒక ఫొటో పట్టుకుని దానిపై పూల వర్షం కురిపిస్తూ ప్రజా సంఘాలు ఊరేగింపులు చేశాయి. అతని పేరుకి జిందాబాద్‌లు, ఇంతకీ ఆ ఫొటోలోని వ్యక్తి 'ఎస్సై సాహస్'!! మరి పై అధికారుల ఆదేశాల ప్రకారమేమో గాని, సాహస్ మీడియాతో సహా, ఎవరికీ అందుబాటులోకి రాలేదు. అజ్ఞాతంలోకి వెళ్లిపోయాడు!

ఒక మానవహక్కుల సంఘ ప్రతినిధినని చెప్పుకునే ఓ అనామకుడు "చట్టవిరుద్ధంగా, ముందస్తు ప్రణాళిక ప్రకారం, ఏదో వ్యక్తిగత కక్షసాధింపు కోసం, ఇంకా ఏ నేరం రుజువు కాని అమాయకుడిని దారుణంగా హత్యచేసిన సాహస్‌ని

అరెస్ట్ చేసి, శిక్షించాలని సర్వీస్ నుండితొలగించాలని ప్రకటన చేశాడు. అంతే వెంటనే ప్రజలు తీవ్ర ఆవేశాగ్రహాలకి లోనయ్యారు. ఆ రాత్రే ఆ నే(మే)త గాడిఇంటి పై మూకుమ్మడి దాడి చేశారు. ఇంటితోపాటు వాడిని, కుటుంబంతో సహా సజీవ దహనం చేయడానికి సంసిద్ధులయ్యాదు. అప్పుడు ఎక్కడి నుండి వచ్చాడో ఏమో, ఒకవ్యక్తి వచ్చి, చేతులు జోడించి చట్టవ్యతిరేక చర్యలు చేయరాదని, వద్దని మందలించాడు. 'వీడినే ముందు చంపేద్దాంరా అని అరుస్తూ కొందరు దృఢకాయులు మారణాయుధాలతో ముందుకు దూకారు.కాని వెంటనే నిరాయుధుడిగా ఉన్న ఆ వ్యక్తి మఫ్టీలో ఉన్న "సాహస్"గా గుర్తించి వెనక్కి తగ్గారు. ఇదంతా మీడియా 'వీడియో'గా చిత్రీకరించింది. అతను ఆరోజు ఎస్కార్టు బృందానికి నాయకత్వం వహించటం కేవలం యాదృచ్ఛికమని తేల్చింది! వారం రోజుల తర్వాత రాష్ట్ర రాజధానిలో 'సాహస్' కి అభినందన సభజరిగింది. సభాధ్యక్షుడు, ముఖ్యమంత్రి. 'ఇంతటి గొప్ప పోలీస్ అధికారి ఉండటం మన రాష్ట్రానికి గర్వకారణమని ఇంకా ఏదేదో చెప్పి, ఆఖర్లో'సాహస్' కి వెంటనే 'ఐ.పి.యస్', హోదాఇవ్వమని, రాష్ట్ర మంత్రివర్గంలో తీర్మానం చేయించి, ఆ ప్రతిపాదనని ఇక్కడికి రావడానికి ఒక గంటముందే కేంద్ర ప్రభుత్వానికి పంపించామని ప్రకటిస్తే, సభికులంతా హర్షామోదాలతో చాలాసేపు చప్పట్లు కొట్టేరు.

సభ ఆఖర్లో 'సాహస్' తన తండ్రి ఆశీర్వాదాలు ఫలించాయని, అర్హతకు మించి అదృష్టవశాత్తు మాత్రమే తనకింత పేరు వచ్చిందని వినయంగా చెబుతూ, మరో రెండు విషయాలు చెప్పి అందర్నీ ఆశ్చర్యపరిచాడు. మొదటిది, తన చేతుల్లో అనివార్య పరిస్థితుల్లో హతమైన వాడు చిన్నతనంలో చెరువులో మునిగిపోకుండా తన ద్వారానే రక్షించబడిన 'మునీర్' అని, వాడిచావుకు చాలా బాధపడుతున్నానని, రెండోది ఇంకా విస్తృత స్థాయిలో ఏ హోదాలోనైనా, దేశ సేవ చేయాలని అవసరమైతే ప్రాణత్యాగం చేసైనా సరే ఉగ్రవాదులను మట్టు పెట్టే అవకాశాలు చిక్కించు కోవాలన్న ధ్యేయంతో తను ఒకనెల క్రితమే మిలటరీ ఇంటెలిజెన్సు విభాగంలో డిప్యూటేషన్ కోరుతూ దరఖాస్తు చేసుకున్న విషయం.

రచనాకాలం - 2016

# "పంచ్"్రావు

నా కన్న అయిదారేళ్ళ పెద్దయిన "పెంచ్రావు" నాకు స్వయానా మేనమామ–'మా నాన్న పేరు పెట్టాల్సిందేనని, వాళ్ళమ్మ మంకు పట్టుపట్టి నందు వల్ల తన పేరులా పాతకాలం పేరు కొడుకుకి ఉండకూడదనుకున్నా, మాతాత 'నాంచారయ్య' అయిష్టంగానే, ఈ పేరు మావయ్యకి పెట్టడానికి ఒప్పుకున్నాడంట. తెలుగు పండితుడైన ఆయన తన కొడుకు కాలక్రమంలో "పంచ్రావుగా" ప్రసిద్ధుడవుతాడని అనుకోలేదేమో! బుడిబుడి మాటలు పలకటం ప్రారంభించిన బాల్య వయసులోనే పెంచ్రావు, మావయ్యకి అలవోకగా "పంచ్‌లు" విసిరే సామర్థ్యం అలవడిందనడానికి ఉదాహరణగా, ఒక ఉదంతాన్ని ఆయనే ఎన్నోసార్లు మురిసిపోతూ చెప్పటం నేనూ విన్నాను. అదేంటంటే, మామయ్యకి ఐదేళ్ల వయసున్నప్పుడు ఇంట్లో పనిచేసే, అప్పటికింకా పెళ్లికాని, పదహారేళ్లపడుచు, "ఏం పిల్లాడివయ్యా బాబూ చెప్పే పని ఒక్కటీచెయ్యవు, ఎంత కోపగించుకున్నా బతిమాలినా కూడా? నిన్ను దారిలోకి తేవాలంటే, ఏం చెప్పినా బుద్ధిగా చేయించాలంటే నేనేం చెయ్యాలో ఏంటో ఏమో?" అని మురిపెంగా అన్నదో లేదో, "నన్ను పెళ్ళి చేసుకుంటే చాలు" అని పరిష్కారం చెప్పేసాడంట, యమ సీరియస్‌గా మనోడు. దాంతో అది సహజంగానే సిగ్గుల మందారమైపోయి అక్కడి నుంచి పారిపోయిందంట. నేటికీ అంటే ఇది జరిగి ఇరవైఏళ్లు గడిచిన తర్వాత కూడా, అయిదుగురు పిల్లల్ని కన్న ఆ ప్రౌఢ, మామయ్య ఎప్పుడైనా ఎదురు పడితే అలనాటి "పంచ్" గుర్తుకొచ్చి, పైట సర్దుకుంటూ పారిపోతుంది. ఆ "బాల్యపంచ్" మామయ్య సంధించినప్పుడు దగ్గర్లో ఉన్న ఇద్దరు మగాళ్లు (మొగుళ్ళు) ముందు ఇతరులతో పాటు హాయిగా నవ్వేశారు గాని, చుట్టూ ఉన్న ఇతర బంధువులు తమ వైపే తేరిపార చూస్తుంటే, "పంచ్"లోని అంతరార్థం తెలిసొచ్చి, తలొంచుకుని వెళ్ళి పోయారంట!

ఎందుకంటే వాళ్ళిద్దరూ తమ పెళ్లాల చెప్పుచేతుల్లో ఉండే, వాళ్ళేం చెప్పినా ఎదురు చెప్పలేని వాళ్ళుగా, ప్రసిద్ధులు గాబట్టి! పెంచ్రావు మావయ్య "చతుర్లు"– ఎందుకో మరి మా బంధువుల్లో కాస్త పెద్ద వాళ్ళు మావయ్య హాస్యపూరిత మాటల్ని ఇలానే అనే వాళ్ళు, నేను ప్రత్యక్షంగా పరోక్షంగా ఎన్నో విన్నాను, తెలుసుకున్నాను.

ఇలాంటి వాటిని "పంచ్‌లు" అంటారని నేను మొదటిసారి విన్న సందర్భం ఒకటుంది. ఒకసారి, నేనప్పుడు నాలుగో తరగతి మావయ్య పదోతరగతి, ఒకే స్కూల్లో చదువుతున్నప్పుడు జరిగింది. స్కూల్ వార్షికోత్సవ సభకు ముఖ్య అతిధిగా విచ్చేసిన ఒక రాజకీయ నాయకుడు తన పరంగా, తన పార్టీ ప్రభుత్వ పరంగా ప్రజల కోసం జరిగిన ఎన్నో"అభివృద్ధి కార్యక్రమాల" గురించి ఒక సుదీర్ఘ ఊక దంపుడు ఉపన్యాసమిచ్చి అందర్నీ ఎంతో విసిగించి, (నిజాని కది విద్యార్థుల సమావేశంలో చెప్పదగిన విషయాలుకావు, సందర్భం కాదు) ఆఖర్లో "పిల్లలూ, దేశం, మనరాష్ట్రం ఇంకా ముందుకు పోవాలంటే" మీరు, ప్రజలు ఏం చేయాలో చెప్పండి నిజాయితీగా" అని అడిగేడు. "దేశం రాష్ట్రం ముందుకు పోవాలంటే, మీ పార్టీ వెనకాల మేం ఉండకూడదను కుంటున్నాం సార్" అని అతి వినయంగా మామయ్య వెంటనే అనే సరికి సభంతా గొల్లుమంది. ఆయన ముఖం మాడిపోయింది. అప్పుడు నా పక్కనే ఉన్న ఒక ఉపాధ్యాయుడు "కుర్రాడైనా" మనోడు భలే "పంచ్" వేసాడ్రా దిమ్మతిరిగిపోయేలా, వీడిని "పంచ్‌రావు" అనే పిలవాలి అన్నారు,

నాటి నుండి పెంచల్రావు మామయ్యపేరు 'పంచ్‌రావై' పోయింది. అప్పటికే కొంచెం ఆంగ్లం తెలిసిన నాకు పంచ్ అంటే పిడిగుద్దు లాంటి అర్థముందని తెలుసుగాని ఇలాంటి హాస్యభరిత చురకల్ని "పంచ్" అని అంటారన్న అవగాహన లేదు. అందుకే ఆరోజే మామయ్యని ఇలాంటి వాటిని పంచ్ అని ఎందుకంటారో వివరించమని బతిమాలేను, ఏకాంతంగా ఉన్నప్పుడు కలిసి. నా దగ్గరున్న రెండు ఫైవ్‌స్టార్ చాక్లెట్లు చనువుగా తీసేసుకుని వాటిని చప్పరిస్తూ హీరోలా ఫోజుకొడుతూ చెప్పబూనుకున్నాడు ఇలా. పేరును బట్టి 'పంచ్' అనేది మనదేశంలో ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన క్రొత్త ప్రక్రియ అనుకోవటం పొరపాటు. మనుషులలో భాషలు ఏర్పడినప్పటి నుండి సంభాషణలు ఆరంభమైనప్పటి నుండీ, 'హాస్యం' 'వెటకారం', 'అపహాస్యం' 'ఎద్దేవా', వంటివి ఉంటున్నాయి వాళ్ల మధ్య మాటలలో! ఇందుకు ఉదాహరణలు మన పురాణాల్లో, ప్రాచీన సాహిత్యంలో కోకొల్లలు. గంగా గౌరీ సంవాదంలో పరమశివుని భార్యలిద్దరు, పరస్పరం వేసుకున్న "పంచ్"లు మనకు తెలుసు. అలాగే కృష్ణార్జునులు, రామాంజనేయులు, వాళ్ల మధ్య యుద్ధాలు

అనుకోకుండా జరిగినప్పుడు చేసుకున్న వాగ్యుద్ధాలూ మనకు ఎరుకే – శత్రువుల మధ్యనే కాదు, మిత్రుల మధ్య కూడా అలాంటివి ఉంటాయన్నమాటా కాదనలేం. “పంచ్ అన్న ఆంగ్ల పదాన్ని అనువదించ మంటే ‘చురక’ అన్నదే సరైన పదమని, “వెటకారం”, ఎద్దేవా వంటి పదాలు అంతగా సరిపడవని నేనంటాను. ‘చురక’ అంటే, మరీ ఎక్కువ మంట కాదని తెలుసుకో. అంటే దిమ్మతిరిగేలా ఉన్నా అవతలివాడు కూడా తర్వాత తలుచు కున్నప్పుడు కాస్తో కూస్తో ఆస్వాదించేలా, నవ్వుకునేలా ఉండాలన్న మాట మనపంచ్. “పంచ్” కొట్టడానికి, మరీ పాండిత్యం అవసరం లేదు. ఎక్కువ పదాలూ అవసరం లేదు. కొన్ని మామూలు పదాలతోనే “పంచ్” దంచొచ్చు. ఆ మాట కొస్తే కొన్ని సందర్భాల్లోనోరు తెరవకుండానే మాటలు లేకుండానే, పంచ్ కొట్టొచ్చు” కాస్త గుక్క తిప్పుకోవడానికి ఆగేడు.

“అదెలా సాధ్యం?” ఉండ బట్టలేక అడిగేశాను. నా ప్రశ్నకు మామయ్య సమాధానం చెప్పలేదు. మౌనంగా నెత్తికొట్టుకున్నాడు, “ఇంత వివరంగా చెబుతున్నా అర్థం కావటం లేదా! నీకు బుర్రుందా అసలు” అన్నట్టు చూశాడంతే. అలా నా మీదే మౌనంగా పంచ్ దంచాడని అర్థమై తలొంచుకున్నాను.

అయినా మళ్ళీ నోరు విప్పేడు. ఒక ఉదాహరణ చెప్పాల్రా. మా నాన్న ఒకసారి మా తరపు పూర్వీకుల గురించి గొప్పలు చెప్పడానికి ఉపక్రమిస్తే, “ఆపండి మీ సొద అనలేదు. ఒక్క మూతి విరుపుతో నోరు మూయించేసింది ఆయన్ని మా అమ్మ. అలా పంచ్‌లు వేసే సామర్థ్యం నాకు మా అమ్మ నుంచే సంక్రమించొండొచ్చు. ఇంకోసారి నాన్న అమ్మని అపహాస్యం చేసే ఉద్దేశంతో గేటుదాటి లోపలికి వస్తున్న ఓ గాడిదను చూపిస్తూ “మీ చుట్టం లోపలికి వస్తోంటే అలా చూస్తూ ఉండి పోతున్నా వేంటి? అంటే వెంటనే “పెళ్ళయ్యాక కలిసిన కొత్త చుట్టరికం కదా వెంటనే గుర్తుపట్టలేక పోయాను. క్షమించండి.” అని చాలా మందికి తెలిసిన పాత పంచ్ ఇచ్చింది. నాన్న ఏడ్వలేక నవ్వేశాడు. పాతవైనా సమయస్ఫూర్తిగా వాడితే బాగా పేలతాయని చెప్పడానికే ఈ ఉదాహరణ. కాబట్టి తెనాలి రామలింగడు వంటి వారి భావోక్తులు, ఆరుద్ర, శ్రీశ్రీ వంటి వారి ఛమ్మక్కులను చెతురులనుకూడా మనం సందర్భోచితంగా వాడి అందర్నీ రంజింపచేయవచ్చు. కొత్తగా సృష్టించాలనే కాదు. మంచి ‘పంచ్’గా పరిగణించ బడాలంటే మరీ మోటుగా ముఖం మీద

కొట్టే పిడిగుద్దులా ఉండకూడదు. కొంచెం హాస్యం, వెటకారం, చతురత, సమయస్ఫూర్తి, కలగలిపినట్లుండాలి సమపాళ్లలో. మరీ సుతారంగా ఉండాలని అనను. కాదంటే  ఎవరి మీద ప్రయోగించామో వాళ్ళు తిరిగి ఏమీ అనలేని విధంగా అంటే "రివర్స్  పంచ్" విసిరే అవకాశం లేకుండా ఉంటే మంచిది. చుట్టూ ఉన్నవాళ్లు వెంటనే అర్థం చేసుకునేలా, హాయిగా నవ్వుకునేలా కూడా ఉండాలి. మరీ చాంతాడులా  కాకుండాను, ఉండాలి. ఎంత క్లుప్తంగా ఉంటే అంత బాగా "పేలుతుంది".

ఉదాహరణకి ఎవరైనా చాలా సేపు వాగి వాగి ఆఖర్లో మాట వరసకి నీకు "బోరు కొట్టానా" అని అడిగినప్పుడు "పర్వాలేదు" అని క్లుప్తంగా అంటే అదే చాలు అదే పెద్ద పంచ్  అవుతుంది కదా! అన్నట్టు, మాటల్లేకుండా కేవలం హావభావాలతో పంచ్ కొట్టొచ్చు అని చెప్పాను కదా. ఒక్కోసారి చిన్నచిన్న చర్యల ద్వారా కూడాఎదుటి వాడి మనసులోని ఆలోచనలను పంచ్ కొట్టొచ్చు అంటూ నా చేతిలో పదిహేను రూపాయలు పెట్టేడు. 'ఇదంతా చెప్పడానికి ఫీజుగా నా రెండు చాక్లెట్లు కొట్టేశాడు  కదా' అన్న నా మనసులోని ఆలోచనకు ప్రతిగా పంచ్ కొట్టాడలా, మా  పంచ్‌రావు మామయ్య! అప్పటి నుండి మావయ్యంటే నాకు చాలా 'హీరోవర్షిప్' పెరిగి పోతూనే వచ్చింది. అందుకు ప్రధానం కారణం, తర్వాతి కాలంలో అతను సంధించిన కొన్ని పంచ్‌లు, లేదా ఛలోక్తులు – కొన్ని ఉదాహరణలు చెప్పుకుందాం.

ఒకసారి ఏదో పెళ్ళిలో, "పీటల మీద ఉన్న పెళ్లికొడుకు అత్యుత్సాహంతో తనతో తెగమాట్లాడేస్తోంటే, "పాపం పెళ్లికూతురు సిగ్గుగా మౌనంగా ఉండిపోతోంది". అని ఎవరో అన్నప్పుడు, మామయ్య క్లుప్తంగా సీరియస్‌గా "రేపటి నుండిపరిస్థితి తారుమారై పోతుంది లెండి" అని అందర్ని తెగ నవ్వించేడు. ఎవరి ముఖం మాడిపోయిందో వేరే చెప్పాలా? ఫలానా ఆయన ఆఫీసులో తన కింద పనిచేసే వాళ్లందరిని "పులి" లా గడగడలాడించేస్తాడని ఎవరో అంటే, 'మరి ఇంట్లో' అని అమాయకంగా క్లుప్తంగా ప్రశ్నించి ప్రాచుర్యంలో ఉన్న సామెతను అన్యాపదేశంగా గుర్తుకుతెచ్చి అందర్నీ నవ్వించేడు. ఒకావిడ వాళ్లాయన గురించి చాలా గొప్పగా చెప్పినప్పుడు అందరిలా విని ఊరుకోకుండా "మీ వారు ఇక్కడే ఉన్నారు కాబట్టి

ఇలా చెబుతున్నారా?" అనేసి దంపతులిద్దరితో సహా అక్కడున్నవాళ్లందర్నీనవ్వించేడు – ఒకాయన వాళ్లావిడవిధేయత గురించి చెబుతూ "తనకి నామాట 'శిలాశాసనం', నేనేం, చెయ్యమన్నా ఎదురు చెప్పకుండా చేసి తీరుతుంది" అన్నప్పుడు "ఒకవేళ మీరు ఒకపెద్ద శిలతో నా తల పగలగొట్టు అని శాసిస్తే ఏం చేస్తుంది"? అని కొంటెగా ప్రశ్నించాడు. ఇంకొకాయన "మా ఆవిడనేను ఎంత తిట్టినా కిమ్మనదు అంటే "ఆవిడకి పుట్టు చెముడా పాపం" అని అమాయకంగా ముఖం పెట్టి అడిగేడు – ఇలా ఎన్నో పంచ్‌లు.

కాలక్రమేణా ఇద్దరం గురుశిష్యులుగా పెద్దవాళ్లమయ్యాం. నేను కాలేజీలో ప్రవేశించే నాటికి అతనికి పెళ్లీడొచ్చింది–పెళ్లిచూపులకు నేనూ వెళ్లేను– ఆ అమ్మాయి పినతండ్రి చాదస్తంగా చాలా చెప్పుకొచ్చాడు–ఇది నా స్వంత అన్నకి ఒక్కగానొక్క కూతురు. మా అన్న వదిన తన చిన్నప్పుడే చనిపోతే, నా స్వంత కుమార్తెలా పెంచేను. దాన్తో పాటు మా అన్న వదినల ఆస్తినీ బాగా పెంచేను–'అన్న వాస్తవాన్ని చెప్పినప్పుడు, మనవాడు సానుకూలమైన పంచ్‌లు కూడా ఉంటాయని, పాత సామెతల్ని కూడా పంచ్‌లా మలుచుకోవచ్చని నాకు రుజువు చేయడానికే అన్నట్లుగా', "మీరు చేనుమేయని కంచెలాంటి వారు" అని నిజాయితీ ధ్వనిస్తూ అన్నాడు. దాంతో ఆయన డంగైపోయి, ఆనందంతో తబ్బిబ్బైపోయి, పెద్దగా ఆస్తి లేనివాడని సంకోచించకుండా, సంబంధాన్ని ఖాయం చేసేశాడు.

అలా మావయ్య పెళ్లి కుదిరి పోయినప్పుడు అతని ముఖంలో అంతులేని ఆనందం తాండవించింది– ఆది గ్రహించిన నాకు అతను తరచుగా వేసే రెండు పంచ్‌లు గుర్తుకు వచ్చేయి. ఫలానా ఆవిడకి పెళ్లి కుదిరిందనిఎవరైనా చెప్పినప్పుడు, 'అయ్యో పాపం' అని జాలిగా అని అందర్నీ నవ్వించేవాడు. అలానే "ఫలానావాడు ఎప్పుడూ ఏడుపుగొట్టు, ముఖంతో ఉంటున్నాడు అంటే, 'మరి ఈ మధ్యనే పెళ్లయింది కదా వాడికి, అని పంచ్ దంచేవాడు. అందుకే నాకు పెళ్లి కుదిరినందుకు ఎంతో తబ్బిబ్బై పోతున్న మావయ్య మీద ముందుందులే ముసళ్ల పండగ' అని పంచ్ వేద్దామా అనిపించింది. కాని "రివర్స్ పంచ్" వేసి నన్ను నగుబాటు చేస్తాడని భయంవేసి ఊరుకున్నాను. పాపం ఎంతో అమాయకురాలిలా ఉంది ఇతనికి కాబోయే భార్య జీవితాంతం కలిసి ఉండాలి కదా ఇతని 'పంచ్'ల్ని ఎలా తట్టుకుంటుందో

ఏమో అని మనసులో జాలి కలిగింది. కాని ఆమెపట్ల జాలి, మావయ్య గురించి భయంలా మారిపోవడానికి ఎంతో సమయం పట్టలేదు సుమా అదెలాగంటే పెళ్లిపీటల మీద ఆమె ఎంతో కుదురుగా, హుందాగా ఉంటే, మనవాడు మరీ హుషారుగా ఉన్నాడు అతిగా వాగుతున్నాడు, ఒక్కమాటలో చెప్పాలంటే 'ఓవరాక్షన్' చేసేస్తున్నాడు. పూర్వం అలాంటి సందర్భంలో 'రేపట్నుంచీ అంతా తారుమారవుతుందిలెండి, అని పంచ్ పేల్చిన విషయం మర్చిపోయి–'కొంచెం తగ్గించు' అని నేను అతనికి చెప్పటానికి చేయబోతున్న ప్రయత్నాల్ని గ్రహించి కాబోలు మౌనంగా వారిస్తున్నట్లుగా సైగ చేసింది నాకు వధువు. నాకేదో అర్థమయ్యీ అర్థమవనట్టైంది ఊరుకున్నాను. మెడలో తాళి కట్టేటప్పుడు, అదేదో సినిమాలో రాజేంద్రప్రసాద్ చేసినట్లు"వధువు మెడమీద చేతి వేళ్లని" గిలితింతలు పెట్టే విధంగా నాట్యం చేయించటం, గమనించిన కొందరు నవ్వుకున్నారు. కాని తను మెల్లగా, సరదాగా అంది– "నా మెడలో ముత్యాల హారం కావాలంటే అడగొచ్చు కదా–" అని ఎంతమెల్లగా అన్నా ఈ మాటలు మైకు లాగేసింది. అందరికీ వినిపించాయి – మనవాడి చిలిపిచేష్టల్ని"చైన్ స్నాచింగ్" ప్రయత్నంగా చిత్రీకరించి "భలే పంచ్" వేసిందన్న మాట. విన్న అందరూ గొల్లుమంటే మనోడు ఏడ్వలేక నవ్వేశాడులెండి కాళ్లు కడుగుతున్న వాళ్ల చిన్నాన్న గురించి ఏదో అనబోయి వసుదేవుడు గాడిద వ్యవహారం మీద సామెత పేలుస్తుందని భయపడి మానేశానని తర్వాత చెప్పేడులెండి– ఇంక అంపకాలప్పుడు ఆయన 'మా అమ్మాయి అమాయకురాలు.. అని ఇంకా ఏదో చెప్పబోతే, తనే పూరించింది–'నాన్న మా అమ్మాయి జాగ్రత్త అని చెప్పబోవటం లేదు–మా అమ్మాయితో జాగ్రత్త అని మాత్రమే' –అని మరో పంచ్ పేల్చింది– అందరూ నవ్వుకున్నారు మావయ్య తప్ప! కాని నాకుమాత్రం ఈ 'పంచ్‌ప్రావు' – పంచ్‌ప్రాణిల కాపురం ఎలా ఉండ బోతోందోనన్న ఆతృత, ఆందోళన కలుగుతున్నాయి.

రచనాకాలం – 2016

# "సరస సరాగాల అనురాగాల దాంపత్యం"

చుట్టుపక్కలా, చుట్టాల్లో "సుమంత్", "సుమతి"లది "అనుకూల దాంపత్యం"గా పేరొందింది, వాళ్ళకి పెళ్ళైన కొద్దిరోజులకే! అలాంటి సౌభాగ్యం కొరవడిన చాలామంది ఈర్ష్యకూ కారణభూతమైంది కూడా సినిమాల్లోలా, వీధుల్లో చెట్టాపట్టాలేసుకుని, తిరగరు గాని విద్యాధికులు, ఒకరికొకరు, రూపం, సంస్కారయుతమైన ప్రవర్తన, కలుపుగోలుదనం ఇతరులకు సాయపడే తత్త్వం వంటి ఎన్నో సుగుణాలలో తీసిపోని వారిద్దరూ. ఒకే కాలేజీలో తెలుగు, ఇంగ్లీషు 'లెక్చరర్లు'గా పనిచేస్తున్నందున, ఉద్యోగ విధులకు మోటారు బైకు మీద కలిసే వెళ్తారు; ఇంట్లో ఊసులు సరిపోక కాబోలు దారిపొడవునా, చిరునవ్వులు చిందించుకుంటూ, నిరంతరాయంగా ఏదేదో మాట్లాడుకుంటూ, మోటారు బండి మీద నుండి జారి పోకుండా, పడిపోకుండా ఉండడానికి అవసరమైనంత సన్నిహితంగా మాత్రమే కూర్చుని, వెళ్ళే వాళ్ళని పట్టణ పౌరులు "ముచ్చట"గా చూస్తుంటారు.

తెలుగు ఇంగ్లీషు మాస్టార్ల మధ్య "కెమిస్ట్రీ" భలేగా ఉందని, వాళ్ళు పనిచేస్తున్న కాలేజీ ప్రిన్సిపాల్ ఒకసారి చమత్కరించారు కూడా. పిలిచిన అన్ని ఫంక్షన్లకి జంటగా కలిసివచ్చి అందరితో కలివిడిగా ఉండటమే కాదు, యధాశక్తి, మంచి కానుకలు సమర్పిస్తూంటారు, కాబట్టి ఇరుగు పొరుగులలో మాత్రమే కాదు ఊరంతా, మంచి పేరే ఉంది. ఈ దంపతులకి, కొందరిలా పరస్పర ప్రేమానురాగాల్ని బహిరంగంగా కూడా ప్రదర్శించే అలవాటు లేకున్నా, సుమంత్ సుమతిలను "నమూనా ఆదర్శ దంపతులు"గానే, తెలిసిన వారంతా పరిగణిస్తూంటారు. ఈ విషయం తెలిసే కాబోలు, వీళ్ళూ ఎప్పటికప్పుడు తమని మెరుగు పర్చుకుంటూనే ఉంటారు తీర్చిదిద్దుకుంటూనే ఉంటారు; ఇంట్లోనూ బయటాకూడా సుమతి విషయానికొస్తే సహజం గానే సుగుణవతి. పెళ్ళిచూపులప్పుడే మొదటిసారి కలిసినా, అతడిలోని సుగుణాల్ని బాగానే బేరీజు వేయగలిగింది; ఇతర అర్హతలతోబాటు, కాస్తోకూస్తో మెతకదనం, సర్దుబాటుధోరణి అతనిలో ఉందని గ్రహించి, అది నచ్చి సంబంధానికి మనస్ఫూర్తిగా తలూపింది. సుమంత్ తరపువాళ్ళకి, వాళ్ళు ఇవ్వబూనుకున్న భారీ

కట్నకానుకలు నచ్చాయేమో గాని అతనికి మాత్రం సుమతే నచ్చింది తనలో కొంత ఆధిపత్య ధోరణి ఉందని గ్రహించినా, మంచిగా ఉంటూ కాస్త లౌక్యం, తెలివితేటలతో ఆ చిన్నలోపాన్ని తగ్గించలేక పోతానా", అని ధైర్యం చెప్పుకుని 'సరే' అనేశాడు ఆనందంగా పెళ్ళయ్యాక కూడా ఇద్దరికీ ఏ విషయంలోనూ నిరాశ కలగలేదు దంపతులకి ఒకరిపై ఒకరికి ఇష్టం పెరుగుతూనే ఉంది. పెళ్ళికి ముందే పోయిన మామగారి ఫొటోకి రోజూ దండం పెట్టటం, అత్తగారిని అమ్మలా చూసుకోవటం సుమతి పట్ల అనురాగం పెంచుకోవడానికి సుమంత్‌కి దోహదపడితే, భార్య'స్త్రీ ధనాన్ని" అంటే ఏటా వచ్చే పంటసొమ్ముల్ని తన ఇష్టానికే వదిలేయటం, పురుష సహజ అధిపత్యాన్ని చూపకపోవటం, అత్తామామల్ని గౌరవంగా చూడటం వంటివి సుమతికి భర్తపట్ల ఇష్టం పెరగడానికి కారణాలు మరి వాళ్ళ దాంపత్యం నిత్యం శోభిల్లే నందన వనంలా కాకుండా మరోలా ఎలా ఉంటుంది?

అయితే, ఒక విషయం చాలావరకు ఇద్దరి "అభిరుచుల"లో పెద్దగా 'వైరుధ్యం' లేదుగాని. ఒక "మాతృభాషాభిమాని"గా, విరివిగా వచన కవితలు రాసే భర్త "అలవాటు" సుమతికి నచ్చదు. అలాగే కుట్లూ అల్లికలతో తీరిక సమయం గడిపే సుమతి "సరదా", భర్తకి అయిష్టం. ఇంట్లో పరస్పరం ఊసులాడుకునే సమయం కుదించుకు పోతోందన్న ఆక్రోశమే ఇద్దరిదీను. కాని ఎప్పుడూ బయటపడలేదు. పోన్లే నన్ను"విని చావమని" గాని, "నువ్వు రాయమని" గాని పోరటం లేదు. అదే మహాభాగ్యం అని 'సతి' 'రాజీ'పడిపోతుంటే! 'మరీ ఎక్కువ మాట్లాడే సమయం దొరికితే, ఏం చెప్తుంది, పుట్టింటి గొప్పలు తప్ప. కాస్తన్నా 'రిలీఫ్' నాకు తను వేరే పనిలో నిమగ్నమైతే, అనుకుని ఊరట చెందుతాడు. ఆ పతి అలా దొరికే సమయంలో ఏదో రాసుకుంటాడంతే! ఇకపోతే, ప్రణయ కలహాలో, స్వల్ప అభిప్రాయభేదాలో, దంపతుల మధ్య అడపాదడపా వచ్చాయో లేదో కూడా ఎవరికీ తెలియదు, ఇద్దరూ గుంభనంగా ఉండే తెలివైన వాళ్ళు గాబట్టి!

ఒక ఆదివారం సాయంత్రం అమ్మ గుడికి వెళ్ళింది పెళ్ళాం పెరట్లో ఏంటో చేసుకుంటోంది బహుశా పుట్టబోయే ప్రథమ సంతానానికి స్వెట్టరో ఏమో. సుమంత్ హాల్లో సోఫాలో కూర్చుని, భార్య చూడ్డం లేదు కదాని (చూస్తే ఊరుకోదు టీపాయ్

మీద కాళ్ళేసుకుని తనకిష్టమైన పుస్తక పఠనంలో లీనమైపో యున్నాడు. "ఓయ్ ఏమోయ్..." లోపలికి వస్తూ అంటున్న పెళ్ళాం "వలపు పిలుపు" వినగానే, తడబడి టీపాయ్ మీదనుంచి గబగబా కాళ్ళు దించేసి, బదులు పలకకుండా విసుగ్గా భార్యవైపు చూశాడు. అందరి సమక్షంలో 'ఏమండీ' అని సంబోధించే భార్య ఏకాంతంలో మాత్రం 'ఏమోయ్' అనటం అతనికీ ఇష్టమే అందుకు కాదు విసుగొచ్చింది! పుస్తకపఠనానికి, ఎంతో ఉద్విగ్నంగా ఉన్న సమయంలో అనూహ్యంగా అంతరాయం ఏర్పడినందుకు మాత్రమే హాయిగా ఉన్న భంగిమను పెళ్ళానికి భయపడి మార్చుకోవల్సి వచ్చినందుకు కూడా నేమో "మీరైతే, అందర్లోనూ కూడా ఏయ్ ఇదిగో నిన్నే" నాకే పేరు లేనట్లుఅంటే లేని తప్పు ఎవరూ లేనప్పుడే 'ఏమోయ్' అని గోముగా అంటే వచ్చిందా పురుషాహంకారమా" అని నిగ్గదీసింది బాగా దగ్గరిగా వచ్చి.

చెవులు నలిపేస్తుందేమోనని భయం కలిగి చెవులకు చేతు లడ్డం పెట్టుకున్న మగడి అప్రయత్న చేష్టల్ని చెవులు పట్టుకుని క్షమాపణ చెబుతున్నట్లుగా అపార్థం చేసుకుని, కొంచెం లౌక్యం జోడించి "ఏమండీ "స్త్రీ పక్షపాతి"గా, "కవిగా కాస్తోకూస్తో పేరుందికదా "భార్యల గొప్పదనం" గురించి ఓ కవిత రాయరూ ప్లీజ్ నాకోసం" అంది. అని ఊర్కోవచ్చుకదా అబ్బే లేదు మరింత తెలివిగా వ్యవహరించి, పబ్బం గడుపుకోవాలన్న ఆత్రంతో, శృంగారచర్యతో ఒప్పించాలన్న ధ్యేయంతో, భర్త ముఖాన్ని వాలు జడతో సుతారంగా కొట్టింది.

అయితే, ఆ 'శృంగారచర్య' ఇద్దరూ ఊహించని, ఒక విపరీత పరిణామానికి దారి తీసింది! ఏమైందంటే, ఆ సత్యభామ వాలుజడ కొసలు భర్త బుగ్గల మీదుగా పాకి, అతని ముక్కు రంధ్రాల్లోకి జొరబడ్డాయి అవాంఛిత అతిథుల్లా. ఇంకేముంది, భళ్ళున, కర్ణ కఠోరంగా, ఒకపెద్ద శబ్దం వెలువడింది "తుమ్ము" రూపంలో. ఆ భారీ పేలుడికి అదిరిపోయి కొంచెం దూరం జరిగింది భార్యామణి. తేరుకున్న సుమంత్‌లోని ''కొంటె కోణంగి''కి పెళ్ళాన్ని మరింత గందర గోళానికి గురిచేయాలనిపించింది. వెంటనే స్పృహ తప్పిపోతున్నట్లుగా అభినయిస్తూ, తల గిరగిరా తిప్పుతూ, కళ్ళు తేలవేస్తూ, బాగా రొప్పుతూ, చొక్కా బొత్తాములు విప్పుతూ,

సోఫాలో ఒకప్రక్కకి పడిపోయేడు. అతను కోరుకున్నట్లుగానే బాగా కంగారు పడిపోయింది భార్య. "ఏమండీ ఏమైందండీ" అని గద్గద స్వరంతో అంటూ, అతనిపై ఒరిగిపోయింది. ఆ సామీప్యాన్ని బాగా సద్వినియోగం చేసుకుంటూ, ఇంకా మీదకి లాక్కుని ఎక్కడెక్కడో తమకంగా తడమసాగేడా శృంగారపురుషుడు. చిలిపి భర్త చేష్టల్ని, ఆ అయోమయ స్థితిలో కూడా, ఇష్టంగానే కాసేపు భరించిన సుమతికి అకస్మాత్తుగా జ్ఞానోదయమైంది. దిగ్గునలేచి, చీర, పైటకుచ్చెళ్ళు సర్దుకుంటూ కొంచెం దూరంవెళ్ళి "చాల్లెండి సిగ్గూ ఎగ్గూ లేకుండా ఏమిటీపిచ్చి చేష్టలు?" నవ్వుతూనే అంది. అంతలోనే "ఇంతకీరాస్తారా లేదా" అని కొంచెం దూకుడుగానే ప్రశ్నించి, కార్యసాధక వీరనారిలా కొంగు బిగించింది –'రాయకపోతే ఏం చేస్తానో' చూడన్నట్లు తర్జని చూపించింది. అప్పటికీ, 'సరేలే' అన్నట్లు అంగీకార సూచకంగా తలూపలేదు సుమంత్!

పైగా, "నావల్ల కాదు బాబోయ్", అన్నట్లు గుండెలమీద చేతులు వేసుకోవటం, "రాయను" అని అర్థమొచ్చేలా తల అడ్డంగా ఊపటం చూసిన సుమతికి బాగా వళ్ళు మండిపోయింది – కాళ్ళు టపటప లాడించుకుంటూ కోపంగా అక్కడి నుంచి లోపలి గదిలోకి నిష్క్రమించింది

ఇంకొంచెం బతిమాలుతుందనుకున్న మొగుడికీకోపం నషాళాని కెక్కింది – "ఏదో పిచ్చి సబ్జెక్ట్ ఇచ్చి 'రాస్తావా చస్తావా' అంటే ఎలా – 'కవి'గా నా "భావ స్వాతంత్ర్యం", ఏం కావాలి? రాయనుగాక రాయను" అని పళ్ళు కొరుక్కుంటూ అనుకున్నాడు – కాని మరుక్షణంలో "కడుపుతో ఉన్న భార్య ఒక్కగానొక్క చిన్నకోరికను కాదనటం భావ్యమా" అని ప్రశ్నించిన అంతరాత్మకి బదులివ్వలేక పోయాడు – ఏదీ నిర్ణయించు కోలేని అయోమయం ఆవరించిందతడిని – బిర్రబిగుసుకుని ఉండి పోయాడు చాలాసేపు!

ఓ గంట గడిచిందో లేదో, ఈ సారి మెల్లగా అడుగు లేసుకుంటూ మళ్లీ హాల్లోకి వచ్చిన సుమతి 'ఏమోయ్' అనిగాని 'ఏమండీ' అనిగాని భర్తని పిలవలేదు. వెంట వెంటనే రెండుసార్లు దగ్గింది చిన్నగానే – విన్నవెంటనే, కూర్చున్న సోఫా నుంచి లేచి వినయంగా నుంచుని, జపాన్ పురుష పుంగవునిలా వంగివంగి

అభివాదం చేస్తూ దగ్గరికొచ్చి భార్య చేతికి ఒక కాగితం అందించాడు సుమంత్ – తను కోరింది చేశాడన్న విజయగర్వంతో మురిసిపోతున్న భార్య పెద్దకళ్ళని మురిసిపోతూ చూస్తూ ఉండిపోయాడు.

సుమతి కూడా ఒక కాగితాన్ని మొగుడి చేతికి కందించింది. “ఎప్పుడూ ఏదీ ‘రాయని’ ఈ “రాయని భాస్కరమ్మ” ఏం రాసిందిరా! అని ఆశ్చర్యపోతూ తీసుకున్నాడతను – ‘కవిత్వం అయ్యుండదులే, నేనేమీ రాయలేదని అపోహపడి, బతిమాలుతూ రాసిన మామూలు ఉత్తరమై ఉంటుందిలే అనుకునుంటాడు సుమతి, భర్త రాసిన కవితను శ్రద్ధగా, ప్రీతిగా చదవాలి కదా అనుకుని అటువైపు తిరిగి ఒకకుర్చీలో కూర్చుంటే. అతనూ, భార్య “లేఖాస్త్రాన్ని” మడతలు విప్పి చదవ బూనుకున్నాడు

“ఈ తరం భార్య” అన్న శీర్షికే సుమతికి ఆశ్చరాగ్రహాల్ని కలిగించింది నివ్వెర బోతూనే ఆ వచన కవితా పైత్యాన్ని చేదు కూరలా ఆరగించింది – అదిలా సాగింది – చామన ఛాయలో అందంగా ఉండే తన ముఖం ఎందుకంతలా ఎర్రగా అయిపోయిందో తెలుసుకోవాలంటే నచ్చకపోయినా మీరూ చదవాలి మరి.... ఆ ‘తవిక’ ను –

“బట్టలు కాదు, రోజూ భర్తను ఉతుకును,
కార్యేషు దాసి కాదు, ఇంటిపనుల్లో ఏబ్రాసి,
కరణేషు మంత్రి కాదు, సాధింపుల వేధింపుల కంత్రి
శయనేషు రంభ కాదు, ‘మూడు’రాని శరభశరభ;
భోజ్యేషుమాత కాదు మగడి వికటించిన తలరాత;
ఇరుగుపొరుగులకు వినోదప్రదాత
రోజుకోతీరులో మగనితో పోరు,
వృథా ఖర్చుల్లోనైతే, మహాజోరు,
‘ఎడ్డెం’ అంటే వెంటనే ‘తెడ్డెం’ అను,
‘నాది నాదే’ మరి నీది ‘మనదే’ అనే గడుసు,
అమాయకపు మగడంటే బాగా అలుసు,

సదా పుట్టింటి గొప్పలు చెప్పు,
మెట్టినింటి పద్ధతుల్ని బాగా దెప్పు,
సంసారంలో సదా కోరు ఆధిపత్యం,
భార్యల్లో మెజార్టీ ఇదే రకమన్నది సత్యం,
"అంతకాదులే" అనగల్గే భర్తలు అరుదు,
ఎవరన్నా ఉంటే వాళ్ళకివ్వాలి "అదృష్టవంతులనే బిరుదు"

ఇకపోతే తెల్లనందివర్ధనం పువ్వులాంటి సుమంత్ ముఖం నల్లగా మారిపోవడానికి కారణమైన పెళ్ళాం రాసిన ఉత్తరం, కాదు కవిత ఇలా సాగింది "మాయదారి మొగుడు" శీర్షికతో:

"జీవనజ్యోతి వెలుగుజిలుగుల్ని కనలేని అంధుడు,
శ్రేయోభిలాషి ఆలి సూచించే దారిపట్టని పాంథుడు,
సరస సరాగాల అటుకులు రుచించని ఎద్దు,
భార్య భావాల్ని అర్థం చేసుకోలేని మొద్దు,
పొరుగింటి పుల్లకూరనే మెచ్చే మూర్ఖుడు,
గడ్డం నెరిసినా, అమ్మకూచిగా ఉండే అర్భకుడు,
అమ్మదీ, ఇల్లాలిదీ, "స్త్రీ ధనం" వాడేసుకునే వాజమ్మ,
ఇంటా బయటా అన్నిపనుల్లో దద్దమ్మ,
తనవాళ్ళ విషయంలో అపర కర్ణుడు
అత్తామామల నుంచి సదా ఏదో ఆశించే దీనుడు
ఖర్మ! మొగుళ్ళలో చాలామంది ఇదేరకం
ఎప్పుడు తిరగబడుతుందో స్త్రీ లోకం?"

మరో రెండుసార్లు చదివిన తర్వాత సుమంత్ ముఖంలో నవ్వులు విరిసాయి. కోపం పోయింది. భార్యకోపాన్ని తగ్గించటం తన తక్షణ కర్తవ్యమని నిశ్చయించుకున్నాడు.

"నువ్వలా రాసేవేంటి అని అడగొద్దు – నేనైతే, ఏదో సరదాగా అలా రాసానే గాని నీ గురించి కాదు' – అతి వినయంగా, అనునయంగా సంజాయిషీ చెబుదామని

భార్యవైపు చూశాడు – నిర్ఘాంతపోయేడు – తెరలు తెరలుగా వస్తున్న నవ్వుల్ని నియంత్రించు కోవడానికి ప్రయత్నిస్తున్న ముద్దుల పెళ్ళాం ముఖం చూసి! ఏమీ అర్థం కాక, నోటమాటరాక, వెర్రిమొర్రి చూపులతో ఉండిపోయాడు. 'పిచ్చి మాలోకంలా' ఉండిపోయిన మొగుడి వాలకం చూసిన సుమతి ఇంకే మాత్రం నవ్వాపుకోలేక పకపకా బిగ్గరగా నవ్వేసింది – అంతేకాదు, అతను అనాలనుకుని, పలక లేక పోయిన మాటల్ని, మనసుతో విన్న ఉత్సాహం ఆపుకోలేక, చెంగున లేడిలా పరుగెత్తుకుని వచ్చి భర్తని గట్టిగా కౌగిలించుకుంది – "మీరేదో కోతిరాతలు రాస్తారని ఊహించే, నేనలా రాసాను నా బంగారం" – తనని ఉక్కిరిబిక్కిరి చేస్తూ నోటితో కాదు, ఎగసిపడుతున్న హృదయ స్పందనల ద్వారా చెప్పిన వివరణ అతనికి స్పష్టంగా వినబడింది, అర్థమైంది. ఇద్దరూ, ఏ విధమైన సంజాయిషీలు, క్షమాపణలు లేని "మౌనస్థితి"లోనే వెచ్చగా చాలాసేపు ఉండిపోయేరు. ఇంకా ఎంతసేపు అలానే ఉండిపోయే వారేమోగాని, గుడి నుంచి ఇంటి కొచ్చిన సరస్వతమ్మ, అంటే సుమంత్ తల్లి, ఆ భంగిమలో ఉన్న కొడుకూ కోడల్ని మురిపెంగా చూస్తూ గుమ్మంలోనే నిలబడి ఉండిపోయిన విషయం, ముందుగా గుర్తించి సుమతి, భర్త కౌగిలి నుండి బలవంతంగా విడిపోయింది.

సరస్వతమ్మ నవ్వుకుంటూ, ఎవర్నీ ఏమీ అనకుండా, లోపలికి వెళ్ళిపోయింది. మళ్ళీ దగ్గరికి వస్తున్న సుమంత్ నెత్తిమీద మెల్లగా మొట్టి తనూ లోపలికి వెళ్ళబోయే ముందు తన చేతిలో నలిగిపోతూ ఉన్న అతని కవితని పరపరా చింపేసింది – రాయక రాయక కొంటె పెళ్ళాం రాసిన దాన్ని అపురూపంగా దాచుకుందా మనుకున్న అతని ఆశల్ని భగ్నం చేస్తూ, అతని చేతిలో ఉన్న తన కవితని గిల్లిమరీ లాక్కుని దాన్నీ చింపేసింది. మొత్తానికి ఇద్దరి కవితలూ చిరిగిపోయి గాలికి ఎగిరిపోయాయి....... వాళ్ల మధ్య వచ్చిన చిరు కోపాల్లా. అంతే జరిగింది – ఈ విషయం పూర్తిగా మర్చిపోయారిద్దరూ అని చెప్పలేం గాని తర్వాతెప్పుడూ పొరపాటున కూడా దీని గురించి మాట్లాడుకోలేదు ఒకరినొకరు దెప్పుకోలేదు – అంతే – అదేకదా, సరససరాగ అన్యోన్య దాంపత్యమంటే!!?"

రచనా కాలం – 2020

# పండగనాడు కొత్తమొగుడు!

శీర్షిక తప్పుడు అభిప్రాయాన్ని కలగ జేయకుండా ఉండడం కోసం, ముందే చెప్పాలి – తన పెంపకం, సహజ సంస్కారం, హృదయంలో నరనరాలలో నిండియున్న విశ్వాసాల రీత్యా "అనసూయ" పేరుకు తగ్గట్లే, పాతివ్రత్య ధర్మానికి కట్టుబడి ఉండాలనుకునే పడతే! కాని, ఆధునిక కాలపు యువతి, విద్యాధికురాలు, స్వాభిమానం ఉన్నది కూడా కాబట్టి, ప్రతీ రోజూ ఉదయం లేచిన వెంటనే, పతి దేవుని పాదాలను కళ్ళ కద్దు కోవాలనుకునేంత, అన్ని వేళలా మగడి అదుపాజ్ఞలలో ఉంటూ, ఆ "మగానుభావుడు" ఏం చేప్పినా, "శిలాశాసనంగా" శిరోధార్యంగా భావించుకుని తీరాలను కునేంత, పురాణకాలపు భార్య కూడా కాదు. పండగనాడే కాదు ఏనాడూ, పరపురుషుని "సాంగత్యం" కోరుకోగల్గే రకమూ కాదు – అయితే "మహాభావుకురాలు"– మరి చిన్నప్పుడేమో గాని, 'పెద్దమనిషై' నప్పట్నుంచీ, కాబోయే భర్త్తను ఎవరికీ ఎప్పుడూ వెల్లడించని ఒక ఊహా ప్రపంచంలో ప్రతిష్ఠించుకుని, మనసారా ఆరాధించుకునేది. అతడిని మనసులోనే తనివి తీరా ముద్దులాడేది – 'ఓ శ్వేతాశ్వంపై ఒక రాకుమారుడు వచ్చి, అడ్డువచ్చినోళ్లందరిని, నరికిపోగులు పెట్టి, తనని ఎత్తుకుపోయి పెళ్ళాడుతాడు వంటివి' కాదుగాని, ఓ ఉంగరాల జుత్తు అందగాడు, తనని ఎక్కడో వందమంది కన్యామణుల మధ్య ఉన్నప్పుడు చూచి, తొలిచూపుతోనే వలచి, తర్వాత ఎన్నోరోజులు తన వెంటబడి, నానాతంటాలు పడి తన మనసుని గెలిచి, ఆ తర్వాత కూడా, ఎదురైన ఎన్నో అడ్డంకులను అధిగమించి పెళ్లాడాలని, "తొలిరాత్రి, ఇరుకింట్లో కాకుండా, ఇరువురికీ ఇష్టమైన ఏకాంత ప్రశాంత ప్రాంతంలో జరగాలి, వంటి మధురమైన ఊహల్లోతేలిపోతూ ఉండేది కన్యగా ఉన్నంతకాలం.

కాని అలా జరగలేదు! ఒక మధ్యవర్తి చొరవతో, "పెళ్ళి చూపు"లైతే జరిగాయి, ఇరు పక్షాలకు చెందిన ఓ నలభై యాభైమంది సమక్షంలో! అప్పుడైనా, వధూవరులు ఒకళ్ల నొకళ్లు చూసుకోవడమే గాని, మాట్లాడుకోవటం జరగలేదు. వచ్చిన వరుడు శేఖర్ "మౌనముని", లానే కూర్చున్నాడు. మధ్యలో తనే ధైర్యం చేసి, తలెత్తి చూస్తే, అతడు ఆత్రంగా తనవైపు చూస్తూ కాదు, పై కప్పు మీద గిరగిరా తిరుగుతున్న

"ఫేన్" వైపు చూస్తూ కనపడ్డాడు. తనకన్న తెల్లగానే పొడుగ్గానే ఉన్నాడు. 'ఫర్వాలేదులే' అనుకునేలా మాత్రమే ఉన్నాడనిపించింది ఆ క్షణంలో – పైగా చేతికి ఉంగరాలే గాని నెత్తి మీదఉంగరాల జుత్తు లేదు. ఒత్తైనదేగాని స్ట్రైట్‌హెయిర్ – పైగా పక్క పాపిడి– మీసం కొంచెం కూడా కనపడకుండా, నున్నని చెంపలున్న, గుండ్రని ముఖంలో నవ్వేలేదు. ముఖం తెల్లగా ఉంటే ఏం లాభం, కొంచెమైనా కనపడేలా గడ్డం మీసం లేనప్పుడు ! అయినా 'మంచోడే మెతకోడే ' అని మాత్రం అనిపించింది.

మొత్తానికి ఇద్దరి సమక్షంలోనే ఓ గంటసేపు బేరసారాలు సాగిన తర్వాత, సంబంధం ఖాయమైపోయింది, వారం రోజుల్లో ముహూర్తమూ నిశ్చయమైపోయింది, ఏ ఒక్కరి సమ్మతిని మాటవరసకైనా అడుక్కుండానే – పెళ్ళీ జరిగిపోయింది. పెళ్లిచూపులనాడే శేఖర్ పట్ల అనసూయకేర్పడిన ప్రతికూల భావాలు, అలానే ఉండిపోయినా శేఖర్‌లోని మెతకతనం, గెల్చుకోవాలన్న పంతంలేమి, అన్ని పెళ్లితతంగాల్లో, అంటే కాలుతొక్కినప్పుడు, తలంబ్రాల సంబరంలో, బిందెలో ఉంగరం దొరికిపుచ్చుకొనే ఆటలో మరింతగా ప్రతిబింబించటం గ్రహించిన అనసూయలో చికాకుమరింత పెరిగింది. శోభనం కూడా, ఇరుకింట్లో, గాలీవెలుతురు లేని ఓ మూల గదిలోనే ఏర్పాటు కాబడింది. 'అది' మొక్కుబడిగానైనా పూర్తయిందో లేదో మనకెలాతెలుస్తుంది???

సరే అనసూయ కాపురానికీ వచ్చింది. అత్తలేనిదే గాబట్టో, సహజంగా సౌమ్యురాలే గాబట్టో, 'ఉత్తమురాలు'గా పేరుపొందడానికి పెద్ద కష్టం కాలేదు. బంధుమిత్రుల ఇళ్లల్లో, ఊళ్లలో జరిగే అన్ని ఫంక్షన్లకి కలిసి ఉత్సాహంగానే దంపతులు పాల్గొంటారు, 'గిఫ్టులూ', బాగానే ఇస్తారు గాబట్టి వీళ్ల దాంపత్యం బాగానే ఉందన్న అభిప్రాయం తెలిసిన వారందరికీ కలిగింది. ఇంట్లో పనులన్నీ అనసూయే చేసుకుంటుంది, పనిమనిషిని పెట్టుకోలేదు. ఇంటిగుట్టు బయటికొచ్చే అవకాశమే లేదు, ఇంట్లో ఉండేది ఇద్దరే అయినందువలన – ఎప్పుడో ఒకసారి వచ్చి అదేరోజు తిరిగివెళ్లిపోయే అత్తగారిని శేఖర్ చాలా మర్యాదలు చేస్తాడు. దానికావిడచాలా మురిసిపోతుంది – కానైతే, వీళ్లపెళ్లై నాలుగేళ్ళు గడిచిన కూతురు ఇంకా 'నీళ్లాడలేదన్న' బాధ ఆవిడకుండటం సహజమే కదా – అందుకే ఎన్నాళ్ల నుంచో,

తన చెల్లెలు అరుంధతిని బతిమాలుతోంది 'నేనేమన్నా చెబితే గయ్యి' మంటుందేమోనన్న భయం – నువ్వు చెప్తే వింటుంది, "అన్నీఆపేసి", ఇకనన్నా కనమని చెప్పిరావే–నువ్వు మాటకారివి – అవసరమైతే, అల్లుడిగారి తోనూ మాట్లాడగల్గే 'దేవాంతకురాలివి' – అని –

సదరు "అరుంధతి పిన్ని" దసరా పండుగకి రెండ్రోజుల ముందు అక్క కూతురింటికి చక్కా వచ్చింది. కాస్త సంతోషంగానే పిన్నిని 'రిసీవ్' చేసుకున్న "అనసూయ"ను చాలా రోజుల తర్వాత చూస్తున్నందు వలన, "పాపం బాగా చిక్కిపోయిందే', అనుకుంది. "అల్లుడుగారు", ఆరోజు ఉదయాన్నే ఆఫీసు పని మీద హైద్రాబాద్ వెళ్ళాడని దసరానాడు సాయంత్రానికి తిరిగి రావచ్చని తెలిసి కొంత నిరాశపడినా, 'అదొకందుకు మంచిదే' అనుకుంది. అడిగిన దానికి మాత్రమే సమాధానమిస్తూ, ఏదో పనిలో మునిగిపోయున్నట్లు నటిస్తున్న అక్క కూతురిని, ఇది వరలో చలాకీగా లొడలొడా వాగుతూ ఉండే, అప్పటి సందర్భాలతో పోల్చుకుని బాధపడింది.

ఇంకా పరిశీలించి చూసి, తన ముఖంలో నైరాశ్యం, దిగులు, గూడుకట్టుకుని ఉన్నాయని గ్రహించింది. దాంతో 'దీని సంసారం సజావుగా లేదేమోనన్న అనుమానంరానే వచ్చింది అరుంధతికి – 'అదేం కాకపోవచ్చు' ఇంకా కడుపు పండలేదన్న ఆక్రోశం మాత్రమే అయ్యుండొచ్చు సరే తనూ అదే పనిమీద వచ్చింది కదా– "ఫర్టిలిటీరోజు"ల వంటి పరిజ్ఞానం చెప్పేసి వెళ్లిపోవచ్చు' అనుకుంటుండగానే – వంటింట్లో వాష్ బేసిన్‌లో అనసూయ భళ్లున వాంతి చేసుకుంటూండడం కన్పించింది. వెంటనే ఆనందోత్సాహాలతో పరుగెత్తుకుని వెళ్లి దాన్ని గట్టిగా కౌగిలించుకుంది "కంగ్రాట్యులేషన్స్ నా బంగారు తల్లీ" అంటూ. కాసేపు నివ్వెర పోయినా, చాలా కోపంగా పిన్నిని విసురుగా తోసేసింది. స్థాణువులా నిలబడి ఉండిపోయిన పిన్ని దగ్గరికి కన్నీళ్ళతో తలొంచుకుని వచ్చి భుజాల మీద తలపెట్టి వెక్కి వెక్కి ఏడ్చేసింది, 'సారీ సారీ' అంటూ కాసేపయ్యాక– ఇది ఆ బాపతు వాంతి కాదు 'నాకా అదృష్టం కూడా నా – అంటూ ఇంకా గట్టిగా ఏడ్చేసింది – 'దీని కాపురంలో ఏదో తేడా ఉందని' అర్థమవ్వకుండా ఉంటుందా మరి అరుంధతికి,

ఇంకా!! అలాగే ఒక్కసారిగా బరస్ట్‌యి పోయింది పాపం పిల్ల అని కూడా అనిపించింది.

అలాంటప్పుడు చూపవలసిన సంయమనం కోల్పోకుండా వెంటనే ఏదేదో అడిగేయకుండా అక్క కూతురి వెన్ను నిమురుతూ, ఓదారుస్తూ, ఉండిపోయి, కాస్త తేరుకున్న తర్వాతనే, కాసేపు వళ్లోపడుకో బెట్టుకుని, కూడా కూడా తిరుగుతూ, సమాచార సేకరణ ప్రారంభించింది. గుట్టంతా క్రమంగా లాగేసింది తన వాక్చాతుర్యమంతా ఉపయోగించి – ఇందుకు చాలా సమయం, ఎన్నో బరితెగించిన ప్రశ్నలు, గద్దింపులు, నిష్ఠూరాలు, అవసరమయ్యాయి. ఇంట్లో ఇద్దరే తప్ప వేరెవరూ లేకపోవటం బాగా అనుకూలించింది – అంతా యథాతథంగా పొల్లుపోకుండా పిన్ని ప్రశ్నలని, ఆరాలని, కూపీని, ఉపోద్ఘాతాలతో సహా చెప్పాలంటే, వాటికి సూటిగా స్పష్టంగా కాకుండా సిగ్గు సిగ్గుగా, ముక్కలు ముక్కలుగా అనసూయ స్పందనని, సమాధానాలని కూడా వివరించాలంటే, అదో పెద్ద ఉద్గ్రంధమైపోతుంది. కాబట్టి రెండు రోజుల తరబడి సాగిన వాళ్ల సంభాషణల సారాంశాన్ని మాత్రమే చెప్పుకుందాం, క్లుప్తంగా గడియారం, తేదీల క్రమంలో కాదు ప్రాధాన్యతాక్రమంలో

"కన్యగా ఉన్నప్పుడు అందరికీ కొన్ని "ఆశలు" ఎక్స్‌పెక్టేషన్లు ఉంటాయి. మరి నువ్వేలాంటి భర్తని కోరుకున్నావే", అని అడిగిన ప్రశ్నకు నిజాయితీ అమాయకత్వంతో కూడిన సమాధానాన్ని పొందిన తర్వాత పెద్దగా తర్కించకుండా, బరితెగించి అడిగేసింది "తొలిరాత్రి అది జరిగిందా లేదా అసలు" అని సమాధానం రాలేదు. "సరేలే – నూటికి తొంభైకేసులలో అస్సలు జరగదు – జరిగిన వాటిలో కూడా సగం మొక్కుబడిగానో, అసంతృప్తిగానో ముగుస్తాయనుకో" అని, కాసేపాగి "ఇందుకు ఎన్నో కారణాలుండొచ్చు ఉదాహరణకి, పిల్లలో, "ఫ్రిజిడిటీ", పిల్లాడిలో "పెర్ఫార్మెన్స్ ఏంగ్జయిటీ"– అంటే ఏంటో వివరించాలా – నీకే తెలుసా!?

'తెలుసు లే' అన్నట్లు శ్రోత, తలూపటం చూసి, ఆగిపోయింది – "నీకు దైహికంగా ఫ్రిజిడిటీ గాని, మానసికంగా వైముఖ్యం గాని ఉన్నాయా? "గుడ్ లేవని తల అడ్డంగా ఊపుతున్నావు – కాస్త నోటితో చెప్తే ఆనందిస్తాను కదా సరేలే – అతగాడిలోనే ఏదో లోపం – ఏంటే బాబూ, అంతలా గుడ్లురిమి చూస్తున్నావ్–

లోపం లేదంటున్నావంటే – మరి తొలిరాత్రి జరిగిందో లేదో గాని, తర్వాతెప్పుడో – ఏదో ఒకలా 'అది జరిగిందన్నమాటే కదా? లేకపోతే లోపం లేదని నీకెలా తెలుస్తుంది?"

తన లాజిక్‌కి సిగ్గుగా నవ్వటం చూసి ఇంకా రెచ్చిపోయింది "మరింకేం నిత్యకల్యాణం పచ్చతోరణంలా ఉండండి ఏంటే మాట్లాడవ్? ఇంతకీ ఎన్నిసార్లు కలుసు కుంటున్నారు  అదేంటే పదివేళ్లూ రెండుసార్లు చూపిస్తున్నావు? నెలకా సంవత్సరానికా? ఆ రెండు కాదా పెళ్లైన నాలుగేళ్ల మొత్తం కాలానికా! ఓమైగాడ్ "తలపట్టుకుని చాలా సేపు ఉండిపోయిన అరుంధతి పిన్ని– 'అప్పుడు నీకేమైనా అసౌకర్యం ఉంటుందా? అతని బాడీ ఆడర్స్' అదేలే, శరీరపు వాసన గిట్టడం లేదా? మోటుగా ప్రవర్తిస్తున్నాడా? వంటి ఎన్నో ప్రశ్నలడిగి అన్నిటికీ, "లేదు", "కాదు" అనే ఆన్సర్లనే పొందింది. అప్పుడు విసుగొచ్చి 'జన్మకో శివరాత్రిన్నట్లు నాలుగేళ్లలో ఇరవైసార్లే జరిగితే అంతే అవుతుందే పిచ్చి మొఖమా అని ఊరుకోకుండా, "అరుదుగా జరిగితే వాడు తొందరగా 'ఔటైపోతాడు. పెళ్లానికీ ఏ మాత్రం తృప్తి ఉండదు" అని పిచ్చగా అనేసింది. "అసలు తనెప్పుడూ కావాలని అడగాడా? నువ్వైనా చొరవచూపించవా? అని అడిగిన రెండు ప్రశ్నలకీ, ఎటో చూస్తూ అడ్డంగా తలూపేసరికి ఇంకా వళ్లు మండిపోయింది. "ఒకే ఇంట్లో, ఒకే గదిలో ఉంటూ, ఎప్పుడో ఒకసారి అదిన్నూ అట్టర్‌ఫైల్యూర్! మీలాంటి పిచ్చి దంపతుల్ని ఈ లోకంలో ఎక్కడా చూడం" అని దులిపేసింది – ఇక నావల్ల కాదని, అస్త్రసన్యాసం చేసేసి నోరుమూసుకుని, తిరుగు ప్రయాణానికి సిద్ధమైపోయింది. అప్పటికి దసరానాటి సాయంత్రం వచ్చేసింది. చెప్పిన సమయానికే శేఖర్ ఇంటికి తిరిగి వచ్చేశాడు.

అరుంధతి పిన్నత్తను మర్యాదగా పలుకరించిన శేఖర్, ఆవిడ తిరుగు ప్రయాణమవుతున్న విషయం గ్రహించి, స్టేషన్‌లో దింపి వస్తానన్నాడు. 'ప్రయాణ బడలికలో ఉన్నావు వద్దులే' అన్నా వినిపించుకోలేదు. 'వెళ్లొస్తానని" అనసూయకి చెప్పాలనిపించక పోయినా, ఆమె ముఖం చూసి జాలి కలిగి దగ్గరికి వెళ్ళి చెవిలోచెప్పింది. "ఇంక అంతా నీచేతిలోనే ఉంది. కావాలని అడగలేని మెతక మనిషే గాని అతనిలో ఏలోపం లేద. నువ్వే "కావాలనిపించినా", చొరవ చూపలేని

పొగరుతో ఉన్నావు. సరిదిద్దుకో లేకపోతే నీ ఇష్టం అని కాస్త కరుకుగానే చెప్పింది. శేఖర్‌తో కలిసి ఆటోలో స్టేషన్‌కి వెళ్ళిపోయింది. అనసూయ దిగులుగా చూస్తూ ఉండిపోయింది. ఆయనది స్ట్రెయిట్ హెయిర్ అయితే నష్టం ఏమిటి, స్ట్రైట్ కేరెక్టరే కదా– పక్కపాపిడెక్కితే ఏం, పక్క చూపులు చూడని మగోడికి అనుకుంది మొదటిసారిగా...

కాసేపటికి శేఖర్ తిరిగి వచ్చేశాడు ఇంటికి. బెడ్‌రూమ్‌లో లైటేసుకుని కూర్చుని అప్పటికే దార్లో పదిసార్లు చదివేసిన పిన్నత్త గారిచ్చిన కాగితాన్ని మళ్లీ మళ్లీ చదువుతూ కూర్చున్నాడు. ఇంతలో కాస్త చప్పుడైతే వెంటనే ఆకాగితాన్ని జేబులో దాచేసి బాత్రూం వైపు చూశాడు. లోపలిలంగా జాకెట్టు మాత్రమే కట్టుకుని, తల మాత్రమే బయటికి కనిపించేలా తలుపు కొద్దిగానే తెరిచి, మీరు కాస్త హాల్లోకి వెళ్తారా నేను చీర కట్టుకోవాలి అంటోంది. శ్రీమతి ఒక సంవత్సరం క్రితమో ఇంకా ముందో ఇలానే జరిగిన అనేక సందర్భాల్లో తలొంచుకుని "వినయ విధేయ రాముడిలా" మంచి బాలునిలా బయటకు వెళ్లిపోయిన శేఖర్ ఈ సారి అలా చేయలేదు! దిగ్గున లేచి పరుగెత్తుకుని వెళ్లి, పెళ్లాన్ని అమాంతం గట్టిగా కౌగిలించేసుకుని, ఆపై తన భుజాలకెత్తుకుని మోసుకుని వచ్చి మంచం మీద కుదేశాడు.

ఆశ్చర్యపోతూ, అంతకుమించి ఆనందంతో పరవశమైపోతూ, అరమోడ్పు కళ్లతో తనవైపు ప్రేమగాచూస్తూ ఊడిపోయిన లంగాని పట్టించు కోకుండా ఉండిపోయిన భార్య దేహాన్ని అనుమతి అడక్కుండానే కైవశం చేసుకున్నాడు. మరీ హడావిడిపడకుండా ఒక్కో మెట్టు ఎక్కుతూ ఆనంద శిఖరాగ్రాన్ని తనూ చేరుకున్నాడు. భార్యనీ చేర్చాడు. ఇద్దరి హృదయాంతరాలలో 'ఇంకేం కావాలే' అనే ఏదో సినిమా పాట మార్మోగింది. తర్వాతెప్పుడో తెలిసింది అనసూయకి, తామిద్దరి రెండు రోజుల సంభాషణలు సారాంశాన్ని తన సూచనల్ని పిన్ని ఒకపేజీలో కుదించి రాసి, రైలెక్కే ముందు శేఖర్‌కిచ్చిందని, దాని ఫలితమే దసరా పండుగ రాత్రి పాతమొగుడే కొత్త మొగుడి రూపంలో లభించడమని. తను కూడా ఆరోజు నుండి అందు కనుగుణంగా మారింది. వీళ్ళిద్దరిది నిత్యవసంత సంసారమైంది. నెల తిరక్కుండానే అనసూయ నెలతప్పింది.

రచనాకాలం – 2019

# పెళ్లాం పేచీలు

"ఏరా! ఇంట్లోనే ఉన్నావా"? అంటూ లోపలికొచ్చాడు ఓ ఆదివారం సాయంత్రం సుధాకర్ వాడిదంతా ఓ వింతధోరణి లెండి! మొన్నోసారి, సినిమాహాల్లో కనపడితే, "సినిమా చూడ్డానికి వచ్చావా?" అనడిగేడు – కాదు లేరా, ఇక్కడ సమోసాలు బయటికన్న తక్కువ రేటుకి దొరుకుతాయని, కొనుక్కుందామని వచ్చాలే", అంటే, ఓ వెర్రి నవ్వు నవ్వేసి ఊరుకున్నాడు. నిజానికి ఫలానా సమయానికి వస్తానని ఫోను చేసే వచ్చేడు. అయితే, నాతో పాటు మా ఆవిడ ఇంట్లోఉండటం చూసి, కాస్తగతుక్కుమని, నిరాశచెందినట్లు కనిపించాడు. కాని పైకేమీ తేలకుండా, "బాగున్నావా చెల్లెమ్మా" అని పలకరించేడు. తను చేసిన "కారప్పూస, కాఫీ" మర్యాదలు స్వీకరిస్తూ  ఎడతెగకుండా కురుస్తున్న వర్షాల గురించి ఆగిపోతున్న క్రికెట్ మేచ్‌ల గురించి, 'మోదీ గారి విదేశ పర్యటనల' గురించి పొంతన లేకుండా మాట్లాడడం కొనసాగించేడు. వాడు నాకు బాల్యమిత్రుడు. 'బావ' వరసయ్యే బంధువు కూడా. చిన్నప్పట్నుంచీ, తనకి ఏసమస్య వచ్చినా పరిష్కారం కోసం నా దగ్గరికొచ్చే అలవాటున్నవాడు. కానైతే, సమస్య సూటిగా చెప్పడు– "నీకుఅలా జరిగితే ఏం చేస్తావ్?" అని పరోక్షంగా, ప్రశ్నరూపంలో తన సమస్యను వెల్లడిస్తాడన్నమాట. చెప్పిన పరిష్కారం, విన్నతర్వాత, నచ్చిందో లేదో చెప్పకుండావేరే విషయాలు మాట్లాడేసి వెళ్లిపోతాడు. పాటించాడో లేదో, పాటిస్తే, ఏం ఫలితమొచ్చిందో, తర్వాతెప్పుడూ మాట వరసకైనా చెప్పడంటే నమ్మండి! మరో సమస్య ఎదురైనప్పుడూ, నా దగ్గరికి మళ్ళీ రావడమూ మానడు! ఇంకెవరైనా దగ్గరలో ఉంటే అలాంటివి చెప్పటాన్కి ఇష్టపడడు.

కాసేపు మా మాటలు విని, బోరు కొట్టి – "నేను గుడికెళ్లొస్తాను", అని చెప్పేసి, అయిష్టంగానే వెళ్లిపోయింది నా శ్రీమతి. ప్రతీ ఆదివారం సాయంత్రం తనకి గుడికి వెళ్లేఅలవాటుందని తెలిసే వచ్చిన మా వాడు కాస్త స్థిమిత పడ్డాడు. నేనూ, 'అమ్మయ్యా' అనుకుని, వాడిప్రశ్నారూపక సమస్యలను వినడానికి సంసిద్ధమయ్యాను. వాడు ఇంకా సందిగ్ధంగా, అటూ ఇటూ చూస్తూంటే "ఇంకెవరూ ఇంట్లోలేరని" సైగ చేసి తెలియజేశాను. అయినా, ఇద్దరి మధ్యనా చాలా సేపు

మౌనం రాజ్యం చేసింది. నేను ఏదో అనబోతున్నప్పుడు నోరు విప్పేడు. ఎటువంటి ఉపోద్ఘాతం లేకుండానే "ఏదో, భగవంతుడి దయవల్ల, మనకింత ఉంది కదా, ఉన్న ఒక్కగానొక్క చెల్లెలికి, సంవత్సరాని కొకసారైనా చీరపెట్టాలని నీకనిపిస్తే," "ఆ, ప్రతీఏడూ పెట్టాలేంటీ", అని మీ ఆవిడసన్నాయి నొక్కులు నొక్కితే ఏం చేస్తావ్?

పరోక్షంగా తన సమస్యేంటో చెప్పాడని అర్థమై, వెంటనే పరిష్కారం చెప్పేశాను, 'నాకుచెల్లెలు లేదు, ఉన్నా అలాంటి సమస్యరాదు' అనకుండా, "మా అన్నయ్యకు అంతతోచదు, గాని మా వదినది, మహా దొడ్డ మనసు. ప్రతీ పండక్కీ బంగారం కాకపోయినా, ఓ మంచి చీర, ఆడబడుచుకి పెట్టి తీరాలని ఒకటేపోరు పెడుతుంది తెలుసా" – అని వాళ్ల చుట్టాలందరికీ మాచెల్లి పదే పదే చెప్పి మురిసిపోతోందట – చెప్పితే చెప్పుకోనీ మనకి కుదరొద్దూ! అని పండగకి పదిరోజుల ముందే ఒకేసారి అని వూరుకుంటానంతే!" – లౌక్యంతో కూడిన ఈ పరిష్కారం నచ్చిందో లేదో చెప్పకుండానే మరో ప్రశ్న సంధించాడు.

నీకు జీతం బాగానే వస్తున్నా, ప్రతీ పండక్కీ పట్టుచీరలు కొనాల్సిందేనని మీ ఆవిడపట్టు బట్టితే ఏంచేస్తావ్‌రా?"

"అలా పట్టు బట్టే ప్రమాదం లేకుండా, తను నేత చీర కట్టుకున్న రోజులో కనీసం పదిసార్లు ఎంత బాగున్నావో! నీవల్ల ఆ చీరకే అందమొచ్చిందనుకో," అంటానురా.

ఈ సారి ప్రశ్న కొంచెం సంకోచిస్తూనే అడిగేడు, మా అమ్మ నాపెళ్లికి ముందే పోయినందు వల్లనో, లేక సహజ స్వభావరీత్యానో కాని మా ఆవిడ ఉత్తమురాలుగా పేరు తెచ్చుకొందని తెలియనట్లుగా అడిగేయటం బాగోదనిపించింది కాబోలు కాసేపు! "అత్తగారి చాకిరీతో చచ్చి పోతున్నాను బాబూ" అని అస్తమానూ అందరి దగ్గరా 'పెళ్లాం' వాపోతుంటే" – అని మాత్రం అన్నాడు, – 'నీ పెళ్లాం–' లేదా మీ ఆవిడ, అనకుండా నియంత్రించుకున్నాడు.

నేనూ పట్టించుకోకుండా సమస్యకు పరిష్కారం చెప్పేశాను. "ఏమోయ్! మా అమ్మకి కాస్త బుద్ధి చెప్పాలి – అందరికీ'పాపం నా కోడలికి నా చాకిరీతోనే సరిపోతోంది. మొగుడ్నీ పిల్లల్నీ అస్సలు పట్టించుకోవటం లేదా పిచ్చిపిల్ల–నాకు

చేతనైన పనులైనా చేసుకోనీయమ్మా, అని అడుగుతున్నా వినిపించుకోదు మహామొండిది. ఇలా అందరికీ ఫిర్యాదు చేస్తోందంట ఇలా 'ఇంటి గుట్టు' బయట పెట్టాలా ఏంటీ, అలా చేయొద్దని, నువ్వు నన్నే చెప్పమంటావా? అనంతే– "ఛా, ఊర్కోండి'అని మురిసి పోతుందంతే. అయితే అమ్మకి పెళ్లాంతో ఇలా అంటాను అని ముందే చెప్పి ఉంచితే మంచిది సుమా! 'నేను కూడామా అమ్మ అని గాని మా ఆవిడని గాని అనకుండా జాగ్రత్త పడ్డాను తర్వాత ప్రశ్నవాడు, "మీ ఆవిడ"అంటూనే ప్రారంభించేడు.

"మీ ఆవిడ అస్తమానూ, మాటిమాటికి పుట్టింటికి వెళ్తోస్తానని అంటుంటే, వెళ్ళొద్దనకుండా, వెళ్లకుండా చేయడానికేం చేస్తావు?" కాసేపాలొంచించాల్సొచ్చింది, సమాధానం చెప్పటానికి

"తప్పకుండావెళ్లు క్రితం సారి కన్నా"భారీ సారె" పెట్టకపోతారా మీ వాళ్ళు! ఇద్దరికీపట్టు బట్టలు పెడతారు కూడా వాళ్ళ స్థాయి తగ్గించుకుంటారా ఏంటి? "అంటాను వెటకారం ధ్వనించకుండా, విశ్వాసం ఉట్టిపట్టేటట్టు గుండెల మీదచేతులు వేసుకుని అరమోడ్పు కళ్లతో – "అప్పుడు మా ఆవిడ' తర్వాతెప్పుడైనా వెళ్తానులెండి నేను వెళ్తే మీకిబ్బంది అవ్వదూ' అని తీరుతుంది". పుట్టింటికి వెళ్లే కార్యక్రమం మానేస్తుంది".

ఈ పరిష్కారం నచ్చిందో లేదో చెప్పకపోయినా నచ్చిందనే తెలిసింది నాకు. వాడిముఖంలోకి చూస్తే. ఇంకో ప్రశ్నఅడగాలని ఉందిగాని ఎందుకో సంకోచిస్తున్నాడని అనిపించింది.

కాసేపాగి, ఈ సారి, నాముఖంలోకి చూడకుండా తలొంచుకునే అన్నాడు.

"నాకు మూడు లేదు కూడేది లేదు అంటోందిరా ప్రతీ రాత్రి. మా ఆవిడ తనని ఎలా సానుకూలం చేసుకోవాలో చెప్పి పుణ్యం కట్టుకోరా" తన సమస్యను సూటిగా చెప్పేయటమే కాక, పరిష్కారం చెప్పమని డైరెక్టుగా అడిగేయటం నాకు చాలా ఆశ్చర్యాన్ని కల్గించింది. ఆ ఉత్సాహంలో వెంటనే అనేశాను "పోనీలే నీకు వయసు మీరిపోతోందిలే పాపం "అనంటే వెంటనే నీ మీద పడిపోయి, అన్నిటికీ

సహకరించకపోతే నన్నడుగు!"

పరిష్కారం చెప్పటం పూర్తి చేయగానే, ఎవరిదో ఆపుకోలేక కిసుక్కున నవ్విన నవ్వు వినపడి అదిరిపడి ఇద్దరం అటువైపు చూశా – నోట్లోకొంగు కుక్కుకుంటూ, ఇంకా తెరలు తెరలుగా వస్తున్న నవ్వాపుకోలేక, లోపలికి వెళ్లిపోతున్న మా ఆవిడ కనిపించింది. గుడికి వెళ్ళే దారిలో కొబ్బరికాయ మర్చిపోయానని కాసేపటికి గుర్తొచ్చి ఇంటికి వెనక్కొచ్చిన తను తలుపుచాటున నిలబడిమా సంభాషణంతా, స్త్రీ సహజ కుతూహలంతో సాంతం వినేశానని తర్వాత చెప్పింది లెండి శ్రీమతి .

మా ఆవిణ్ని చూసిన వెంటనే, అంతో కొంతో వినేసిందని అర్థమై సుధాకర్ వెళ్తానని కూడా చెప్పకుండా పారిపోయాడని వేరే చెప్పాలా?

రచనా కాలం – 2019

పరిస్థితులకనుగుణంగా సర్దుకుపోయే మనస్తత్వాన్ని అలవాటు
చేసుకోవడమే జీవిత రహస్యం

❋❋❋

జీవితాన్ని అనుభవించడం కాదు, దానిని సక్రమంగా
వినియోగించుకోవడమే జీవిత లక్ష్యం కావాలి.

❋❋❋

జీవితాన్ని ధైర్యంగా, నిజాయితీగా ఎదుర్కొంటే, అనుభవం అనే
ఫలాన్ని పొందుతారు. ఆ అనుభవమే మీ నడవడిని తీర్చిదిద్దుతుంది.

❋❋❋

# తెడ్డెం- ఎడ్డెం (తెలివైన కోడలు)

చెప్పుకొంటే సిగ్గుగాని, మా ఆవిడ కాంతం, ఆసాంతం. 'ఎడ్డెం అంటే తెడ్డెం' అనే రకం. మా పెళ్లయిన సుముహూర్త క్షణం నుంచి తను అంతే! తొలిరాత్రి పాలు తనే ముందు ఎంగిలి చేసి, నాకిచ్చి, తన ఆధిపత్యాన్ని నిరూపించుకొంది, నిర్ద్వంద్వంగా! క్షణం బిత్తరపోయిన నేను, తను మనోహరంగా నవ్వి బుగ్గ మీద చిటికె వేసేసరికి, చటుక్కున తేరుకొని నా పాలు పాలు గటగటా తాగేశాను. 'తిన్నగా ఉండకుండా', ఏదో పొగడాలనిపించి, "పూల జడబాగుంది. కుడిపక్క, పాపిడి తీయటం ఇంకా బాగుంది" అని వాగేను- అంతే! వెంటనే, పూలజడ విప్పేసి, ఎడం పక్కకి పాపిడి తీసుకొని తల దువ్వుకొంది మళ్లీ పందిరి మంచాని కున్న అద్దంలో చూసుకుంటూ.

కొంచెం చిన్నబుచ్చు కొన్నాను గాని, విప్పేసిన పూలు, పరుపు మీద చల్లి, పరువాలన్నీ అర్పించడానికి నాందిగా, మెత్తగా హత్తుకొని కొత్తలోకానికి ఎత్తుకుపోయింది- పిచ్చి మాలోకంలా నోరెత్తలేకపోయాను.ఆవిధంగా తొలిరాత్రే నా వ్యక్తిత్వానికి తన అభిజాత్య బీగాలు బాగా గట్టిగా పడ్డాయన్నమాట. గడుస్తున్న కాలం గాని, నా మంచితనం గాని, తనలో ఏమార్పూ తీసుకురాలేక పోయాయి. నేనే, 'ఇది బాగుంది' అది బాగుంటుందన్న, అభిప్రాయ ప్రకటనలు చేయటం అంత మేలు కాదని తెలుసుకొన్నాను. నెల తిరగ్గానే (ఛ, మీ ఊహ తప్పు- తను నెల తప్పలేదు) జీతం మొత్తం తీసేసుకొన్నా, సంసారం పొదుపుగా చేస్తుండటం గమనించి, నన్నునేనే ఓదార్చుకొన్నాను. ఇంకో నెల తిరగ్గానే. ఓ రోజు నాకు జుట్టు దువ్వుతూ, ఉద్దేశ్యపూర్వకంగా మెత్తగా తాకుతూ, తాకిస్తూ, "ఈ అండీ తేలుకొండీ అనటం చిరాగ్గా ఉంది - ప్రేమగా పేరుతో పిలుస్తా, ఏమంటావ్ ప్రకాశ్? అనేసింది. ఏదైనా అనటం శ్రేయస్కరం కాదు గాబట్టి. నోర్మూసుకొనే ఉన్నానని వేరే చెప్పాలా?

నా బట్టలు, బనీన్లు, అండర్‌వేర్‌లు, బ్రాండులతో సహా తనే నిర్ణయిస్తున్నా సెలెక్షన్ బాగానే ఉంటోందిగా, సైజులు సరిపోతున్నాయి కదా అని సర్దుకు

పోతున్నాను. సర్దుకోకపోతే అన్నిటా ‘ఉపవాసయోగం’ పడుతుందని అనుభవమైంది కదా! ఇవన్నీ ఎలా ఉన్నా ప్రతి విషయంలోనూ, చిన్నా, పెద్దా అన్న భేదం లేకుండా “ఎడ్డెం అంటే తెడ్డెం” అనే ఏ కాస్త మినహాయింపులూ లేని కాంతం స్వభావం మాత్రం నాకంత కంతకూ దుర్భరమై పోసాగింది. చాలా అసౌకర్యంగా కూడా.

ఉదాహరణకు, ఓసారి నోరు జారి “బెండకాయ పులుసు బాగుంటుంది– ముదురువైనా సరే.” అన్నాను. అంతే, ఇంట్లోఉన్న లేత బెండకాయలు, నవనవలాడుతున్న వాటిని పనిమనిషికిచ్చేసి, దాన్నేఅర్జంటుగా బజారుకు పంపి దొండకాయలు తెప్పించి పులుసు కాదు. వేపుడు చేసింది. ఏ మాట కామాట చెప్పుకోవాలి. చాలా బాగా చేసింది. లొట్టలు వేసుకుంటూ తిన్నాను.

ఇంకోసారి మంచి గుమ్మడికాయ, పల్లె నుంచి అమ్మ ప్రేమగా పంపించడాన్ని చూసి “దప్పళం చేస్తే బాగుంటుంది మా అమ్మబాగా చేసేది” అన్నాఅంతే

అక్కడే ఉన్న ఇది విన్నపని మనిషి “గుమ్మడికాయ నేను పట్టుకు పోనా అమ్మగారూ! అనేసింది పాత అనుభవాల దృష్ట్యా. కానికాంతం “నీ పని చూస్కో” అని కసిరింది. అత్తగారు పంపిందైనా, అంత పెద్ద, మంచి గుమ్మడికాయను వదులు కోవడం ఇష్టం లేక కాని మూడురోజులు వరుసగా పులుసు పెట్టింది పప్పుతో కలిపి కొట్టడం నా పనైంది – అమ్మపంపిన గుమ్మడికాయ పరాయి ఇంటికి పోలేదన్న సంతృప్తి నాకు మిగిలింది – దప్పళం ఎప్పుడ్కెనా తినొచ్చు కదా.

ఇలా అన్ని విషయాల్లోనూ, కాంతం నిరంతరంగా కనపరిచే వ్యతిరేక ధోరణికి ఎన్ని ఉదాహరణలైనా చెప్పుకోవచ్చు!

అయితే ఓ రోజు, టాయిలెట్టులో ఉన్నప్పుడు, నా బుర్రలో బ్రహ్మాండమైన తరుణోపాయం ట్యూబు లైటులా, కొంచెం అలస్యంగానైనా, దేదీప్యమానంగా వెలిగింది! కాంతం విపరీత ధోరణిని అనుకూలంగా మార్చుకోగలిగే ఉపాయం, బ్రహ్మాస్త్రం తోచింది.

అప్పట్నుంచి, చాలా చాలా ముఖ్యమైన విషయాల్లో, నాకుకావల్సిన దానికి వ్యతిరేకంగా మాట్లాడిగాని, ప్రతిపాదనలు చేసి గాని, సత్ఫలితాలు రాబట్ట

గలిగేవాణ్ని, అంటే మనమే ముందు "తెడ్డెం" అనేసి, "కాదు ఎడ్డెం" అనిపించు కోవడమన్న మాట. నా బ్రహ్మాస్త్రం, అయితే ఇది చాలా అరుదుగా, ఉపయోగించ వలసిన అస్త్రం, అన్న గ్రహింపూ తెలివితేటలూ లేనివాణ్ని కాదు సుమా!

ఒక ఉదాహరణ చెప్పాలంటే నా చిరకాల మిత్రుడు తన పెళ్లికి కనీసం ఒక్కడినైనా తప్పనిసరిగా 'రావాలంటూ అభ్యర్థిస్తూ రాసిన ఉత్తరాన్ని అన్ని నా ఉత్తరాల్లాగానే తనే ముందు చింపి, చదివి, నా చేతికిచ్చింది కాంతం. 'ఏమంటావ్ అన్నట్లు కళ్లల్లోకి సూటిగా చూసింది. వెంటనే నేను ఇది బ్రహ్మాస్త్రం ఉపయోగించాల్సిన సందర్భమని నిశ్చయించుకొన్నాను. నా మిత్రుడు ఎన్నోసార్లు ఎన్నో సందర్భాల్లో ఎంతో సహాయం చేసిన ఉదంతాలు ఆత్మీయంగా గుర్తుకు వచ్చి – "కాంతం – ఈ పెళ్లికి నేను ససేమిరా వెళ్లను – ఓ సారి నన్ను అందరిలో 'ఆడంగోడు, బార్యా విధేయుడు' అన్నాడు. అంతే కాదు, పెళ్లికానుక ఇవ్వాల్సి వస్తుందని, మన పెళ్లికి రాకుండా ఎగ్గొట్టాడు అప్రాచ్యుడు" అని అబద్ధాలు గడగడాచెప్పేను. ఫలితం వేరే చెప్పాలా – భార్యాసమేతంగా మా వాడిపెళ్లికి వెళ్లి ఆనందించే భాగ్యం ప్రాప్తించింది. కూడా తను రావటమే గాక, కాంతం వధూవరులకు మంచి గిఫ్ట్ చదివించింది!

నిన్న మామయ్య బజారులో కనపడి "అదేవిట్రా, మీ అమ్మను ఒంటరిగా ఊళ్లోఉంచేవూ? ఈ మధ్యన వొంట్లోకూడా బాగోట్లేదు వంట కూడా సరిగా చేసుకోలేక పోతుంటే మేమే ఏదో కూరా, నారా పంపించాల్సొస్తోంది. ఒక్కగానొక్క కొడుకువయ్యుండీ, నువ్వేం పట్టించుకోక పోవటం ఏం బాగోలేదు –" అని దులిపేశాడు. మనసు కలుక్కుమంది. చిన్నప్పుడే నాన్నపోతే, అమ్మఎంత కష్టపడి నన్ను పెంచిందో మరిచి పోలేను కదా! ఇది మళ్ళీ బ్రహ్మాస్త్రం ఉపయోగించాల్సిన అరుదైన సందర్భమని దృఢంగా నిశ్చయించుకొన్నా!

ఆ సాయంత్రమే. కాంతం పూలు గుచ్చుకొంటుండగా, పేపర్లో నా ముఖం దాచుకొని అన్నాను. "కాంతం – ఈ మధ్యన, మా అమ్మ అందరితోనూ, 'కొడుకూ, కోడల్ని వదిలిపెట్టి ఉండలేక పోతున్నాను. వాళ్లదగ్గరికి వెళ్లిపోతాను. కోడలు ఇన్నేళ్ల

తర్వాత నీళ్లోసుకొందంట కూడాను. నేను వెళ్లి సాయం చేస్తా అని తెగ వాగుతోందట. ఆ చాదస్తపు ముసలిదాన్ని తీసుకొచ్చి మనింట్లో భరించటం నా తరం కాదు" అని. "ఏమిటా పిచ్చివాగుడు, జన్మనిచ్చి పెంచిన తల్లిని పట్టుకొని? రేపే వెళ్ళి తీసుకురా' అని ఆజ్ఞాపిస్తుందని ఆశించాను. గతానుభవాల దృష్ట్యా, కాంతం కాసేపు మాట్లాడలేదు. కొన్నిక్షణాలు నాకు దుర్భరంగా గడిచేక మెల్లగా అంది. "ఛ అదేమిటి అత్తగారికి మనం గాక ఎవరున్నారు?" కాసేపు ఆగింది. ఆ మాటలకి నా చెవుల్లో అమృతం పోసినట్లైంది. "కాస్తయినా మాతృ ప్రేమ నీకు లేకపోయినా, అత్తగారంటే గౌరవం నాకైనా ఉండవద్దా?" మళ్ళీ ఆగింది. ఈ మాటలకి నా నోట్లో పంచదార పోసినట్లైంది. చెవులు రిక్కించి తదుపరి తేనె పలుకులకు నిరీక్షించాను.

ఈ సారి, సహజమైన దృఢస్వరంలో అంది. "రేపే వెళ్లి ఊళ్లో ఇల్లుబేరం పెట్టు. వచ్చిన డబ్బు నా పేరు మీద బ్యాంకులో వేసి, దానిమీద వచ్చే వడ్డీడబ్బులు వృద్ధాశ్రమంలో మీ అమ్మ సౌకర్యంగా ఉండేందుకు ఫీజు కడతాను. నెలకోసారన్నా మనం ఆవిణ్ణి చూడ్డానికి వెళ్లి పళ్లూ, వగైరా ఇవ్వొచ్చులే - సరేనా, అన్నట్లు ఆవిణ్ణి డైరెక్ట్‌గా పల్లె నుండి వృద్ధాశ్రమానికి తీసుకెళ్లాలి సుమా! మా అమ్మ ఎల్లుండి మంచి రోజని ఇక్కడి కొస్తోంది. నా పురుడు అయ్యేవరకు ఉంటుందిలే - ఊళ్లో ఇల్లు తింగరోడిలా, తక్కువ రేటుకిచ్చేయకు ప్రకాశ్! ఎంత వస్తే అంత, మన పుట్టబోయే పిల్లాడి భవిష్యత్తు కోసమే కదా-"అనేసి బుగ్గ మీద చిటికేసి, ఇంకో మాట లేదన్నట్లుగా హాల్లోకి వెళ్లిపోయింది. 'తెలివైన కోడలు' సీరియల్ టీవీలో వచ్చే సమయం అయిందిగా మరి!

"డామిట్! కథ అడ్డం తిరిగింది!" అని గిరీశంలా వాపోవడం, ప్రయోగించిన "తెడ్డెం ఎడ్డెం" బ్రహ్మాస్త్రం వెనక్కొచ్చి నన్నేముంచింది. అని అర్థం చేసుకోవడం నా వంతైంది. "తెడ్డెం ఎడ్డెం" ప్రయోగం ఫలించలేదని అర్థమైంది ఇంకేం చేస్తాను??

(21 డిశంబర్ 2008 ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధంలో ప్రచురితం)

# ఆంధ్ర ఐ.ఏ.యస్ వైఫ్ ఆఫ్ తెలంగాణ ఐ.పి.యస్

కథాప్రారంభం : అది జూన్2, 2014 భారతదేశంలో 29వ రాష్ట్రంగా "తెలంగాణ" ఆవిర్భవించిన రోజు. "సుందరి ఐ.ఏ.యస్", సుభాష్ ఐ.పి.యస్" లు తమ ఇంట్లో రోజూలానే, కలిసి "బ్రేక్‌ఫాస్ట్" చేస్తున్నారు. ఎదురుగా ఉన్న 'టీవీలో బ్రేకింగ్ నూస్" వింటూ, చూస్తూ. కాని ఎప్పటిలా, సుందరి, గోదావరి ప్రవాహంలా, గలగలా మాట్లాడటం లేదు, భర్త సుభాష్ కాస్త మాట కలపడానికి ప్రయత్నిస్తున్నా ప్రతిస్పందించటం లేదు. ఇద్దరి మధ్యన ఏదో అర్థం గాని ఉద్విగ్నత – తమ దాంపత్యం, భవిష్యత్తుపై ఏదో అభద్రతా భావం! – అయినా తక్షణ సమస్య గురించి అరమరికలు లేకుండా చర్చించు కోలేని నిస్సహాయత, నిస్పృహలు. ఇందుకు కారణాలు తెలియాలంటే ఇద్దరి గురించి వివరాలు చెప్పుకోవాలి, చాలా వెనక్కి, అంటే "ఫ్లాష్ బేక్"లోకి వెళ్లాలి. అదేంటంటే.....

"సుందరి ఐ.ఏ.యస్", సుభాష్, ఐ.పి.యస్‌లు, చాలా అంటే చాలా "అన్యోన్య దంపతులు"!!! నిజంగా ఇది మూడు కాదు మరెన్నో, ఎన్నో "ఆశ్చర్యార్థకాలు" పెట్టాల్సిన వాక్యం–ఎంతో సంభ్రమాశ్చర్యాలని కలుగచేయాల్సిన వ్యాఖ్య–వారిద్దరి వ్యక్తిత్వాల్లో, నేపద్యాల్లో, స్వభావాల్లో ఎన్ని వ్యత్యాసాలు, ఉన్నాయంటే వాళ్లు అనుక్షణం ఉప్పు నిప్పులా ఉండాలన్నమాట. ఆ వ్యత్యాసాలు ఏమిటో, ఒక్కోటి చెప్పుకుందామా? అవి వైరుధ్యాలుగా మారి దాంపత్యంలో చిచ్చు పెట్టకపోవడానికి కారణాలు చెప్పుకునే ముందు ఒకరు ఐ.ఎ.యస్., ఇంకొకరు ఐ.పి.యస్– ఈ రెండు ఉన్నత ఉద్యోగ వర్గాల మధ్య పైకి కనపడని విభేదభావాలు, "జాతి వైరం", 'మేం గొప్పంటే, కాదు మేమే గొప్ప' అనుకునే అభిజాత్యాలు, నివురు గప్పిన నిప్పుల్లా అంతర్లీన మంటల్లా, ఉంటాయన్నది అందరికీ తెలిసినదే.

అదలా ఉంచితే, "సుందరి కరీం నగర్ పోరి"– కుటుంబ మూలాల దృష్ట్యా, – కాని పుట్టింది, పెరిగింది, కాకినాడలో. మరి సుభాష్ పుట్టింది మాత్రం ఆంధ్ర ప్రాంతంలోనే గాని, రెండేళ్ల వయసున్నప్పట్నుంచీ పెరిగింది భాగ్యనగరం శివార్లలో 'బాలా నగర్ పారిశ్రామిక 'వాడ'లో. మరింత వివరంగా చెప్పుకోవాలి. సుభాష్ తూర్పుగోదావరి జిల్లా ఏజన్సీ ప్రాంతంలో ఒకతాండాలో పుట్టిన గిరిజనుడు. తండ్రి

నూకరాజు, తల్లి అంకాలమ్మ. "ఆ గాడిదగుడ్డు" అని సుభాష్ అంటాడులే గాని, తండ్రి నూకరాజు తమది గిరిజన వర్గాల్లో ఉన్నతమైన క్షత్రియ కులమని తరచూ అంటుంటాడు సగర్వంగా అదేమో గాని, ''ఎస్టీ కాస్ట్'' అన్నది నిజం –పేదకుటుంబమన్నది వాస్తవం–కొడుకుకి రెండేళ్ల వయసున్నప్పుడు నూకరాజు ఉమ్మడి రాష్ట్రం రాజధానికి వలస వచ్చేశాడు, కుటుంబంతో సహా. బాలానగర్ పారిశ్రామికవాడలో ఒక మందుల ఫ్యాక్టరీలో కూలీగా స్థిరపడిపోయాడు. అంకాలమ్మ నాలుగిళ్లల్లో పనిమనిషిగా చేరింది. సుభాష్ విద్యాభ్యాసమంతా ఆవిధంగా హైద్రాబాద్‌లోనే జరిగింది. కొంత వయసొచ్చినప్పట్నుంచి స్కూలుకి వెళ్తూనే, శ్రద్ధగా చదువుకుంటూనే, చిన్నా చితకా పనులు చేస్తూ కొంత సంపాదించేవాడు. అతికష్టం మీద బి.ఎ వరకే చదవగలిగాడు. మంచి మార్కులతోనే పాసయ్యాక,"పోలీసు కానిస్టేబుల్‌గా ఉద్యోగం హైద్రాబాద్ నగరంలోనే సాధించాడు. ఆ జాబ్‌లో రెండేళ్లే ఉన్నా, నేరపరిశోధన శాఖలో పనిచేసి, ఎన్నో సంచలనాత్మక విజయాలు, అందుకు ప్రతిగా రాష్ట్రపతి "పతకాలు" పొందాడు. ఆ తర్వాత "సివిల్స్" రాసి "ఐ.పి.ఎస్‌కి" ఎంపికయ్యాడు. ఇందుకు విద్యార్థి దశలో క్రీడల్లో సాధించిన పతకాలు, కానిస్టేబులుగా సాధించిన విజయాలు, పతకాలు దోహదపడ్డాయి. కేవలం గ్రాడ్యుయేషన్ క్వాలిఫికేషన్‌తోనే ఐ.పి.యస్.కి ఎంపికవ్వడానికి "ఎస్టీ రిజర్వేషన్" సౌకర్యం కూడా ఉపయోగపడిందనే చెప్పాలి.

మరి సుందరి "కరీంనగర్ పోరి" ఎలా అంటే, తండ్రి వామనరావుది కరీంనగర్. కులం ఉన్నత వర్గమని చెప్పుకునే వెలమ వృత్తి రీత్యా డాక్టరు. కొన్నాళ్ళు హైద్రాబాద్‌లో ప్రాక్టీస్ చేశాడు గాని విద్యార్థి దశలో ఆప్త మిత్రుడైన డాక్టర్ వెంకట్రావు ఆహ్వానిస్తే" అతని స్వంత హాస్పిటల్ కాకినాడలో "సర్జన్"గా చేరాడు. సుందరి కాకినాడలోనే పుట్టింది. విద్యాభ్యాసం అంతా అంటే "మెడిసిన్" వరకు కాకినాడలోనే! కుటుంబంతో 'అప్పుడప్పుడు కరీంనగర్ వెళ్తున్నా దాదాపుగా "ఆంధ్ర అమ్మాయిగానే పెరిగింది! ఆ మాటకొస్తే గోదావరి యాసే అలవడింది! పెళ్ళయ్యాక సరదాగా ఒకసారి సుభాష్‌తో "ఆయ్ మనిద్దరం తూ.గో.జి. వాళ్లమేనండే! ఆయ్" అంది. సుభాష్ నవ్వి ఊరుకున్నాడన్నది వేరే విషయం, అది అతని స్వభావం సుందరి డాక్టర్‌గా ప్రాక్టీస్ ప్రారంభించనే లేదు. బాగా కోచింగ్ తీసుకుని "మెరిట్"లో

ఐ.ఏ.యస్.కి ఎంపికైంది. బహుశా ప్రజాసేవ చేయాలన్న కోరికతో బాటు అధికారం చెలాయించాలన్న కాంక్ష ఆమె వృత్తి ఎంపికకు కారణం కావొచ్చు. కూతురు ఐ.ఏ.యస్‌కి సెలక్టయ్యాక, అప్పటి వరకు ఎంతో ఇష్టంగా, కాకినాడలో ఉండిపోయిన వామనరావు దంపతులు, హైద్రాబాద్‌కి వచ్చేశారు, కాకినాడలో గడిపిన పాతిక సంవత్సరాల్లో ఒక నిపుణుడైన సర్జన్‌గా హస్తవాసి గల మంచి వైద్యునిగా సాధించిన పేరు ప్రఖ్యాతులు ఇక చాలనుకుని అక్కడ కూడబెట్టిన సొమ్ము వెచ్చించి, కాకినాడ వీడి హైద్రాబాద్‌లో ఒక మంచి ఇల్లుకొనుక్కున్నాడు వామనరావు. జన్మ, విద్యాభ్యాసం, కుటుంబ నేపథ్యాల రీత్యా ఇద్దరి మధ్యన ఉన్న వ్యత్యాసాలు తెలిసాయి కదా ఇంకా చాలా ఉన్నాయి.

సుందరి తెల్లని తెలుపుకాని, పెద్ద ఆకర్షణీయంగా ఉండదనే చెప్పాలి. పెళ్లినాటికే కాస్త బొద్దు జన్యురీత్యానో లేకవ్యాయామ బద్దకం 'మూలానోగాని', కాలక్రమేణా కాస్త స్థూలకాయురాలైంది. కాస్త పొట్టి కూడా. ఇకపోతే సుభాష్ అప్పటికీ ఇప్పటికి ఆరడుగుల దృఢకాయుడు. చామనఛాయే గాని ముఖంలో, ఆకర్షణీయమైన ఏదో దీప్తి "పెళ్లినాడు అలా ఎవరికి అనిపించలేదేమో గాని, ఇప్పుడు ఒకరి పక్కన ఒకరు నుంచుంటే కరెంటు పోల్ పక్కన నిలబెట్టిన గ్యాస్ సిలిండర్‌లా, లేదా గోడకి చేర్చిన గుమ్మడికాయ పక్కన పెట్టిన ములక్కాడలా, ఉంటాం మా దంపతులం" ఈ మధ్యనే హాస్య చతురత మెండుగా గల సుందరి అన్న మాటలు ఇవి! సుందరికి కొంచెం లౌక్యం, హాస్యచతురత ఉన్నాయన్నమాట. అయితే భర్త మితభాషి. ముక్కు సూటి స్వభావం. భార్య కాస్త ఆదర్శవాది. భర్త పూర్తిగా వాస్తవికవాది. ఇలా ఏకోణంలో, దృక్కోణంలో చూసినా, భిన్నమైన స్వభావాలు, వ్యక్తిత్వాలు, స్థాయీ భేదాలున్నఈ ఇద్దరూ దంపతులయ్యారు. ఇద్దరికీ శిక్షణ సమయంలోనే పరిచయమయ్యింది. తొలి పోస్టింగ్ ఇద్దరికీ కరీంనగర్. ఆ సమయంలో సుందరే ఎక్కువ చొరవ చూపించి పరిచయాన్ని పెంచింది. ప్రేమలోకి దింపింది. పెళ్లికి అందర్నీ ఒప్పించింది. వాళ్ల పెళ్లినాడే కొందరు "అడవిలో ఉసిరి సముద్రంలో ఉప్పు కలిసాయి ఇంచక్కా" అన్ని హర్షిస్తే, కులం ప్రాంతం, స్థాయి ఏమీ కలవని వీళ్ల దాంపత్యం ఎలా ఉండనుందో ఏమిటో" అని వ్యాకుల పడ్డారు,

కొందరు! కాని వీళ్ళు అన్యోన్యదంపతులుగానే ఉంటున్నారు. పెళ్లయి పదేళ్ళు దాటినా!!

"ఇన్ని వ్యత్యాసాలున్నా ఇదెలా సాధ్యమైంది" అని ఒక్కతే ఉన్నప్పుడు సుందరిని చాలా సన్నిహితురాలైన, శ్యామలి అడిగితే తను చెప్పిందేమిటో తెలుసుకుంటే మనకూ ఆ సందేహం తీరిపోతుంది.

"నిజమే శ్యామలా, మా ఇద్దరి మధ్య మీ అందరికీ తెలిసిన ఎన్నో వ్యత్యాసాలున్నాయి. మీకు తెలియనిది మరొకటి ఉంది. అదేంటంటే నేను "సమైక్యవాదిని", మాకు పరిచయం అయిన సమయంలోనే మలిదశ తెలంగాణ ఉద్యమం మొదల్కైంది. సుభాష్ ఆ "టాపిక్" ఎత్తటానికే ఇష్టపడేవాడు కాదు! ఎందుకనో! అయినా నేను ఒకసారి ఏ భాషవారికి లేని ఈ "యాసాద్వేషాలు" మన తెలుగువాళ్లకే ఎందుకు? ప్రతీ ఇరవై మైళ్ళకు యాస మారిపోతుంది కదా, ఏ భాషాలోనైనా. మరి భాషా ప్రయుక్త రాష్ట్రాల్ని ఎందుకు చీల్చాలి? తెలంగాణకి ఒప్పుకుంటే దేశంలో మరెన్నో "యాసా ప్రయుక్త రాష్ట్రాలు" ఏర్పరచాల్సి వస్తుంది. అలా చేస్తే దేశ సమైక్యతకు భంగం ఏర్పడుతుంది. నన్నయ నుండి నారాయణ రెడ్డివరకున్న మన సాహిత్య సంపదను ఎలా పంచుకోగలం? తెంచుకోగలం? కవిత్రయ విరచిత మహాభారతం, పోతన రచించిన శ్రీమద్భాగవతం, శ్రీశ్రీ ఆరుద్ర కాళోజీల ఆధునిక కవిత్వం ఇవన్నీ మన ఉమ్మడి సాహిత్య సంపదకాదా – చిన్న విషయాలకు "భాషా బంధం" ఎందుకు తెంచుకోవాలి. ఉమ్మడి రాష్ట్రంగా ఉంటేనే ఇతర భాషీయులు మనల్ని గౌరవిస్తారు. విడిపోతే ఈ సడిస్తారు". అని ఆవేశంగా అంటే, "విడిపోయినా కావడి కుండల్లా కలసి ఉండొచ్చేమో? కలిసి ఉండి నిత్యం కాట్లాడు కోవటం కన్న అదే మేలేమో?" అని ముక్త సరిగా అని ఇంకెప్పుడూ మనం ఈ టాపిక్ మాట్లాడుకోవద్దని ముక్తాయించాడు సుభాష్.

దాంతో నా కర్థమైంది, ఏంటంటే భిన్నాభిప్రాయాలున్న "టాపిక్" మాట్లాడు కోక పోవడమే, మంచిదని. మాకు పెళ్లయ్యాక కూడా, అదే సూత్రం పాటించాం ఇద్దరం. అదలా ఉంచి ఏ దంపతుల మధ్యనైనా వృత్తి , స్వభావాలు, నేపథ్యాల రీత్యా చాలా వ్యత్యాసాలుంటాయి. వాటిని వైరుధ్యాలుగా మార్చుకోకపోవటం వాళ్ల

చేతుల్లోనే ఉంటుంది. ఉన్న సారూప్యాలను తగినట్లుగా ఉపయోగించుకుని వ్యత్యాసాలను పట్టించు కోకుండా ఉంటే ఆ దంపతులది అన్యోన్య కాపురం గానే ఉండిపోతుంది. అలానే నిలిచిపోతుంది. మా అన్యోన్యదాంపత్యంలో ఉన్నరహస్యం ఇదే. ఇంకేం కాదు. కొద్దిపాటి సర్దుబాట్లు, పరస్పర అనురాగం, సహనం మా అన్యోన్యతా భవంతికి మూల స్థంభాలు. ఇంత వివరంగా సుందరి చెప్పిన సమాధానం విన్న స్నేహితురాలు సంతృప్తిగా తల పంకించింది. మనం కూడా సంతృప్తి చెంది "ఫ్లాష్‌బేక్" ముగించి కథాప్రారంభంలోకి తిరిగి వెళ్దామా?

కథా ప్రారంభంలో చెప్పుకున్నట్లు, అంతకు ముందు నుండే తమ మధ్య ఉన్న'అలిఖిత ఒప్పందం' ప్రకారం 2014 జూన్2న అంటే తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావ దినాన సుందరి ఐ.ఏ.యస్, సుభాష్ ఐ.పి.యస్ లిద్దరికి ప్రస్తుతానికి హైద్రాబాద్ ఉమ్మడి రాజధానిగా కొనసాగినా, దరిమిలా ఏదో ఒకరాష్ట్రాన్ని ఇద్దరూ ఎంచుకోవాల్సి ఆవశ్యకత వస్తుందని తెలిసినా, ఆ విషయం గురించి అరమరికలు లేకుండా మాట్లాడుకోలేక పోయారు. సుభాష్ మనసులో, ఇద్దరూ తెలంగాణ రాష్ట్రంలో ఉండాలని, సుందరి మనసులో ఆంధ్రాకే ఇద్దరూ కేటాయింపు పొందాలని ఉన్నా, ఆ విషయం బయటికి వ్యక్తపరచలేకపోయారు. 'ఏదెలా జరగాలో అదే జరుగుతుందన్న' నిర్లప్తత ఆవహించింది ఇద్దరినీ, ఎవరి కార్యాలయాలకి వాళ్ళు వెళ్లిపోయారు ఆ రోజుకైతే – తర్వాత కూడా, పరస్పరం చర్చించుకోలేదు గాని, కాసేపు 'ఆ రాష్ట్రమైతే బాగుంటుందని ఆ మరుక్షణమే కాదు ఈ రాష్ట్రమైతే మేలు' అనే పరస్పర విరుద్ధ భావాలతో ఎవరి మనసులో వారు మథన పడసాగేరు. అలా కొన్నినెలలు, గడిచిపోయాయి. ఈ లోగా "ఆర్డర్ టు వర్క్" రూపంలో, గవర్నర్ అనుమతితో అఖిల భారత సర్వీసు అధికారుల తాత్కాలిక కేటాయింపు జరిగింది.

ఆయా అధికారుల ఐచ్ఛికాలు పరిశీలించిన పిదప, మన వాళ్ళు ఎటూ తేల్చుకోలేక తమ ఐచ్ఛికం (ఆప్షన్) తెలియ చేయలేదు. దాంతో సహజంగానే ప్రభుత్వం విద్యాభ్యాసం, పుట్టుక, ఎక్కడ జరిగిందో, సర్వీసులో చేరినప్పుడు ఏ ప్రాంతాన్ని తమదిగా పేర్కొన్నారో పరిశీలించి తాత్కాలిక కేటాయింపులు జరిపేరు. దాని ప్రకారం సహజంగానే సుభాష్ ఐ.పి.యస్‌ని, తెలంగాణ రాష్ట్రానికి సుందరి

ఐ.ఏ.ఎస్‌ని ఆంధ్ర రాష్ట్రానికి కేటాయించటం జరిగింది. తుది కేటాయింపులు చేయటానికి "ప్రత్యూష్ కమిటీని" నియమించారు. "ప్రస్తుతానికి ఇద్దరికీ వేర్వేరు రాష్ట్రాలకి కేటాయింపు జరిగినా "కొంతలో కొంత నయం"– ఇద్దరికీ ఉమ్మడి రాజధాని హైద్రాబాద్‌లోనే పోస్టింగ్ ఇచ్చారని సంబరపడవద్దు. దంపతుల, కేటగిరీకి ఏదో ఒక రాష్ట్రానికే ఇద్దరినీ కేటాయించమని ప్రభుత్వానికి, లేదా "ప్రత్యూష్ సిన్హాకమిటీ" కి వినతి పత్రం సంయుక్తంగా ఇవ్వండని శ్రేయోభిలాషులు సలహా ఇచ్చారు. కాని వీళ్లు ఆ పనిచేయలేదు కారణం ముందే చెప్పుకున్నాం.

ఇద్దరూ అలా నిర్లిప్తంగా, నిష్క్రియా పర్వంగా ఉండిపోవడానికి కారణమేంటో ప్రత్యేకంగా చెప్పాలా. ఇథమిద్ధంగా ఇద్దరు గాని, ఏ ఒక్కరూ గాని నిర్ణయించు కోలేక పోవడమే. కుటుంబ శ్రేయోభిలాషులు ఇంకా పోరుతూనే ఉన్నారు. అయినా వీళ్ళు ఎవరి మాటా వినలేదు. కొన్ని నెలల తర్వాత తుది కేటాయింపులూ జరిగిపోయారు, సుందరిని, ఆంధ్రాకి సుభాష్‌ని తెలంగాణకి కేటాయించారు. సుభాష్‌కి 'సెంట్రల్ ట్రిబ్యునల్‌కి వెళ్తే జననపత్రం దాఖలు చేస్తే ఆంధ్రాకి కేటాయంపు జరిగే అవకాశం ఉంటుందని' కొందరు సూచించారు. అలాగే సుందరి బంధువొకాయన, కరీంనగర్ లీడర్ ప్రస్తుతం తెలంగాణ మంత్రిగా పని చేస్తున్న ఒక ప్రముఖుడు ఆమె తన మూలాలు కరీంనగర్ అని పేర్కొంటూ, ఒక వినతి పత్రమిస్తే 'సి.ఎం' తో మాట్లాడి తెలంగాణకి కేటాయింపు మార్పిస్తానని హామీ ఇచ్చాడు. కాని ఇద్దరూ వినలేదు. అలా చేయలేదు. తర్వాత పోనీలే ఇద్దరూ హైద్రాబాద్‌లోనే ఉంటున్నారు కదా అనే ఉపశమనం కూడా లేకుండా, ఓటుకి నోటు కేసు ఫలితంగా ఆంధ్ర రాష్ట్ర రాజధాని హైదరాబాద్ నుండి తరలి పోయింది.

2015–2016 కల్లా సుందరి గుంటూరులో ఒక ఇల్లు అద్దెకి తీసుకోవాల్సి వచ్చింది. సుభాష్ ఎంత నిష్పక్షపాతంగా, నిబద్ధతతో పనిచేస్తున్నా ఎవరో హోంమంత్రికి ఇతడు 'ఆంధ్రోడని' ఇంకా ఏవేవో ఫిర్యాదులు చేసి అదిలాబాద్‌కు బదిలీ చేయంచారు. దాంతో మనవాళ్లు "హైదరాబాద్" లో "వీకెండ్" కాపురం చేయగలిగే అవకాశం కూడా తగ్గిపోయింది. అయినా సుందరి సుభాష్‌లు తమ తమ రాష్ట్రాల్లోచిత్త శుద్ధితో పనిచేస్తూనే ఉన్నారు. కుటుంబ పరంగా వ్యక్తిగతంగా

వచ్చిన అసౌకర్యాన్ని లెక్కచేయకుండా. ఇదండీ రాష్ట్ర విభజన ఫలితంగా సుందరి సుభాష్ దంపతులకి వచ్చిన వియోగం. అది 2016కి వారి ప్రమేయం లేకుండానే, తొలగిపోయింది! ఎలా అంటే సుభాష్ ఐ.పి.యస్‌ని, "సి.బి.ఐకి తీసుకొని ఢిల్లీ పోస్టింగ్ ఇచ్చారు. సుందరి, గుంటూరు జిల్లాకలెక్టర్‌గా ఎంతో బాగా పనిచేసి చాలా మంచి పేరుతెచ్చుకుంది. తన పని తీరుతో కొన్ని కేంద్ర ప్రభుత్వ అవార్డులూ పొందింది. దాంతో ఆవిడ అడగకపోయినా, కేంద్రప్రభుత్వ ఆరోగ్యశాఖలో జాయింట్ సెక్రటరీగా డిప్యుటేషన్ మీద తీసుకున్నారు. అలా దంపతులిద్దరూ ఢిల్లీలో కాపురం పెట్టి ఆరేళ్ళు హాయిగా ఉన్నారు. కరోనా కాలంలో సుందరి ఐ. ఏ.యస్ ప్రతిభ దేశం మొత్తం తెలిసింది.

రచనా కాలం - 2015

తాజాకలం : 2022 వచ్చేసింది. డిప్యుటేషన్ పిరీయడ్ ఇద్దరికీ ముగియ బోతోంది. ఎవరి రాష్ట్రానికి వాళ్లు తిరిగి వెళ్లిపోవాలి. సమస్య మళ్లీ తిరిగి ప్రారంభమైంది. ఇప్పుడేం చేయాలి?

రచయిత ఆశ : ఇద్దరికీ ఐక్యరాజ్యసమితిలో డిప్యుటేషన్, న్యూయార్కులో పోస్టింగ్ వస్తే బాగుంటుంది. అదే జరిగితే వాళ్లరెండు తెలుగు రాష్ట్రాలకి అంతర్జాతీయ ఖ్యాతి తెస్తారు.

(రచనా కాలం - 2015)

# "భలే అత్తా కోడళ్లు!"

నన్ను వింత మనిషనుకున్నా పర్వాలేదు గాని, నాకు ఎవరైనా, "లోకరీతి"కి భిన్నంగా ఉంటే, అస్సలు నచ్చదు! ఉదాహరణకి, మా ఆఫీసులో, నా పక్క సీట్లో పనిచేసే ప్రబుద్ధుడు, "సుబ్బారావు" తను ఆర్థికంగా చాలా చిక్కుల్లో ఉన్నా అవకాశం ఉన్న సందర్భాల్లో కూడా బల్లకింద చెయ్యి పెట్టకపోవటం, నాకెంతో 'చికాకు' కల్పిస్తుంది. అంతేకాదు, అతనిపై ద్వేషాన్నీ, పెంచుతుంది! హారతి పళ్లెంలో వేసిన చిల్లర డబ్బుల్ని జాగ్రత్తగా హుండీలో వేసేస్తున్న పూజారిని చూసినప్పుడూ కోపం వస్తుంది. ఇంతివ్వాలని అడగకుండా, మీటరు వేసి, జాగ్రత్తగా నెమ్మదిగా తీసుకు వెళ్లే ఆటోవాడి మీద సదభిప్రాయం కలగదు. మీటరుని 'చక్కదిద్దాడని (ట్యాంపరింగ్ చేసేడని) ఊహించుకుని, తృప్తి పడతాను. ఆఖరికి, మా తండ్రి గారు, తక్కువ వయసులోనే అకాల మరణం పొందినప్పుడు మాకు న్యాయంగా రావాల్సిన ఆస్తికన్నా కొంచెం ఎక్కువే మా చిన్నాన్న అప్పచెప్పినప్పుడు కూడా, చాలా అసౌకర్యంగా అనిపించింది నాకు! అదన్నమాట, "సహజవాదం," అని పేరు పెట్టుకున్న నా ఆలోచనారీతి! నీతి!.

కొన్ని అసహజమైన లోకరీతికి విరుద్ధమైన సంఘటనలు, నా జీవితంలో, తరచుగా, తారసిల్లుతున్నా, దృఢమనస్కుణ్ణి గాబట్టి, 'ఎవరెలా పోతే నాకేం – నా మట్టుకు నేను నా స్వంత భావజాలానికి నీతికి, రీతికి, కట్టుబడి ఉంటే చాలదా? నా కుటుంబం వరకు ఆ పరిధిలో ఉంటే సరిపోదా? అని నాకు నేనే నచ్చజెప్పుకునే పరిస్థితి కూడా నేడు లేకపోవడం ఎంతో బాధాకరం – ఈ దుస్థితి నా పెళ్లైనప్పట్నుంచీ దాపురించింది నా ఖర్మకొద్దీ! ఇంకా అర్థం కాలేదా? మా అమ్మ మా ఆవిడ అంటే అత్తాకోడళ్లు, "లోకరీతికి" విరుద్ధంగా పరస్పరం, ప్రేమాభిమానాలతో ఉండడమే, నన్ను చికాకు పరుస్తున్న, ఉక్కిరి బిక్కిరి చేస్తున్న గడ్డు సమస్య కాల కూట విషపూరిత సర్పంలా నిలువెల్లా చుట్టుకుని క్షణ క్షణం చంపుకు తింటున్న పెనుముప్పు!

నిజానికీ ముప్పు నేనే స్వయంగా చేసిన తప్పు–తనకు మేనకోడలు వరసైన "మేనక"ను చేసుకోమని అమ్మకోరినా, ఎక్కడో పెళ్లిలో కనపడి మనసుని దోచేసిన "రత్న"ని చేసుకుంటానని పట్టుపట్టిందే నేను. అయిష్టంగానే 'రత్న'తో నా పెళ్లికి

ఒప్పుకున్న మా అమ్మ“సూర్యకాంతం” లోకరీతికి అనుగుణంగానే ఉంటుందని, కోడల్ని ‘ఎక్కడుంచాలో అక్కడే ఉంచుతుందని’, కుటుంబంలో కొత్త వ్యక్తిని అదుపాజ్ఞలలో ఉంచే బాధ్యత, చక్కగా నిర్వహిస్తుందని నేనూహించటం, లేదా ఆశించటం అసహజమేమీ కాదుకదా! సర్దుకుపోవచ్చు అనటం సులభమేగాని, పెళ్లిలో, ఆ వెంటనే జరిగిన ఈ మూడు ఉదంతాల్ని తెలుసుకుంటే నాబాధ, వ్యధ కొంచెమైనా అర్థం కావొచ్చేమో మీకు! అసలు పెళ్లే చాలా అసహజంగా జరిగింది నా దృష్టిలో! ఆడపెళ్లివారు మగపెళ్లివారిని అంటే, మా అమ్మతో సహా మావాళ్లని నన్ను పెద్దగా నెత్తిన పెట్టుకుని చూసిందీ, అడుగులకు మడుగులొత్తిందీ లేదు! భోజనాది విషయాల్లో లోటు పాట్లేమీ జరగని మాట వాస్తవమే అయినా, అమ్మతో సహా మా వాళ్లెంతో నిస్సంకోచంగా అంతగా మెచ్చుకోవటం నిజంగా అవసరమా మీరే చెప్పండి! చాలా అసహజం కాదా! ఇది నాకు బాగా చిరాకు తెప్పించిన మొదటి ఉదంతం – రెండోది, ‘అలకపాన్పు’ వ్యవహారం – ఏదో చాలా ఖరీదైనదే అడుగుదామని నేననుకుంటున్నంత లోనే, ‘తగుదునమ్మా’ అని మా అమ్మ కలుగజేసుకుని, ‘మీరిచ్చేదేమిటీ నేనే నా కోడలికి ఇస్తాననేసి’ ఒకనెక్లెస్, పెళ్లికూతురు మెడలో వేయటం ఏమన్నా బాగుందా మీరే చెప్పండి! “ఎలాగూ కొనేశాను ఒకహీరో హోండా, కాదనక తీసుకోండి అల్లుడుగారూ”, అని మామగారు తాళం చెవి నా చేతిలో పెట్టడం వేరే సంగతనుకోండి, కాని, మూడో ఉదంతం ఎంతో అసహజమైనది మాత్రమే కాదు, మా మొదటి రాత్రిని నాకు“కాళరాత్రిగా” చేసిన దాని గురించి చెప్పాలంటే నాకే సిగ్గుగా ఉంది.

నేను శోభనం గదిలో చాలా అసహనంగా వేచి ఉండగా, తను గదిలోకి వచ్చి గడియపెట్టిందో లేదో, ఎవరో దబ దబా తలుపులు బాదేరు. నేను వద్దంటున్నా లెక్కచేయకుండా, ఈవిడ చకచకా తలుపులు తీయటం, ఆ వచ్చినావిడ “అమ్మాయ్, మీ అత్తగారు నీరసం వచ్చి సొమ్మసిల్లి పడిపోయేరు” అని అరవటం, ఈమె కంగారుగా హాలులోకి పరుగెత్తుకుని అత్తగారి చెంతకు చేరుకోవటమే గాక, నాతో పంచుకుందామని తెచ్చిన పాల గ్లాసుని ఆమెనోటికందించి, మెల్లమెల్లగా తాగించటం జరిగిపోయేయి. పిలిపించిన  డాక్టరు “దానం” గారు నిదానంగా వచ్చి అమ్మను పరీక్షించి – “ఏం పర్వాలేదు కొద్దిగా నీరసం అంతే – కాసేపు విశ్రాంతి తీసుకుంటే

చాలు. మందులేమీ వద్దు ఒకటి రెండు సార్లు గ్లూకోజు లేదా కొబ్బరి నీళ్లు తాగించండి," అని చెప్పేసి ఫీజు అడిగి మరీ తీసుకుని వెళ్లిపోయేడు– "రసభంగం" తాత్కాలికమేనని భావించిన నాకు తీవ్ర ఆశాభంగమే అయింది.

మా ఆవిడ'రత్న' అత్తగారి దగ్గర నుండి కదలలేదు. అక్కడే రాత్రంతా ఉండిపోయింది. 'హాల్లో'"సెంట్రల్ ఏసి, బాగానే పనిచేస్తున్నా, విసన కర్ర విసురుతూ అత్తగారితో సొల్లుకబుర్లు చెబుతూ ఆ రాత్రంతా ఉండిపోయింది. మా అమ్మకూడా"నువ్వెళ్ళమ్మా" అనలేదు. మా అత్తగారు, మామగారు "జాగ్రత్తగా చూసుకోమ్మా" అని కూతురికి చెప్పేసి వాళ్ల గదిలోకి దూరిపోయేరు, అమ్మలక్కలు కూడా ఆవులించుకుంటూ వెళ్లిపోయేరు. అలాంటి అసహజ సంఘటన ఈ భూలోకంలో మరెక్కడైనా జరిగి ఉంటుందా? నేనొక్కడినే శోభనం గదిలో ఒంటరిగా ఉండిపోయాను. తెల్లారింది, నా బతుకులా ఆరోజు! సరే తర్వాత ఒకనెల రోజులు గడిచేక, మాత్రమే మళ్లీ ముహూర్తం కుదిరి శోభనం జరిగింది, మా ఆవిడ కాపురానికి వచ్చింది. అత్తా కోడళ్ల ప్రేమానుబంధం నాకు కంటగింపుగా, ఇతరులకి ఇంపుగా, దిన దిన ప్రవర్ధమాన మవుతూనే ఉంది.

భర్త గౌరవానికి, సుఖానికి, 'రత్న' ఏమాత్రం లోటు చేయకపోతున్నా, 'అత్తాకోడళ్లు' అంత అన్యోన్యంగా ఉంటూండటం నాకు మంటగానే ఉంటోంది. 'అలవాటు పడలేని', 'పోనీలే అనుకోలేని', ఒక అసహజ అసౌకర్యం గానే భావిస్తూ నాలోనేనే కుమిలిపోతున్నాను. బయట కూడా, ఎవరితోనూ సరిగా ఉండలేక పోతున్నాను. వీళ్లిద్దరి అనుబంధాన్ని శ్లాఘిస్తూ బంధుమిత్రులందరూ చేస్తున్న వ్యాఖ్యానాలు నా మనసుని మరింత రెచ్చగొడుతున్నాయి. పరిస్థితిని మార్చి తీరాలన్న పట్టుదల మరింత పెరిగింది. వాళ్లిద్దరి మధ్యన సంబంధాన్ని చెడగొట్టడానికి ఏ అవకాశాన్నీ వదులుకోరాదని, అవసరమైతే "సృష్టించుకోవాల"ని నిర్ణయించు కున్నాను.

ఒకరోజున బజార్లో ఎవరో కనపడి, మా మామగారికి ఆమధ్యనెప్పుడో, కొంచెం 'సుస్తీ' చేసిందని చెప్పగా, వెంటనే ఇంటికొచ్చేసి, మా ఆవిణ్ని గదిలోకి పిలిచి వాళ్ల నాన్న అనారోగ్యం గురించి 'చిలువలు పలువలు' కల్పించి చెప్పి "మా

అమ్మ గుడినుండి వచ్చేలోగా మీ ఊరు వెళ్లిపో - ఆవిడొస్తే ఇంట్లోపనికి తనకు శ్రమవుతుందని నిన్ను వెళ్లనివ్వదు. మీనాన్న దగ్గర కనీసం ఒక నెలైనా ఉండి బాగా చూసుకో వెంటనే బయలుదేరి వెళ్లు. అమ్మకి నేనెలాగో సర్ది చెబుతానులే కన్న తండ్రి కన్న ఎవరూ ఎక్కువ కాదు"- అని తొందర పెట్టేశాను. అమ్మ తిరిగొచ్చేక, "నీకు చెప్పి వెళ్లమన్నా వినకుండా వెళ్లిపోయింది చూడు" అని ఎక్కిద్దామని మనసులో అనుకుంటూ...

కాని మా ఆవిడపెద్దగా ఆలోచించకుండా, "అబ్బెబ్బే - నేను లేకుండా "అత్తమ్మ"గారు ఉండలేరు. ఇంట్లోపని గురించి కాదు. నన్ను వదిలిపెట్టి క్షణమైనా ఉండలేరు. నేనూ అంతే, నేను వెళ్లనుగాక వెళ్లను. నాన్నను చూసుకోవడానికి అమ్మ, అన్నయ్య, ఇంకా చాలా మంది ఉన్నారు. కాని అత్తమ్మ గారిని నేనే చూసుకోవాలి. ఓ పనిచేయండి వెంటనే కాదు గాని వచ్చే ఆదివారం మీరు... మీరొక్కరే వెళ్లినాన్నను చూసిరండి- నాకు వెళ్లటం కుదరదు - కుదరదు" అని దృఢంగా చెప్పి నన్ను'అవాక్కు' చేసింది. మర్నాడే మామగారు, జున్ను, పిండివంటలు పట్టుకుని మా ఇంటికి వచ్చేరు! దిబ్బకుడుంలా ఉన్నారు!

ఇక నావల్ల కాదనిపించి కార్యసాధనకు పొరుగింటి "ఛాయాదేవి సాయం తీసుకోవాలని నిర్ణయించుకున్నాను, కుటుంబాల్లో కలతలు రేపటంలో ఆవిడి శక్తియుక్తుల గురించి విన్నవాణ్ని గాబట్టి ఎలాగైనా వీళ్లిద్దరి మధ్య విభేదాలు వచ్చేలా చేయమని రహస్యంగా కోరినప్పుడు, ఆవిడ ముందు బాగా ఆశ్చర్యపోయి, తర్వాత నావల్లకాదని చెప్పి, ఓరెండు వేలు చేతిలో పెడితే, "పనైతే మరికొంత ఇవ్వాలి సుమా" అని నసిగి, "నా ప్రయత్నం నేను చేస్తాను. నువ్వే నాక్లయింటువని ఎవరికీ చెప్పనులే" అని వాగ్దానం చేసింది!

రెండు రోజులు గడిచేయో లేదో, ఓ సాయంత్రం నేనింటికి వచ్చేసరికి, మా ఇంట్లో ఏదో గొడవ జరుగుతున్నట్లు వినిపించి గుమ్మం బయటే నిలబడిపోయి ఇన్నాళ్లకు అత్తాకోడళ్ల వాగ్యుద్ధం జరుగుతోందనిపించి, లోపలికి చూస్తూ చెవులు రిక్కించుకుని ఆతృతగా వినసాగేను. లోపల అత్తాకోడళ్లిద్దరు సున్నుండలు ఆరగిస్తూ,

ఎదురుగా, కుదురుగా నిలబడలేక, వణికిపోతూ, నీళ్లునములుతూ ఉన్న‘ఛాయాదేవిని’ సోఫాలో దర్జాగాపక్క పక్కనే కూర్చుని కడిగేస్తున్నారు!

“ఏమే, ఛాయాదేవి, పేరుకి తగ్గట్లే పక్కింట్లో తంపులు పెడదామని చూస్తున్నావా? నీకే పొయ్యేకాలం వచ్చిందే! ఎదురింటావిడతో “సూరేకాంతం అంటే మా అమ్మ అంటోంది. ఇంకా “కోడలితో నానా చాకిరీ చేయించు కుంటోంది. తను రుబ్బురోలులా, కూర్చుని ఆ చిన్నపిల్లతో వంటంతా చేయిస్తోంది. పనిమనిషిని మానిపించేసి అంట్లుతోమిస్తోంది. వాళ్లపుట్టింటోళ్లని ఈసడిస్తోంది, ఇలా, ఏదేదో వాగుతున్నావంట! ఎప్పుడడిగినా కాదనకుండా ఉప్పూ, పప్పూ అరువిస్తూండటమే నా తప్పైపోయిందా! కాళ్లిరగ్గొడతానే, ఏమనుకుంటున్నావో ఇది కూడా అమ్మగర్జన.

“వయసు రాగానే సరిపోతుందా పాడు ముసల్దానా – మా ఇంట్లో వంట ఎవరు చేస్తారో నీకేం తెలుసే – నేను కూరగాయలు కోసిస్తే వంటంతా అత్తమ్మే చేస్తారే, పాడు ముఖందానా– అత్తగారు రోజూ గంటసేపు అమృతాంజనం రాయించుకుంటారని వాగేవంట! అవును అత్తకోడళ్ల సీరియల్ ఎప్పుడైనా చూసినప్పుడు అందులో అత్తాకోడళ్లు కీచులాడుకోవడం చూసి చిరాకొచ్చి కాస్త తలకాయనొప్పొచ్చి, పడుకుంటే, వద్దంటున్నా వినకుండా తల్లిలాంటి తనకి కాసేపు అమృతాంజనం రాస్తే నీ సొమ్మేం పోయిందే? – నాకే కాస్త పుణ్యం వస్తుందిగాని – మా అత్తమ్మగారు నాకెంత సేవ చేస్తారో నీకేం తెలుసే – రోజూ నా తలలో పేలు చూసి, నూనె రాసి చక్కగా జడలేస్తారని నీకు తెలుసా? నేను రోజూ ఓ అరగంట ఆవిడ కాళ్లునొక్కుతాను. నిజమే ఆవిడ నాతలకు నూనె రాసి ఎంతసేపు చక్కగా మర్దనా చేస్తారో, నాకెంత హాయిగా ఉంటుందో నీకేం తెలుసే ముదనష్టపు దానా, మావి పరస్పర సేవా కార్యక్రమాలే దెయ్యమా”,–మా ఆవిడకంత వాగ్ధాటి, నిందా నైపుణ్యం ఉందని నాకప్పుడే తెలిసింది.

అత్తాకోడళ్లిద్దరి జంట దండయాత్రని ఇంకే మాత్రం తట్టుకోలేక ఛాయాదేవి, చేతులు జోడిరచి నమస్కారం చేసేసి, లెంపలేసుకుని అవమాన భారంతో తలవంచుకుని బయటికి వచ్చేసి. గుమ్మం బయటున్న నన్ను అదోలా చూస్తూ ఏదో గొణుక్కుంటూ పరుగు పరుగున తన ఇంటికి వెళ్లిపోయింది.

నెమ్మదిగా లోపలికి వెళ్లిన నన్ను చూసిన మా ఆవిడ మంచి నీటిని తెచ్చివ్వడానికి వంటింట్లోకి వెళ్లింది. అంతేగాని వాళ్లిద్దరూ ఛాయాదేవితో "తగాదా" గురించి ఏ ప్రస్తావనా తేలేదు! తర్వాత వారం రోజులు చాలా ఆందోళనగా గడిపేను. ఆ మాయదారి 'ఛాయాదేవి' నా గుట్టు రట్టు చేస్తుందేమో! నాకోరిక మేరకే, తల్లీకూతుళ్ల కన్న సఖ్యంగా మెలుగుతున్న నా ఇల్లాలు, అమ్మల మధ్య విభేదాలు సృష్టించడానికి ప్రయత్నాలు చేశానని, అందరికీ చెబుతుందేమోనని! అలా ఏమీ జరగకపోవటం, పైగా ఎందుకో తెలియదు గాని, వేరే ఊళ్లో ఉంటున్న ఇంకో కొడుకు ఇంటికి శాశ్వతంగా మకాం మార్చేసిందని తెలిసి ఊపిరి పీల్చుకున్నాను. అయితే, మా ఇంట్లో పరిస్థితి ఏమీ మారకపోగా, అత్తా కోడళ్లమైత్రి మరింత తారాస్థాయికి చేరుకోవటం మాత్రం నిరంతరం కొనసాగుతూనే ఉండటం నాకు దుర్భరం అయిపోయింది. వాళ్ల సఖ్యత నాకు ప్రత్యక్షంగా ఏవిధమైన చేటూచేయడం లేదు గాని, స్వభావ రీత్యా మనసుని కుదురుగా ఉండనీయటం లేదు. 'ఇకతప్పదు స్వయంగా కార్యరంగం లోకి దిగి  ఎంతో కొంత మార్పుని తీసుకురావాలని' నిర్ణయించుకున్నాను. లేకపోతే, నా తెలివితేటలకి, ఆమాటకొస్తే జీవితానికే సార్ధకత లేదనిపించింది.

ఒకరోజు మా ఆవిడ, బాత్రూంలో తలస్నానానికి వెళ్లిన సమయంలో, అమ్మదగ్గరికి చేరి,"అమ్మా– నువ్వు మరీ అమాయకురాలిలా, కోడలిని బాగా నెత్తి కెక్కించుకుంటున్నావు. అది అలుసుగా తీసుకుని నన్నేమాత్రం లెక్కచేయటం లేదు. రేపొద్దున్న నిన్నూ లెక్కచేయదు. నీ మంచి కోసమే చెబుతున్నా, జాగ్రత్తపడు మా అమ్మకేమైనా, కష్టనష్టాలు" కలిగితే నేను తట్టుకోలేను" డైలాగు బాగానే పేల్చాననుకున్నాను. కాని తుస్సుమంది "పోరా పిచ్చి పిచ్చి జోకులు వేయకు, నీ పని నువ్వుచూస్కో అని పకపకా నవ్వేసి, బియ్యంలో రాళ్లేరటంలో నిమగ్నమై పోయింది.

'ఇలా కాదు. అట్నుంచి నరుక్కొద్దామని' ఆరోజు రాత్రి మా ఆవిడతో గుసగుసగా "మా అమ్మఒంటి పిల్లిరాకాసి – మీ వాళ్లంటే అసలేగిట్టదు. నీతో లబ్జుగా అంత చాకిరీ చేయించుకుంటుందా?– నువ్వు లేనప్పుడు పెళ్లాన్ని మరీ

నెత్తిమీద పెట్టుకోకూడదురా – కాస్త అదుపాజ్ఞలలో పెట్టుకోవాలి. ఇప్పటికే అందరూ నిన్ను పెళ్లాం చేతిలో బానిసఅంటున్నారు. తట్టుకోలేకపోతున్నా. నేనున్నప్పుడే పరిస్థితి ఇలా ఉంటే, నేను పోయేక, ఇంకా విజృంభిస్తుందేమో ఏమిటో – "అని నూరిపోస్తోంది. అంతేనా, మీ వాళ్లని కూడా దూరంగా ఉంచమని చెబుతోంది" అన్నాను.

"అత్తమ్మగారు అలా అని ఉండరు – నన్ను ఉడికించుదామని లేని పోని కథలల్లకండి. ఒకటి మాత్రం నిజం. ఆవిడ ఏం చెప్పినా మనిద్దరి మంచి కోసమేనని అనుకోవాలి. తు.చ. తప్పకుండా పాటించాలి. అలాంటి తల్లి లభించటం మీ అదృష్టం– అత్తగా పొందటం నా పూర్వజన్మ సుకృతం" అని పిచ్చి పిచ్చిగా వాగి నిద్రలోకి జారిపోయింది. నాకు నిద్రకరువు చేసింది.

ఐనా నాకు బుద్ధిరాలేదు! కొన్ని రోజుల తర్వాత అమ్మదగ్గరికి చేరి మరో అస్త్రం ప్రయోగించేను. "నీ కోడలికి చెప్పవద్దుగాని తనకీ మధ్య నీ పేరు మీద మీ పుట్టినూరులో ఉన్న నాలుగెకరాలు ఆస్తిమీద, కన్నుపడింది. ఆ ఆస్తిని వేరెవరికైనా, నీతరుపు పుట్టింటివాళ్లకి రాసిచ్చేస్తావేమోనని, అనుమాన పడుతోంది. మీ పేరున రాయించుకోండి" అని తెగ పోరుతోంది" అని కుడిచెవిలో వేశాను, ఎడమ చెవి నాచేతితో మూసేసి – ఓ చెవితో విని రెండో చెవిగుండా వదిలేస్తుందేమోనని నేనేదో కితకిలు పెట్టినట్లు గలగలా నవ్వేసింది. కాసేపటికి నవ్వాపుకుని నావైపు సాలోచనగా చూస్తూ ఏమందో తెలుసా??

"నీకొస్తాయేమో గాని నాకోడలు రత్నానికి అలాంటి పాడు ఆలోచనలు రావు. అది సరేగాని, నాకూ డెబ్బైఏళ్లు వస్తున్నాయి. ఎప్పుడు ఏది ఎలా ఉంటుందో తెలియదు. అన్నీ బాగున్నప్పుడే, మీ మేన మామలు మనతో బాగానే ఉన్నప్పుడే, రాత కోతలు పూర్తి చేసుకుంటే మంచిది. మీ నాన్న ద్వారా వచ్చిన ఆస్తి ఎలాగూ నీదే అవుతుంది, మాకు ఏకైక కుమారుడివి గాబట్టి, మా పుట్టినూరులోని ఆ ఆస్తి "నా స్త్రీ ధనం. కూతురితో సమానం, కాదు ఇంకా ఎక్కువే అయిన కోడలు "రత్నకే" చెందటం న్యాయం. ఆ విధంగా పత్రాలు రాయించు. రిజిష్టర్ చేయించుదాం"

అనేసి వత్తులు చుట్టుకోవటంలో నిమగ్నమైపోయింది. ఆ విధంగా అప్రయత్నమూ విఫలమైపోయింది.

ఆరోజు రాత్రే ఆఖరి బ్రహ్మాస్త్రం, రత్నం మీదప్రయోగించాను. "మనకి పెళ్లై రెండేళ్లైనా, నీ కడుపు పండలేదని మీ అత్తగారికి నిరాశగా ఉంది. పొద్దున్నే నన్ను పిలిచి మనవంశం ఇలా ఆగిపోతే ఎలారా? నా కోసమైనా, ద్వితీయ వివాహం చేసుకో రత్నకి నేను నచ్చచెబుతానులే ఒప్పుకో అని తన చేతిలోనా చెయ్యి వేయించుకుంది. పైగా సంబంధం కూడా ఖాయం చేసేసింది. అదే మేనక లేదూ తనకి మేనకోడలు వరసవుతుందిలే. అసలు దానితోనే నాకు పెళ్లి చేయాలనుకుంది. అప్పుడు కుదరలేదనుకో – ఇప్పటికైనా మన దాంపత్యం నిలవాలి. నాకు "ద్వితీయం" తప్పించాలంటే ఒకటే మార్గం ఉంది. అది ఏకారణం చెప్పకుండా మనం ఈ ఇంట్లోంచి వెళ్లిపోయి, వేరు కాపురం పెట్టడమే. అమ్మని ప్రస్తుతానికి ఈ ఇంట్లోనే ఒంటరిగా వదిలేసి వెళ్లిపోవటమన్నమాట. ఏమంటావు చెప్పు. నిన్ను వదిలి నేను ఉండలేను.ఏమంటావ్. "గడగడా బాగా ఆలోచించి ఉంచుకున్ననా డైలాగు వల్లె వేశాను. అటు తిరిగి పడుకున్న మాఆవిడముఖంలో భావాలు కనపడలేదు గాని 'అత్తగారు చేయ బూనుకున్న అన్యాయానికి మనసు మండిపోతూనే ఉండాలి. ఎంత బాధ, వేదన కలిగాయో ఏమోగాని నోట మాట రాకుండా ఉండి పోయింది. నా పాచిక పారినట్లే అనిపించింది తన మౌనం నాకు దుర్భరంగా ఉన్నా, మాట్లాడించడానికి ప్రయత్నించక పోవటమే మంచిదనిపించింది. నేనూ మౌనంగానే ఉండిపోయాను. కాసేపటికి అనునయంగా మీద చెయ్యివెయ్యబోతే, విదిలించి కొట్టలేదుగాని, మంచం మీద ఇంకా, దూరంగా జరిగింది. అప్పుడప్పుడు, కొంచెం కదలుతుండటం గమనించి, 'పాపం తనకీ నిద్రపట్టడం లేదు. చాలా బాధపడుతోంది కాబోలు' అనుకున్నా. నాకైతే నిద్రపట్టలేదు. ఈ అమాయకురాలికి అనవసరంగా పచ్చి అబద్ధాలు చెప్పి అంతులేని బాధ కలిగించానే అన్నపశ్చాత్తాపం కలిగింది, నాకే ఆశ్చర్యకరంగా. అంతలోనే, నాలో అంతర్మధనం మొదలై క్షణక్షణానికి వటవృక్షంలా పెరిగిపోయింది. 'అసలు నేను చేస్తున్న పనేమిటి? ఇంట్లో ఇల్లాలు, అత్తగారు కలిసి మెలిసి ఉంటే, ఆ "ఇంటివాడికి అంతకు మించిన అదృష్టం ఏముంటుంది?" ఎన్ని కుటుంబాల్లో చూడటం లేదు. ఇంట్లో ఆడోళ్లు పరస్పరం

కొట్లాడుకుంటుంటే ఆ ఇంటి వాళ్లకి అంతకు మించి, నరకం ఉంటుందా? భార్య అమ్మ అలా ఇంచక్కగా, సఖ్యతతో, అచ్చం తల్లీకూతుళ్లలా ఉంటే ఆస్వాదించటం, ఆనందించటం చేతకాకపోతే పోనీ, తటస్థంగా ఉండిపోతే తనకేం నష్టం! ఎంత మూర్ఖంగా ఆలోచించాను. నేను ఎన్ని కుతంత్రాలు పన్నేను?

అన్నీ విఫలమైనా బుద్ధిరాక, ఆఖరికి ఈ రాత్రి అన్ని పచ్చి అబద్ధాలు చెప్పి భార్యకు అంత బాధకల్గించిన మూర్ఖత్వం నాకెలా వచ్చింది? తెల్లారాక అమ్మతో గాని, ఇంకెవరితోనైనా గాని కాస్త మాట్లాడితే చాలు "రత్న"కి నేను చెప్పినవన్నీ పచ్చి అబద్ధాలు అని తెలిసిపోదా? అప్పుడు నేను నా తల ఎక్కడ పెట్టుకోవాలి? ఇలాపరిపరి విధాల మథనపడిన నేను, తెల్లారిన వెంటనే ముందు 'రత్న"కి తర్వాత అమ్మకి, చేసిన కుతంత్రాలకి, చెప్పిన అబద్ధాలకి, క్షమాపణలు చెప్పుకోవాలి అని నిర్ణయానికి వచ్చిన తర్వాతనే తెల్లవారు జామున నిద్రపట్టింది నాకు. మర్నాడు ఏడు గంటలకి మాత్రమే మెలకువవచ్చింది. హాల్లో అమ్మ ఫోనులో మాట్లాడుతున్నది వినిపించింది.

"అవునండీ, మేనక నాకు వరసకి మేనకోడలే, అసలు మా అబ్బాయికే చేసుకుందామనుకున్నాం కాని అలా జరగలేదు. రాసిపెట్టి లేకపోతే అంతేకదండీ – సరే ఇప్పుడు విషయమేమిటంటే, ఆ మేనకకి వారం క్రితం మా కోడలు రత్నం తన చుట్టాల్లో ఒక అబ్బాయితో సంబంధం కుదిర్చింది, వచ్చేనెల 6వ తేదీన వివాహం, మీకు పౌరాహిత్యం చేయటం కుదురుతుందా?" తర్వాత ఫోనులో అమ్మమాటలు ఏమాత్రం వినపడలేదు. కారణం, విన్నమాటలకే నా మనసులో పెద్ద విస్ఫోటం! చెవులు మొద్దుబారిపోయాయి–అంటే మేనకకి రత్న ప్రమేయంతో ఇప్పటికే పెళ్లికుదిరిపోయిందా? దీనర్ధం ఏమిటి? రత్నకి నేను రాత్రి చెప్పినవన్నీ పచ్చి అబద్ధాలు అని వెంటనే తెలిసిపోయినా, నమ్మినట్లు నటించిందా? ఇంకానయం ఇప్పుడు తను గదిలో లేదు. ఎప్పుడో లేచి వెళ్లిపోయింది గాబట్టి సరిపోయింది లేకపోతే తన ముఖం ఎలా చూడగలను? ఇప్పుడేం చేయాలి? అమ్మకు ఏమీ చెప్పవద్దని కాళ్లమీద పడిపోవటం, ఈ ఒక్కసారి నా తప్పు క్షమించమని ప్రాధేయపడటం తప్ప చేసేదేముంది?

ఇలా అనుకుంటుండంగా తలారా స్నానం చేసి అప్పుడే పూజ ముగించుకుని వచ్చిన పవిత్రమైన ఆకారంతో, పట్టు చీర రెపరెపలలో రత్న గదిలోకి అడుగుపెట్టింది. అనురాగం, ఆప్యాయతలు కలబోసిన చిరునవ్వు చిందిస్తూ "అత్తమ్మగారు మిమ్మల్ని పిలుస్తున్నారు రండి"– అంది పక్కన బాంబు పేల్చినట్లయింది నాకు! ఏమీ పాలుబోక బిత్తర చూపులు చూస్తుంటే, జాలి కలిగి కాబోలు, "ఏం కంగారు పడకండి– రాత్రి మీరు చెప్పిన ముచ్చట్లు ఆవిడికేమీ చెప్పలేదు. వేరే విషయం చెప్పటానికి పిలుస్తున్నారు" అంటూ నన్ను సుతారంగా ముందుకు తోసింది.

చేసేదేం లేక హాల్లోకి వెళ్లి అమ్మ ముందు గాభరాగా నిలబడ్డాను. రత్న తను ముందు అమ్మ కాళ్ల మీదపడి నన్నూ అలాగే చేయమని సైగచేసింది. చేసేదేంలేక, నేను కూడా అమ్మకాళ్ల మీద పడ్డాను. ఆవిడ ఏం తిట్టి పోసినా భరించడానికి మానసికంగా సంసిద్ధమయ్యాను.

"మీ ఇద్దరికీ నాఆశీర్వాదాలురా నాకుచాలా సంతోషంగా ఉంది, మన ఇంట్లోకి "నాలుగోమనిషి" రాబోతున్నాడని నిన్ననే తెలిసింది. "ఏంట్రా అలా అయోమయంగా చూస్తున్నావు? నువ్వు నాన్నవి కాబోతున్నావు రత్న నెలతప్పిందని డాక్టరమ్మ నిన్న సాయంత్రమే నిర్ధారించిందంట. పిచ్చిపిల్ల ఈ మాట మీ అబ్బాయికి రేపు ఏకాదశి పూట ఉదయాన్నే మీ నోటితోనే చెప్పాలి అత్తమ్మా" అంది.....

"అందేంటే! ఒక్కసారిగా అరిచేవ్, 'అమ్మో'అని– ఏదైనా కుట్టిందా...."“కాదు అత్తమ్మా! ఆనందం పట్టలేక మీ అబ్బాయి ఎక్కడెక్కడో గిల్లేస్తున్నారు. వద్దని చెప్పరా ప్లీజ్. "బరితెగించిన" మా ఆవిడమాటలకి మా అమ్మ మనసారా నవ్వింది. ఆనంద భాష్పాలు రాల్చింది. కోడలి తల ఆప్యాయంగా నిమిరింది. నాకూ ఓటమిలో ఆనందం అంటే ఏమిటో తెలిసింది.

(రచనాకాలం – 2008)

# పెళ్లిచూపులు

పెళ్లిచూపుల తతంగం దాదాపుగా ముగిసిపోవచ్చింది. ఆద్యంతం అసలు ఛాల్తీలు అంటే, కాబోయే వధూవరుల వదనాలు ప్రసన్నంగానే ముసి ముసి నవ్వులతో నిండి ఉండటం గమనించిన ఇరుపక్షాల పెద్దలు, వాళ్లు "ఒకరినొకరు బాగానే ఇష్టపడుతున్నారని" నిర్ధారించేసుకుని, అడక్కుండానే, ఇతర విషయాలన్నీ పచ్చిగా నిక్కచ్చిగా మాట్లాడుకోవటం ప్రారంభించేశారు! అప్పుడు, ఎలాగో ధైర్యం కూడగట్టుకుని, కాబోయే వరుడు "హరిశ్చంద్రుడు" మధ్యవర్తి 'శర్మ' గారి చెవికొరికాడు. "నాకో చిన్నదౌటుంది.... మరి అది "తనే" తీర్చాలి అని వినీ వినబడక నిర్ఘాంతపోయి, తల తిప్పిన ఆయన రెండో చెవిలో వినికిడి మిషన్ ఉండటం గమనించి ఆ చెవిలో మళ్లీగొణిగాడు "అంటే అంటే నా అలవాటు..... తను సహిస్తుందో లేదో ముందే తెల్చుకోవాలి, ఏకాంతంలో" మిషన్ బాగానే పనిచేసి, మరింత నిర్ఘాంత పోయేడు మధ్యవర్తి 'శర్మ' అంతా సవ్యంగా ముగిసిపోతోంది, నాకమిషనేదో దక్కించేసుకుందాం', అనుకుంటున్న తరుణంలో 'ఇదేం పితలాటకం ఈ పిల్లగాడి అలవాటు ఏమిటో మద్యపానమా? పొగతాగటమా? ఒకవేళ ఉంటే మాత్రం ముందే చెప్పుకోవాలా, పిచ్చి సన్నాసి కాకపోతే! 'అని మధన పడిపోయి, చుట్టూ చూశాడు.

ఏమీ అర్థంగాక, అయోమయంగా "ఏమిటీవిషయం" అన్నట్లు తనవైపే చూస్తున్న వాళ్లని సమాధానపరచటం, తక్షణ కర్తవ్యంగా గ్రహించి, తన సహజ లౌక్యాన్ని జోడించి, అందరి తరపున వధూవరులు ఏకాంత సమావేశానికి అనుమతి ప్రకటించేశాడిలా "సంబంధం కుదిరిపోయింది కదా –ఇతర విషయాలు పిల్లల సమక్షంలో ఎందుకు? మనం మాట్లాడకుందాం వాళ్లని ఇంకో గదిలో కూర్చుని "అదీ ఇదీ" మాట్లాడుకోమందాం. ఈ రోజుల్లో ఇది "కామనే"కదా 'అభిరుచులు షరతులు' ఏమన్నా ఉంటే ముందే చెప్పుకుంటారు, అంతే" అనేశాడు. మనసులో మాత్రం ఈ పిచ్చోడు మనసు మార్చుకుని, ఒకవేళ తనకేమన్నా దురలవాట్లు గట్టా, ఉన్నా, వాటిని బయట పెట్టకుండా ఉండాలనే 'అభిరుచులు' అనే పెద్ద పదం వాడేను. చూద్దాం. ఏం జరుగుతుందో మరి!" అనుకున్నాడు. ఎందుకన్నా

మంచిదని హరిశ్చంద్రుని చెవిలో అన్నాడు" "అభిరుచులు అంటే అలవాట్లు కాదు సుమా జాగ్రత్తగా మాట్లాడు" – అని హెచ్చరించాడు. "సరేలే" అన్నట్లు అతను తలూపేసరికి కాస్త ఊరడిల్లాడు. కాబోయే వధువు కవిత మధ్యవర్తి ప్రకటన పూర్తవ్వక ముందే, తనూ అదే కోరుకుంటున్నట్లు అందరికీ అర్థమయ్యేలా, అంతవరకుదించి ఉన్న తలను దిగ్గున ఎత్తి, ఎవరివైపూ చూడకుండా, లోపలి గదిలోకి లేడిలా పరుగెత్తింది. వెళ్తూ వెళ్తూ, ఇంకా కదలవేంటి మహానుభావా" అనే విధంగా, చూసిన ఆమెచూపుల్ని ధిక్కరించలేక, కొంచెం తటపటాయిస్తూనే, అనుసరించాడు, హరిశ్చంద్రుడు. హాల్లో ఉన్న ఇద్దరు ముగ్గురు బామ్మలు బుగ్గలు నొక్కుకున్నా, మిగిలినవారు మాత్రం "మిగతా విషయాలు", మాట్లాడుకోవడంలో నిమగ్నమై పోయారు. ముందే చెప్పాల్సిందేమోగాని, కాబోయే వధూవరులు కవిత హరిశ్చంద్రుడికి ఒక కామన్ అభిరుచి ఉంది. అది తన జీవన భాగస్వామికి నచ్చకపోతే ఎలా? అనే సందిగ్ధం కూడాఉంది ఇద్దరికీ– ఇంతకీ ఆ అభిరుచి ఏమిటంటే, "ఎడాపెడా వచన కవితల నల్లటం"

ఇంకో విషయం, వాళ్ల ఉమ్మడి, నిశ్చిత అభిప్రాయంలో మంచి కవితలంటే, కాస్త అటూ ఇటూగా  అవసరమైతే అపసవ్యంగా, నిర్మాణక్రమం ఉండే, పొట్టి, పొడవు వాక్యాలకి వీలైనంత ప్రాస అద్దటం అంతే,  మరీ బ్రహ్మవిద్యేం కాదు అని వీళ్లిద్దరికీ ఉన్న ఈ ఉమ్మడి అభిరుచి గురించి, మరీ సన్నిహిత మిత్రులకు తప్ప చాలా మందికి తెలియకపోవడానికి కారణం, వాళ్లు చిరకాలంగా బాగా (బాగా అంటే బాగుగా, చక్కగా అని కాదు అర్థం, విరివిగా ఎక్కువగా అని మాత్రమే) రాసిన అసంఖ్యాక కవితలేవీ, పొరబాటున కూడా, ఏ పత్రికలోగాని, అంతర్జాల మాధ్యమంలో గాని రాకపోవటం!

సరే అదలా ఉంచితే, గాఢంగా కోరుకున్న"వివాహత్పూర్వ ఏకాంతం" వాళ్లిద్దరి మధ్య అలాంటి సందర్భాల్లో, కథల్లో చెప్పేటట్లు కొన్నిక్షణాలు, సంకోచ సంశయాల భరితంగా, మౌనంగా గడిచిపోలేదు! ఏమాత్రం ఆలస్యం భరించలేని కవిత గాత్రం ముందుగా మోగింది.

"కాదండి, మదీయలక్షణం, మాట్లాడటం, ఆచి తూచి

దాచి, అభిరుచి ఇప్పుడు, సంకోచించి, తదుపరి ముఖంవాచి
కుమిలి చావుట కాదు ఇష్టం – ఇక చెబుదునా నా అభిరుచి!
జిగిబిగి కవితలల్లుటయే అది – చివరి శ్వాసవరకు వదలలేనిదది
సదా“ఆదర్శపతి”గా ప్రోత్సహించెదరా? నిరసించి నీళ్లు జల్లెదరా,

మన పరిణయానంతరం? చెప్పుడు సత్వరం కవిత, ఈ కవితను దూరదృష్టి గలదై ముందే రాసిపెట్టుకుని, బట్టీ పట్టి, ఇప్పుడు మోగించిందా ఆశువుగా పలికిందా, అన్న “మీమాంస” వద్దులెండి మనకు. కానైతే, విన్న హరిశ్చంద్రుడి ముఖం వెలిగిపోయింది! కాటిలోని చితిమంటలాకాదు, ‘అదృష్ట హెూమాగ్నిలా ధగధగా, తనలానే కాబోయే భార్య కవతకు వచన కవితలల్లే, అలవాటుందని అర్థ మైనందు వలన. కాబట్టీ తన స్వీయకవితా సేద్యానికి ఆటంకాలుండే ప్రమాదం ఉండదన్న భరోసా కలిగినందున ఆ ఉత్సాహంలో, కసిలో ఇలా బదులిచ్చాడు  వెంటనే

“ఔనా – నీదీ నాది అభిరుచి ఒకటేనా
ఇంకేంకావాలే – నాకింకేంకావాలే
ఒకరికిద్దరమై – దద్దరిల్లేలా పాఠకలోకం,
చేద్దాం – బాగుగా కవితల సాగు,

విన్న కవిత ముఖంలో మిశ్రమ భావాలు తారాడాయి. ఒకపక్క అపరిమితమైన సంతోషం అతనికీ, తనలానే వచన కవితలల్లే అలవాటుందని, కాబట్టి తన అభిరుచిని పెళ్లయ్యాక కూడా ఇబ్బడిముబ్బడిగా కొనసాగించే ప్రోత్సాహం లభించటం తథ్యమని అనిపించినందువలన అయితే అతని స్థాయి తన స్థాయి కన్న తక్కువని అర్థమైనందు వలన మరో పక్క కొంత నీరసం.

ఒకటే అభిరుచైనా, అతని స్థాయి, ప్రావీణ్యం తనకన్న కొంత తక్కువ స్థాయిలో ఉందన్నది తెలుస్తూనే ఉంది గదా! ‘ఇంకే కావాలే–ఇంకేం కావాలే అనటంలో, కొంత పురుష అభిజాత్యం, కనపడుతోందన్న ఉక్రోషం. సినీ కవులను అనుకరించే గుణం కూడా ఉందన్న గ్రహింపుతో కాస్త నిరుత్సాహం. అంతలోనే రూపం, విద్యార్హతలు, ఆస్తి పాస్తులు, ఉద్యోగం, వగైరా వగైరాలలో నయమే కదా, పోగొట్టుకోరాదన్న తెలివితేటలు ఇలా ఎన్నోమిశ్రమ భావాలు. ఇది గమనించకుండా ఇంకా ఏదో అనబోతున్న అతడిని వారిస్తూ అంది లౌక్యంగా

"శ్రీవారూ (!) మీరు నాకుసరస్వతీదేవి వరం
మనం ఒకరికొకరం తగిన వారం
మీరు, నీరు కారనంటే చెప్పెద ఒకమాట
మీ కవితా సరళి సరళం – నాది గ్రాంథిక గరళం
కావున పోటా పోటీగా విడిగా చేయుదం రచనలు మాత్రం
జంటగా చేయుదం – సుఖ సంసారం – ఏమందురు?

కొద్దిగా గ్రాంధికపాకం తగ్గించి, ముందస్తు జాగ్రత్తగా పలికింది. "శ్రీవారూ" అని ప్రారంభించటంతోనే కుదేలైపోయిన ఆ "అమాయకుడు, "జంటగా వ్రాయటం వద్దులే" అన్నందుకు కొంచెం నొచ్చుకున్నా, "జంటగా సుఖ సంసారం" అన్నదానికి పొంగిపోయి ఉత్సాహం తలూపేసాడు. దాంతో మరింత ఉత్సాహమొచ్చి ఇంకో కవితను వదిలేద్దాం అనుకుంది గాని.

"ఇకెంత సేపక్కా మీ మాటలు? సంబంధానికి తొందరగా ఒప్పేసుకో అక్కా?" కిటికీలోంచి చెల్లిమాటలు వినబడి ఆగిపోయింది. "పిచ్చితల్లి నా పెళ్లయితే గాని తనకి సంబంధాలు చూడరని దాని తొందర" అని పద్యంలో కాకుండా సామాన్య గద్యంలో సంజాయిషీ ఇచ్చుకుని బయటికి నడిచింది. కవిత హరిశ్చంద్రుడు విధేయుడిలా అనుసరించాడు. తమవైపు ఆత్రంగా చూస్తున్న అందరివైపు చూస్తూ, కవిత "ఇకమీదే ఆలస్యం అవశ్యం పెట్టించండి ముహూర్తం అని కవితాధోరణి లోనే అందామనుకుంది గాని, "బాగోదులే" అనిపించింది కాబోలు సిగ్గులొలికిస్తూ మూసి ముసిగా నవ్వింది. హరిశ్చంద్రుడూ పున్నమి చంద్రునిలా హాయిగా నవ్వేడు – మధ్యవర్తి శర్మతో సహా అందరూ అనందంగా తలలు పంకించారు.

చూడాలి మరి ఈ జంట కాపరం ఎలా సాగుతుందో, మనమైతే స్పర్థలు లేకుండా ఉండాలనే కోరుకుందాం హాయిగా, ఆనందంగా కలిసి మెలసి ఉండమని చెప్పొచ్చుగాని విడివిడిగా గాని జంటగా గాని కవితలు రాయొద్దని చెప్పడం బాగోదు కదా– వాళ్లకి వాళ్లే తెలుసుకుంటారేమో! మన అదృష్టం బాగుంటే "తవిక"లు రాయటం క్రమగా మానేస్తారేమో.

(రచనాకాలం – 2020)

# తోటి (పోటీ) కోడళ్లు!

పదిహేను రోజుల్లో జరుగబోతున్న మున్సిపాలిటీ ఎన్నికలలో, మూడో వార్డులో నామినేషన్ల ఉపసంహరణ గడువు ముగిసిన తర్వాత, ముక్కోణ పోటీ అనివార్యమైంది. మూడో అభ్యర్థి గురించి ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు గాని, తోటికోడళ్లైన "విమల"–"శ్యామల"ల మధ్య రసవత్తరమైన పోటీ, జరగబోతోందన్నది పట్టణమంతా చర్చనీయాంశమైంది. స్థానిక వార్తాపత్రికకు పతాక శీర్షిక కూడాఅయింది. ఇంతకీ, ఈ విమల శ్యామలలు కేవలం తోటి కోడళ్లు మాత్రమే కాదు, స్వయానా అక్క చెల్లెళ్లు కూడా! పైగా స్వంత అన్నదమ్ములైన రామారావు లక్ష్మణరావులను, ఒకే రోజున ఒకే కళ్యాణ మండపంలో ఒక గంట తేడా ముహూర్తాలలో పెళ్లాడిఒకే ఇంటి కోడళ్లైన వాళ్లు– ఒకే ఇంటిలో నివశిస్తున్నారు కూడా! అందుకే వాళ్ల మధ్యన పోటీ, అంత చర్చనీయాంశమైంది.

నిజానికి విమల, శ్యామలలు అందరు అక్కచెల్లెళ్ల మాదిరిగానే, పెద్దగా గిల్లి'కజ్జాలు' లేకుండానే, తగిన స్థాయిలో పరస్పరం ప్రేమాభిమానాలుండేలా పెరిగిన వాళ్లే! అయినా, అదేమిటోగాని, చిన్నప్పట్నుంచీ వాళ్లిద్దరిలో కూడా, ఒకవిధమైన "పోటీతత్వం", అన్నిటా సహోదరిని అధిగమించాలనే పంతం, పసి వయసు నుండి, దిన దినాభివృద్ధి చెందుతూనే వచ్చేయి! దీనికి ప్రధాన కారణం వాళ్ల అమ్మ, నాన్న, సుమతి, రాజారావులేనని చెప్పాలి! ఒక్క కొడుకైనా కలగలేదు ఇద్దరూ ఆడపిల్లలే పుట్టారని వాళ్లెప్పుడూ బాధపడలేదు గాని, ఉన్న ఆడ సంతానం ఇద్దరూ, అన్ని విషయాల్లోనూ ఉత్తమ స్థాయికి, ఆ మాటకొస్తే ప్రపంచంలో ఇంకెవ్వరూ వీళ్లసాటికి రాలేని, వీళ్ళే ఒకరికొకరు, పోటీ, అని అందరూ అనుకునే స్థితికి చేరుకోవాలని చాలా గట్టిగా కోరుకునేవాళ్లు. అలా జరగాలంటే, తమ సంతానమైన ఈ ఇద్దరి మధ్యన ఒక"ఆరోగ్యకరమైన పోటీ" ఉండాలని అనిపించింది కాబోలు, అక్క చెల్లెళ్ల మధ్య వాళ్ల చిన్నప్పటినుండి ఒక విధమైన పోటీతత్వాన్ని ప్రత్యక్షంగా, పరోక్షంగా పెంచుతూ, వచ్చేరు. ఏ ఒక్కరినీ, ఎక్కువ, తక్కువ చూడడం జరగలేదు గాని. 'అక్కను మించిపోవాలి', అని చెల్లికి 'చెల్లిని అధిగమించాలి', అని అక్కకి సదా నూరిపోసేవారు. అలా కాకుండా "ఫలాన విషయంలో ప్రతిభచూపించి అక్కని

మురిపించాలి, లేదా ఇంకో దాంట్లో చెల్లిని దాటిపోయి అది గర్వించేలా చేయాలి అనే రీతిలో వాళ్లమాటలు, ప్రోత్సాహం ఉంటే, తామాశించిన "ఆరోగ్యకరమైన పోటీతత్వం", అక్క చెల్లెళ్ల మధ్యన నెలకొనేదేమోగాని, అలాంటి లౌక్యం తెలివితేటలు ఆ తల్లితండ్రులలో లోపించాయి. ఫలితంగా, తమకు తెలియకుండానే, అక్క చెల్లెళ్ల మధ్యన పైకి  కనిపించని, ఈర్ష్యా ద్వేషాలకు కారకులయ్యారు!

ఎంత ఏకగర్భజనితుల్కైనా, అక్క చెల్లెళ్లమధ్య రూపలావణ్యాలలో, సహజనైపుణ్యాల్లో, స్వభావాల్లో, అభిరుచుల్లో, కొద్దో గొప్పో, వ్యత్యాసాలుండక పోతాయా? విమలది చాలా మంచి రంగు, నాజూకైన శరీరం, కొంచెం ముక్తసరి స్వభావమైతే, శ్యామలది చామన ఛాయ, కొంచెం బొద్దు  ఆకారం, గలగలా మాట్లాడే స్వభావం – పెద్ద పెద్ద కళ్లతో చాలా ఆకర్షణీయంగా కూడా ఉంటుంది. మరి, చిన్నప్పుడే, అక్క విమల నాట్యశాస్త్రంలో ఎక్కువ ప్రతిభ చూపుతోందని, శ్యామల చదువుల్లో మేటినని రుజువు చేసుకుంటోందని గమనించిన, తల్లితండ్రులు, ఇద్దరినీ తగు విధంగా ప్రశంసించి, వాళ్లు రాణిస్తున్న రంగాల్లోమరింత కృషి చేయమని ప్రోత్సహించి ఉంటే బాగుండేది. ఇద్దరూ  ఒకరిపై ఒకరికి మాత్సర్యం లేకుండా, తమకిష్టమైన, రంగాల్లో రాణించేవారు.  కాని "చెల్లికన్న నీకెందుకు, తక్కువ మార్కులొస్తున్నాయి? అశ్రద్ధ తగ్గించు", అని విమలని, "ఏం నీకెందుకు నాట్యం సరిగా రావటంలేదు? ఇద్దరికీ ఒకే డ్యాన్సు మాస్టారినే పెట్టినా" – అని శ్యామలని గదమాయించేవాళ్లు. 'ఇద్దరూ మనకు సమానమే. కాబట్టి ఇద్దరిలో అన్నిటా సమాన ప్రతిభ ఉండాలి అన్నదే వాళ్ల సదుద్దేశం. తమధోరణి అక్కచెల్లెళ్ల మధ్యన ఉండకూడని అసూయద్వేషాల్ని రగిలిస్తోందేమోనన్న అనుమానం వాళ్లకెప్పుడూ కలగలేదు. అక్క చెల్లెళ్లు కూడా, తల్లితండ్రులతో కూడా ఎప్పుడూ పంచుకోలేదు. ఒకరి పట్ల ఇంకొకరికి ఉన్న కొంత ప్రతికూల భావాలు బహుశ: అక్క చెల్లెళ్లకి కూడా స్పష్టంగా  తెలియవేమో కూడా? ఏమైతేనేం, పెళ్లయ్యే వరకు, ఒకరితో ఒకరు పెద్దగా  దెబ్బలాడుకోలేదు. అలాగని, ఒకరంటే ఒకరు పడిచచ్చిపోలేదు. మొత్తానికి తల్లితండ్రులతో సహా బయటి ప్రపంచానికి, అక్క చెల్లెళ్ల మధ్యన అంతకంతకీ పెరుగుతూ వస్తున్న దూరం వ్యత్యాసాల భారం, తెలియకుండానే ఉండిపోయింది. ఒకవేళ పెళ్లిళ్లయిన తర్వాత, వేర్వేరు ఊళ్లకి, వేర్వేరు కుటుంబాలని చేరుకుని ఉంటే, ఆదూరం, భారాలు క్రమంగా

తగ్గటానికి అవకాశముండేదేమో గాని, తమ కూతుళ్లు ఒకే కుటుంబంలో కలిసి మెలిసి ఉండాలన్న సత్సంకల్పంతో సుమతి, రాజారావు దంపతులు, ఏరి కోరి పక్క పట్టణంలోనే ఉండే అపూర్వ సహోదరులుగా పేరొందిన, రామారావు, లక్ష్మణరావులను తమ అల్లుళ్లుగా చేసుకున్నారు. ఇద్దరికీ సమంగానే కట్న కానుకలర్పించి ఈ సంబంధాలు కుదిర్చిన వాళ్లకి కనిపించిన మరో అదనపు ఆకర్షణ ఏమంటే, రామారావు లక్ష్మణరావుల తల్లితండ్రులు ఇటీవలనే చనిపోవటం, వాళ్లకి ఒక్క కూతురైనా లేకపోవటం, ఆవిధంగా అత్తామామల దాష్టీకం గాని, ఆడపడుచు పోరుగాని తమ కూతుళ్లకు ఉండకపోవటం! ఇకపోతే, విమల శ్యామలలు కూడా ఎప్పటిలానే తల్లితండ్రుల నిర్ణయానికి తలొగ్గటానికి కారణం, పెళ్లిచూపులకి వచ్చిన సోదరులు, రామారావు లక్ష్మణరావులు, తమకు కూడా నచ్చటమే!

ఇంకేముంది, అక్క చెల్లెళ్ల పెళ్లిళ్ళు ఒకే రోజున ఒకే కళ్యాణ మండపంలో వైభవంగా జరిగిపోయాయి! ఇద్దరూ తోడికోడళ్లైపోయేరు! ఒకేరోజున అత్తవారింటికి, అదేలెండి, అత్తమామలు లేని, తమ భర్తల ఉమ్మడి ఇంటికి కాపురానికి వచ్చేరు. కోడళ్ళిద్దరు లక్షణంగా ఉన్నారని' ఇరుగు పొరుగులు వ్యాఖ్యానించటం ఇద్దరికీ బాగానే అనిపించింది. అయితే, సాంప్రదాయాన్ననుసరించి కాబోలు, అత్తింటి గడపదాటే అవకాశం ముందుగా అక్కకే కల్పించబడటం, చెల్లి శ్యామలకు అంతగా నచ్చలేదు. కాని పైకేమీ అనలేదు గాని "పాడు ఆచారాలు" అని మనసులోనే మూలిగింది. భర్త పేరు చెప్పమని అమ్మలక్కలు అడిగినప్పుడు, సిగ్గుగా మౌనంగా ఉండిపోయిన పెద్ద తోటికోడలు విమలకి, వాళ్ళు అడగకముందే, శ్యామల తన భర్త పేరు చెప్పి ఊరుకోకుండా, "మా బావగారి పేరు రామారావు" అని కూడావాగేసి, అందర్నీ నవ్వించటం, నచ్చలేదు. బాగా వళ్లుమండినా పైకేమీ అనలేకపోయింది. ఒకే ఇంట్లోకి కాపురానికి రావటం ఇద్దరికీ నచ్చలేదు. కాని దూరదృష్టితో, మామగారు గతంలోనే కట్టించిన ఆ ఇంటికి ముఖద్వారం ఒకటే అయినా, వేర్వేరుగా విశాలమైన పడకగదులు రెండు వంటిళ్లుఉండటం 'ఇద్దరికీబాగా నచ్చింది. ఒకే ఇంట్లోనైనా, ఎవరి వంట వాళ్లు చేసుకోవాలన్న నిర్ణయానికి వచ్చేశారు.

ఎందుకనో "మొగుళ్లు", కూడా అందుకు అభ్యంతరం చెప్పలేదు. అదే మంచిదయింది. ప్రతీ పూటా వండిన కూరలు ఇచ్చి పుచ్చు కోవడాలుండటం

మూలాన, వాళ్లకి ఇల్లాలు వండిన రెండు కూరలు, ఆవిడి తోటికోడలు చేసిన మరో రెండు కూరలు, వెరసి నాలుగు రకాల కూరలు తమకంచాల్లోకి వస్తోంటే, బాగానే ఉంటోంది. 'ఇంటి కూర', పొరుగింటి పుల్లని కూర', రెండూ బాగానే ఉంటూండడంతో లొట్టలు వేసుకుని తినే భాగ్యం వాళ్లకి కలుగుతోంది. తోటి కోడళ్లిద్దరూ పోటా పోటీగా రకరకాల వంటలు చేస్తున్నారు. పక్కింటి కూరల్ని మెచ్చుకుంటున్న మొగుళ్లను మొట్టాలనిపించినా, 'కొత్త మొగుళ్ళ కదా ఇప్పుడే మొట్టడం బాగోదేమోననిపించి' నిగ్రహించుకుంటున్నారు. అంతర్గతంగా తమలో ఎన్నిలుకలుకలున్నా, అవి తమ మొగుళ్లతో సహా, ఇరుగు పొరుగులకు కూడా అంతు చిక్కకుండా, తోటి కోడళ్లిద్దరూ అన్నిజాగ్రత్తలూ తీసుకున్నారు. కాదంటే, ఎవరికి వాళ్లుమొగుళ్లని క్రమంగా తమ ఆధీనంలోకి తీసుకొచ్చే సకల ప్రయత్నాలూ చేయటంలో, కుటుంబ పరిస్థితులని బాగా ఆకళింపు చేసుకోవటంలో బాగా నిమగ్నమైపోయారే గాని, పరస్పరం దెబ్బలాడుకోలేదు. ఒకనెల గడిచిందో లేదో సహజంగా మాటకారైన శ్యామల ఓ రాత్రి సరససల్లాపాల సమయంలో, మొగుడిని అకస్మాత్తుగా అడిగింది. "ఔనూ, మీ అన్నయ్యకు మీకు వయసులో వ్యత్యాసమెంత? "ఆ! రెండేళ్లలోపే" ఎందు కడిగిందో అర్థం కాకపోయినా మామూలుగా చెప్పేడు లక్ష్మణరావు.

"మరి మిమ్మల్ని అరేయ్! ఒరేయ్" అనే పిలుస్తారాయన – మరి మీరేమో, "అన్నయ్యా" అని ఎంతో మర్యాదగా సాగదీస్తారు? నేనైతే మా అక్కని "ఏమేవ్" అనే పిలుస్తాను, మీకు తెలుసుగదా? ఇదేమంత పెద్ద విషయం కాదనుకోండికాని ఆయన పిలుపులో ఆధిపత్య అహంకారం కనపడుతోంది. అదలా ఉంచండి. మీరేమో వారంలో పదిరోజులు ఉమ్మడి వ్యాపారం పనుల్లో తిరుగుతూంటారు. మన కిరాణా దుకాణంలో అమ్మేబియ్యం, పప్పులు, ఇతర సరుకులు రైతుల నుండి నేరుగా చౌకగా కొనడానికి ఆయనేమో, ఇల్లు కదలకుండా ఉంటారు. దుకాణంలో గల్లాపెట్టి ముందు కూర్చుని అమ్మకాలు నిర్వహిస్తూ ఉంటారు. అమ్మకాల్లో ఎంతెంత లాభాలొస్తున్నాయో మీరూ అడగరు, ఆయనా చెప్పరు. బ్యాంకు లావాదేవీలన్నీ ఆయనొక్కరి సంతకం మీదే జరిగిపోతుంటాయి. ఇంట్లో, వీధిలో, దుకాణంలో పెత్తనమంతా ఆయనదే. ఊరూరా తిరిగే 'బండచాకిరీ' మీది! మీకుచాలా అన్యాయం

జరిగిపోతుందన్నది మాత్రమే నా బాధ అనుకోవద్దు. మీ అన్నయ్య వదినలకు రోజూ వసంతరాత్రే! వారంలో ఆరురోజులు ఊరూరా వ్యాపారం పనిమీదతిరిగే మీరు నాతో గడపగల్గేది ఒకోసారి పదిరోజులలో ఒకరాత్రి పూట మాత్రమే. ఈ విరహాన్నీ నేను తట్టుకోలేక పోతున్నానని మీరెప్పుడు అర్థం చేసుకుంటారు?" అంటూ మెత్తగా తగులుతూ గట్టిగా కౌగిలించుకుని గట్టిగా ఏడ్చేసింది.

లక్ష్మణరావు ఢంగైపోయేడు. ఇన్నిరోజులూ రాని కొత్త ఆలోచనలు, భావాలు మదిలో మెదలటం ప్రారంభమయ్యాయి. "నిజమే అన్నయ్యే పెత్తనం చేస్తున్నాడు–. సుఖపడుతున్నాడు, నేనేమో ఊరూరాతిరిగి, బండ చాకిరీ చేస్తూంటే సరుకులు రైతుల నుండి నేరుగా గాని, ఇతర వ్యాపారుల నుండి గాని కొంటుంటే, ఆ వివరాలన్నీ పైసా పైసాతో సహా లెక్క చెప్పమంటాడు. తను మాత్రం అమ్మకాల, లాభాల వివరాలు చెప్పడు. తను సొంత ఖర్చులకి కూడా అన్నయ్యనే అడుక్కోవాలి. ఇంటిదగ్గర నుంచి దగ్గర్లోనే ఉన్న దుకాణానికి అతను మోటారు సైకిలు మీదవెళ్తాడు. నేనైతే అన్ని ఊళ్లూ బస్సుల్లోనే తిరగాలి. ఏ ఊళ్లోనైనా రాత్రుళ్లలో ఉండిపోవాల్సి వస్తే ఖర్చులేకుండా లేదా తక్కువ ఖర్చుతో సత్రాలలో ఉండమంటాడు. వ్యాపార వ్యవహారాలు, అన్నీనేనే చూసుకుంటాను లేరా? నీకెందుకులే చిన్నవాడివి అనే మాట నిజమే ఇలా ఎన్నాళ్లు సాగాలి? పనుల్లో హక్కుల్లో సమవిభజన లేకుండా? శ్యామల అన్నదీ నిజమే తనతో ఎక్కువ సమయం గడపలేకపోతున్నాను. ఒక్కోసారి వారం పదిరోజులకో పూట కూడా ఇంట్లో ఉండలేక పోతున్నాను ఎన్నాళ్లిలా?"

వెంటనే పైకేమీ అనకపోయినా లక్ష్మణరావులో అంతర్మధనం ప్రారంభమైంది! పెద్ద తోటికోడలు కూడా తన వంతు పాత్ర పోషించింది. "తమ్ముడు రైతులకు అడ్వాన్సులిచ్చానని చెప్పిన సొమ్ములకు సరైన లెక్కలు చెప్పటం లేదేమో, కొంత మంది సొమ్ములు తీసుకుని కూడా సరుకులీయటం, ఎగ్గొట్టారని అబద్ధాలు చెబుతున్నాడేమో, మీరు సరిగా "అజ్మాయిషీ" చేయటం లేదు" అని పదే పదే అనసాగింది. దుర్భిక్ష పరిస్థితుల మూలంగా కొంత మంది అడ్వాన్సులు తీసుకున్న రైతులు సరుకులు ఇవ్వలేకపోయిన సందర్భాలు ఈ మధ్యకాలంలో కొంచెం ఎక్కువగానే జరిగిన మాట వాస్తవం. అందుకే అన్న మనసులో అనుమాన బీజాలు

మొలకెత్తసాగేయి, భార్యమాటలతో.

ఇంతలో ఒక 'దుస్సంఘటన' జరిగింది. అల్లుళ్లిద్దరిని మొదటి పెద్ద పండుగకు ఆహ్వానిద్దామని స్కూటరుపై బయలు దేరిన అత్తమామగార్లిద్దరు, ఏదో ఒక ట్రక్కుని ఢీకొని దుర్మరణం పాలయ్యారు. తల్లీతండ్రులను ఒక్కసారే కోల్పోయిన అక్కచెల్లెళ్లు ఒకరినొకరు కౌగిలించుకుని చాలా విలపించేరు పరస్పరం స్పర్థలు పెంచుకుంటున్న వాళ్లని కొంతైనా దారిలో పెట్టగలిగే సామర్థ్యం ఉన్న వాళ్లుఈ లోకాన్ని విడిచి పోయారు. దాంతో తల్లిదండ్రుల మరణం తర్వాత విమల శ్యామలలకు మంచీ చెడూ చెప్పేవారు లేకపోయారు. మొగుళ్లైతే అప్పటికే 'దూడూ బసవన్నల్కె"పోయారు గదా. దుష్పరిణామాలు చాలా వేగంగా సంభవించాయి. తోటికోడళ్ల పుణ్యాన! అన్నదమ్ములలో అభిమానాలు తగ్గకపోయినా, అనుమానాలు, పెరిగిపోయాయి. అంబానీ సోదరులు విడిపోలేదా. ఆంధ్ర తెలంగాణాలు వేర్వేరు రాష్ట్రాలైపోవడం లేదా? మనం కూడా వేర్వేరు కుటుంబాలైతే మిన్ను మీదపడి పోతుందా? "ఈ మాదిరి భార్యల ప్రశ్నలను ఎంతో కాలం ప్రతిఘటించలేకపోయారు. బంధువుల సాయంతో ఆస్తి పాస్తులన్ని సామరస్యంగానే పంచుకున్నారు. ఇకపోతే కిరాణా దుకాణాన్ని అన్నకే వదిలేసి అందుకు ప్రతిఫలంగా ఒకలక్షరూపాయలు నగదు తమ్ముడు అదనంగా తీసుకుని వేరే వ్యాపారం చేసుకోవాలని నిర్ణయించబడింది. ఇంటిని మాత్రం ఇద్దరూ సమంగా పంచుకున్నారు. కాదంటే మధ్యలో ఒకగోడ లేచింది. విశాలమైన వేర్వేరు పడక గదులు,వంటిళ్ళు ఉన్నందున ఎవరికి ఇబ్బంది లేదు.

పెద్ద కోడలు, ఇంటి విభజన జరిగిన వెంటనే, ఒక డ్యాన్స్ స్కూల్ ప్రారంభించి, బాగానే సొమ్ములు సంపాదించసాగింది. శ్యామల కుట్టుమిషన్ల కేంద్రం ఇంట్లోనే నిర్వహిస్తూ తనూ సంపాదనపరురాలైంది. పదోతరగతి పిల్లలకు ట్యూషన్లూచెప్పి మరికొంత సంపాదించటం ప్రారంభించింది. అక్క "డ్వాక్రా సంఘానికి" అధ్యక్షురాలై మహిళా సేవ చేస్తూండటం చూసి, చెల్లిచిట్టీలు నిర్వహించటం ప్రారంభించింది. చెల్లి కిట్టీ పార్టీల నిర్వహిస్తూ ప్రముఖురాలై పోతూండటం చూసి, అక్క విమల సత్సంగాలు, ఆధ్యాత్మిక కార్యక్రమాలలో

పాల్గొనసాగింది. నేను తక్కువ తిన్నానా అనే రీతిలో శ్యామల పట్టణంలో భిన్న సామాజిక కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటోంది. మొత్తానికి సంవత్సరం తిరక్కుండానే, అక్కా చెల్లెల్లిద్దరు, పట్టణంలో ప్రముఖులై పోయారు. –ఇప్పుడు రామారావుని విమల భర్తగానే, అతని తమ్ముడు లక్ష్మణరావుని శ్యామల పతిగా మాత్రమే పట్టణ ప్రజలు గుర్తిస్తున్నారు!!

ఈ సంవత్సరం కాలంలోనే, రామారావు “నిర్వహణా సామర్ధ్యలోపం” కారణంగా, కిరాణా దుకాణంలో బాగా నష్టాలు పాలయ్యాడు. కొత్తగా ఎరువులు, పురుగు మందుల దుకాణం పెట్టిన లక్ష్మణరావు కూడా వ్యాపారంలో రాణించలేదు. అప్పుల పాలయ్యాడు. ఇద్దరి సంసారాలు, భార్యల సంపాదనలతోనే నడుస్తున్నందున, పూర్తిగా వాళ్ల ఏమాటకీ చర్యకీ ఎదురుచెప్పలేని అశక్తులైపోయారు. “విడిపోయి, సోదరుడిని కష్టాలపాలు చేశానే” అన్న అపరాధభావం రామారావు, లక్ష్మణరావులలో కలిగి, ఒకరితో ఒకరు మాట్లాడుకోలేని దుస్థితి కలిగింది. అయితే, తోటికోడళ్లిద్దరూ, రోజూ సాయంత్రం, అసలేమీ, జరగనట్లుగా, ఇద్దరి నివాసాల మధ్యన వెలిసినగోడకి అటూ ఇటూ చేరుకుని, ముచ్చట్లాడుకోవటం, గతంలోలానే, కూరలు, తిను బండారాలు ఇచ్చిపుచ్చుకోవడాలు కొనసాగటం చూస్తూ కొంత ఉపశమనం చెందుతూ ఉన్నారు. రామారావుకి మరదలు శామలంటే అభిమానం, లక్ష్మణరావుకి వదిన విమలంటే గౌరవం గతంలోలానే ఉండిపోయాయి. “విడిపోయినా, అన్యోన్యంగా ఉంటున్నారు, ఎంతైనా స్వయానా అక్కచెల్లెళ్లు కదా” అనుకునేవారేగాని, ఈ పెళ్లాలవల్లనే కదా, రామలక్ష్మణుల వంటి మా సోదరులిరువురం విడిపోయాం, చెడిపోయాం అని ఎప్పుడూ అనుకోలేని అమాయకులు వాళ్లు– ఒకరినొకరు అధిగమించాలన్న తాపత్రయం పంతమే గాని, విమల శ్యామల మధ్యన కూడా అక్కచెల్లెళ్ల ‘మధ్య సహజంగా ఉండే ప్రేమానురాగాలు సంపూర్ణంగా లోపించి పోయాయని చెప్పలేం. అదేకదా రక్త సంబంధం యొక్క గొప్పదనం. పరిస్థితులు, ఇలానే కొనసాగిపోతే బాగుండేది గాని, మున్సిపల్ ఎన్నికలొచ్చి కొంపముంచేయి. మూడోవార్డులో పోటీకి అక్క అప్పటికే ఒకపార్టీ తరపున నామినేషన్ వేసిందని తెలియక చెల్లి ఇంకోపార్టీ తరపున తనూ వేసింది. ‘ఏం సోదరికోసం తనే తప్పుకోవచ్చుకదా’, అన్నపట్టుదల ఇద్దరిలోనూ కలిగింది. మెతకమొగుళ్ళు మౌనంగా

ఉండిపోయేరు. 'ఎవరు గొప్పో తేల్చుకోవడానికి ఇదే మంచి అవకాశం ఎన్నికలై పోయాక కలిసే ఉండొచ్చులే', అని చెప్పే వాళ్ళేగాని, "మీ మధ్యపోటీ తప్పని చెప్పిన వాళ్లులేరు, ఎవరైనా అలా చెప్పినా వినేవాళ్లు కాదేమో కూడా! ఏమైతేనేం, స్వయానా అక్క చెల్లెళ్లైన తోటి కోడళ్లమధ్యన పోటీ అనివార్యమైంది.

పోటీ రసవత్తరంగా మాత్రమే గాదు 'ధనవత్తరంగా' కూడా జరిగింది. అభ్యర్థినులిద్దరికి చాలా ఖర్చయింది. మొగుళ్లదగ్గర ఏమైనా డబ్బులుంటే గదా తీసుకోవటానికి? తమ నగల్ని పసుపు కుంకుమలుగా వచ్చిన భూముల్ని తనఖాలు పెట్టి ఎన్నికల ఖర్చుకి భారీగా వాళ్లే సమకూర్చుకున్నారు. ఏమీ దాచుకోకుండా ధారాళంగా ఖర్చుపెట్టేశారు.

ఎన్నికలైన మర్నాడే ఓట్లలెక్కింపు ప్రక్రియ చేపట్టబడిరది. పట్టణ ప్రజలలో అధిక సంఖ్యాకులు మూడో వార్డుకు సంబంధించిన లెక్కింపు కేంద్రం వద్దనే గుమిగూడేరు. అధికారులు ప్రకటించిన ఫలితం అందరూ ఆశ్చర్యపోయేలా ఉంది! ఎందుకంటే, సోదరీమణులిద్దరికీ సరిసమానంగా ఓట్లు వచ్చేయి. "స్వతంత్రునిగా పోటీ చేసిన మూడో అభ్యర్థి ఒక విశ్రాంత ఉపాధ్యాయుడు, "విశ్వనాథం గారే భారీ ఆధిక్యతతో గెలిచేరు," అని అధికారులు ప్రకటించినా, అభ్యర్థినులిద్దరు, వాళ్ల భర్తలు, ఇంకా చాలామంది పట్టుబట్టడంతో విమల, శ్యామలలకు వచ్చిన ఓట్లును మళ్లీ మళ్లీ లెక్కించారు. అయినా అదే ఫలితం. ఇద్దరికీ సమానంగానే వచ్చేయి! అప్పుడు లక్ష్మణరావు బాధపడ్డాడు. "నేను వదినకు కాకుండా తనకు ఓటేసి ఉంటే పాపం పిచ్చిది నా పెళ్లానికే రెండు ఓట్లు అక్క కన్న ఎక్కువొచ్చాయన్న సంతృప్తి ఉండేదిగదా. ఎలక్షన్లో ఓడిపోయినా" అని రామారావు కూడా అదే విధంగా 'నా ఓటు మరదలికి కాకుండా విమలకే వేసుండాల్సిందేమోనని' అనుకున్నాడు. కాని వీళ్లిద్దరికీ తెలియని విషయం మరోటుంది. తమపెళ్లాలు కూడా ఎవరి ఓటు వారికే వేసుకోకుండా, సోదరి ప్రేమను తమ రహస్య ఓటింగులో చూపుకున్నారని. మొత్తానికి ఉభయ దంపతులకి జ్ఞానోదయం అయింది! కలిసి ఉంటే కలదు సుఖం విడిపోతే వినాశనం" అన్నతత్వం తొందరగానే బోధపడింది. ఒకరోజున శ్యామలే చొరవచూపింది. ఓరోజు సాయంత్రం భర్తతో సహా

బావగారున్నప్పుడు అక్క ఇంటికి వచ్చింది. బావగారి కాళ్లకి నమస్కరించి, అక్కని పట్టుకుని ఏం మాట్లాడకుండా గట్టిగా ఏడ్చేసింది. విమల వెంటనే చెల్లిని గట్టిగా కౌగిలించుకుని "ఊర్కోవే! నీకన్న నేనే ఎక్కువ తప్పులు చేశాను. మన భర్తలిద్దరూ చాలా మంచివాళ్లు. మనిద్దరం కలిసిపోయి వాళ్లనీ కలిపేయటమే మన తక్షణ కర్తవ్యం. అంటూ చెల్లిబుగ్గలు ప్రేమగానిమిరింది. ఇదంతా విన్న మొగుళ్లిద్దరూ వెంటనే ఒకరినొకరు కౌగిలించుకోవటం చూసి ఆనందభాష్పాలు రాల్చేరు. విమల శ్యామలలు.

తర్వాత సోదరులిద్దరి, సంయుక్త నిర్వహణలో ఉమ్మడి వ్యాపారాలు బాగుపడ్డాయి. సోదరీమణులిద్దరూ కూడా పరస్పరం పోటీపడకుండా, ఎవరి రంగాల్లో వాళ్లు రాణిస్తూ విరాజిల్లేరు.

(రచనా కాలం – 2008)

# శోభ శోభనం

కొన్ని గంటల క్రితమే, ఉదయం ముహూర్తంలో, హిందూ ధర్మశాస్త్ర బద్ధంగా, మంత్రోచ్ఛాటనల మధ్య, వందలాది బంధుమిత్రుల సమక్షంలో, పట్టణంలోని ఒకప్రముఖ వివాహమందిరంలో అట్టహాసంగా జరిగిన పెళ్లి వేడుకలో మూడు ముళ్లువేసి "ధర్మపత్ని"గా చేసుకున్న శోభకోసం ఎదురుచూస్తూ కూర్చుని ఉన్నాడు ఒంటరిగా "ఆ గది"లో, పేరుకి తగ్గట్టుగా ఉండే సుందర్. అతని కది "తొలిరాత్రే" గాని, "ఆగది", పూల పందిరి మంచం, దాని పక్కన రకరకాల మధుర ఫలాలు, పలహారాలు, ఏర్పాటు చేయబడి, లోపలా బయటా, అమ్మలక్కలు ముదివయసు ముత్తయిదువుల కోలాహలంతో ముసలి పురోహితుడి చికాకు పరిచే ఆర్భాటాలతో, నిండి ఉన్న అత్తవారింట్లోని "శోభనం గది" కాదు, ఆధునిక భావాల వధూవరుల అభిరుచుల కనుగుణంగా ఉండాలన్న సదుద్దేశంతో, మామగారు 'చక్రపాణి' మూడు నక్షత్రాల హొటల్‌లో బుక్‌చేసిన సూట్.

మొదటి రాత్రి కోసం అని ప్రత్యేకంగా చెప్పనందువలన, హొటల్ యాజమాన్యం వాళ్లు ప్రత్యేకమైన అలంకరణలు, ఏర్పాటు చేయలేదు. కాదంటే, వాళ్ల ప్రమాణాలకు "టారిఫ్‌కి" తగినట్లుగా, ఆ సూట్‌లో విశాలమైన ఫోమ్ బెడ్, సోఫాకమ్‌బెడ్, ఏసీ, కాఫీ మిషన్, ఫ్రిజ్ వగైరాలన్నీ, బాగానే ఉన్నాయి. గదంతా పరికించి చూస్తూ "ఇద్దరు 'విడిగా', సుఖంగా నిద్రపోవడానికి ఏర్పాట్లు బాగానే ఉన్నాయిలే దాంపత్య సుఖం ఎలానూ ఉండదు కదా" అని నిర్వేదంగా అనుకున్నాడు. పాల గ్లాసుతో వచ్చే భార్యను మురిపాలతో, సరససల్లాపాలతో ముంచెత్తి ఆపైన దాంపత్య సుఖాన్ని అందించడానికి ఉవ్విళ్లూరుతూ ఉండాల్సిన సమయంలో, ఆవిడసలు రాకుండాఉంటే బాగుంటుందని "సుందర్", లోలోపల కోరుకుంటూ ఉండటానికి కారణం తెలియాలంటే, కొన్నిరోజులు వెనక్కి వెళ్లాలి.

శోభ తండ్రి "చక్రపాణి" ఇంట్లో ఇరవై రోజుల క్రితం, ఓ సాయంత్రం జరిగిన పెళ్లిచూపుల తతంగం దాదాపు సమాప్తమైంది. జాతకాలు కుదిరేయి. ఇచ్చిపుచ్చుకునే వ్యవహారాలు పెద్దగా బేరసారాలు లేకుండా నిర్ధారణయ్యాయి. సుందర్ రూపం, ప్రవర్తన, చదువు, ఉద్యోగం, వధువు తరపు వాళ్లకి పిచ్చిగానే

నచ్చేశాయి.సుందర్‌కి, తొలిచూపులోనే 'బాపు బొమ్మ', అపరంజి భామలా ఉన్న శోభఎంత నచ్చేసిందంటే – 'ఈ అమ్మాయిని పెళ్లిచేసుకోకపోతే నా జన్మ వ్యర్థం అని నిశ్చయించుకునేంతగా! అందుకే, మధ్యవర్తి "బాబూ, సుందర్, నీకీఅమ్మాయిని చేసుకోవటం ఇష్టమేనా అని అడిగిందే ఆలస్యంగా "ఓ చాలా ఇష్టం అని ఉత్సాహంగా చెప్పేశాడు ఏవిధమైన బెట్టు లేకుండా. అయితే, అలా అనేసి ఊరుకోకుండా, "తనని కూడా అడిగితే బాగుంటుంది" అని నసిగేడు. ఆ అవకాశం కోసమే ఎదురుచూస్తోందో ఏమోగాని, శోభవెంటనే అంది, స్థిరమైన సుస్వరంతో – నేను "ఆయన"తో మాట్లాడాలి" అని. "ఆయన" అని తను అన్న పదంలో "నా కాబోయే ఆయన" అన్న అర్థం స్ఫురించి అక్కడున్న వారందరి ముఖాల్లో చిరునవ్వులు చిందాయి, సుందర్‌తో సహా సుందర్‌కైతే ఏనుగెక్కినంత సంబరం కలిగింది. పెళ్లిచూపుల తతంగంలో ఆమెతో పెద్దగా మాట్లాడిందేలేదు. తనూ పెద్దవాళ్లు అడిగిన వాటికి ప్రసన్న వదనంతోనే వినయంగానే ముక్తసరిగా మాట్లాడిందంతే 'కాబోయే భార్యతో ఏకాంతంగా మాట్లాడే అవకాశం రావటం ఎంత అదృష్టం' అని మురిసిపోయేడు. డాబాపైకి దారి తీసిన శోభను ఉత్సాహంగా అనుసరించేడు.

"నా తల్లితండ్రుల కోసమైనా మిమ్మల్ని పెళ్లాడుతాను. కాని.... కాని... –"పెళ్లి చేసుకుంటానంటే చాలు–దానికి మీరెన్ని కండిషన్లు పెట్టినా నాకు సమ్మతమే–" పరమోత్సాహంతో అనేశాడు సుందర్. బెరుకుగాచూస్తూ మౌనంగా ఉండిపోయిన శోభను ఆప్యాయంగా చూస్తూ– "చెప్పండి.... పోనీ నేనే ఊహిస్తా.......ఉద్యోగం మానేయమని అడగకూడదు– సరే–"అబ్బే అదేం కాదండీ– మానేయమంటే మానేస్తా చేయమంటే చేస్తా".

"ఓహో అత్తమామలతో కలిసి ఉండటం ఇష్టం ఉండదా? – సరే మా వాళ్లు ఎలాగూ పల్లెటూరు వదిలిరారు. ఇప్పటికే నేను ఈ పట్టణంలో కొన్న ఫ్లాట్‌లో చిలకా గోరింకల్లా...

"ఛ – ఈ వయసులో వాళ్లని ఎక్కడో ఉండండనటం మహాపాపం–' ఏంటది ప్రతీదానికి ఏంటో చెప్తోంది అని విస్తుపోతూనే అన్నాడు సుందర్ "మరింకేంటి?.... సరే ఇల్లరికం రమ్మన్నా నాకు ఓకే – " అని ఇంకా ఏదో అనబోతున్న సుందర్,

శోభ చిరాకుగా తల అడ్డంగా పటం గమనించి కాసేపాలోచించి మళ్లీ అన్నాడు. “ఓ అర్థమైంది మీ నాన్నగారు ఇవ్వ జూపుతున్న కట్నకానుకలు వద్దంటాను. నాకు నువ్వే ఓ పెద్ద కానుక గొప్పవరం. ఈ సారి అసంకల్పితంగా ఏకవచనం లోనికి దిగిపోయేడు ‘నేను ఒక్కతే కూతుర్ని మీరు కావాలన్నా వద్దన్నా ఆస్తి అంతా నాకే వస్తుంది. పెళ్లి సమయంలో ముచ్చట కొద్దీ ఏదో కాస్త ఇస్తోంటే వద్దంటే మానాన్న వాళ్లూ బాధపడరూ” – అని ఆరిందాలా సాగదీసేసరికి ఇంకే పాలుబోక, బుర్ర గోక్కుంటూ ఉండిపోయాడు. ఆ ‘గోకుడికి’ లైటు వెలిగింది బుర్రలో “వంటనేనే చేయాలా సరే కష్టపడి మా అమ్మదగ్గర పెళ్లయ్యేలోపే నేర్చేసుకుంటాను.” బేలగా అంటున్న ఈ మాటలకి శోభ నవ్వాపుకోలేక పోయింది.

“ఛీ! నాకుబాగా వంట వచ్చు. ఇంటి పనులూ వచ్చు మగవాళ్ళు ఆ పనులు చేస్తే మాకే “గౌరవభంగం” అదీకాదు సుందర్” ఇంకా గట్టిగా బుర్ర గోక్కుని, గుండెలనిండా గాలి పీల్చుకుని “ఒకవేళ పిల్లలు కనటం ఇష్టం లేదంటే అదీ నాకు సమ్మతమే” అనేశాడు. “కొంచెం దార్లోకి వచ్చావు మహానుభావా” అన్నట్లుచూసి, కాసేపాగి శోభమెల్లగా నసిగింది.... “అంటే.... అంటే... మీరు.... మీరు నన్ను ముట్టు కోకూడదు... అంటే మన మధ్య... శృంగారం... అదే శారీరక సంబంధం – ఉండనే ఉండదు...” అస్పష్టంగా, తడబడుతూ శోభ చెప్పిన మాటల కర్థం సుందర్‌కి బాగానే తెలిసి నిర్విణ్ణుడైపోయాడు – ఈ సారి ఇంకా స్పష్టంగా చెప్పింది శోభ– “సెక్స్ ఉండని సంసారానికి మీరెందుకు ఒప్పుకోవాలి? నా మనసు మారుతుందని మాత్రం అనుకోవద్దు. మీ అమ్మాయి నాకు నచ్చలేదని చెప్పేసి, వెళ్లిపోయి హాయిగా ఇంకో అమ్మాయిని చేసుకోండి. నాకండిషన్ గురించి మాత్రం ఎవరికీ చెప్పొద్దు. ప్లీజ్ బై. “అంటూ గిరుక్కున తిరిగి కిందికి వెళ్లిపోయింది శోభ!!

తొలిచూపులోనే తన మనసు దోచేసిన శోభమాటల్ని మననం చేసుకుంటూ కాసేపు డాబా పైనే ఉండిపోయిన సుందర్‌కి ‘లా’ కూడా చదువుకున్నందున సంబంధిత చట్టాల గురించి కొంత అవగాహన ఉంది. కట్టుకున్న భార్యతోనైనా నిర్బంధ శృంగారం, శారీరక సంపర్కం చట్ట సమ్మతం కాదని కోర్టుల తీర్పులున్నాయనీ తెలుసు. పైగా అతను సహజ స్వభావరీత్యా కూడా

సంస్కారవంతుడు. కారణం ఏదైనాకానీ, ఏ పురుషునితోనూ శారీరకసంపర్కం పెట్టుకోరాదన్నది శోభ స్థిరమైన నిర్ణయమని, అందులో మార్పు వచ్చే అవకాశం వీశమైనా లేదని కూడాఅతనికి అర్థమైంది. 'సెక్స్‌లేని సంసారానికి ఎలా ఒప్పుకోవాలి', అని తెగ మధనపడిపోయేడు.

అయితే కాసేపటికి కిందికి వచ్చి "త్వరలో ముహూర్తం పెట్టించేయండి మామగారూ" అని చక్రపాణికి వరసకలిపి చెప్పేశాడు!!!

ఆయన ముహూర్తం పెట్టించేశాడు – ఇరవై రోజుల్లోపే పెళ్ళైపోయింది. మరి ఇప్పుడు హోటల్ గదిలో తొలిరాత్రి ఏర్పాట్లూ జరిగిపోయాయన్న మాట! జీవితాంతం కన్యగానే ఉండి పోవాలన్న శోభ నిర్ణయం వాళ్ళింటి వారెవరికీ తెలియదు గదామరి! త్వరగా వస్తే బాగుండునని కాకుండా ఏదో వంకపెట్టి శోభ అసలు రాకపోతే బాగుంటుందని 'సుందర్ ఆశిస్తూ ఉండాల్సిన దుస్థితి  ఏర్పడిరది. ఇప్పుడిలా!

'బెల్ మోగితే, వెళ్లితలుపు తీసిన అతనికి శోభ ఒక్కతే రావటం కొంచెం ఆశ్చర్యం కలిగించింది. తెల్లచీర కట్టుకుని కాక, 'యోగా క్లాసు'కి వచ్చినట్లుగా పంజాబీ డ్రస్‌లో రావటం మాత్రం అంత ఆశ్చర్యాన్ని కలిగించలేదు. ఆ డ్రస్ ఎరుపురంగులో ఉంది. ప్రమాదసూచకంగా! "నాన్నకారులో తీసుకొచ్చి కింది నుంచే వెళ్లిపోయారు" అని గుమ్మంలోనే సంజాయిషీ చెప్పుకున్న శోభ మొగుణ్ణి తాకకుండా జాగ్రత్త పడుతూ లోపలికి వచ్చి సోఫాలో కూర్చుని, అకస్మాత్తుగా ఏదో జ్ఞాపకం వచ్చిన దానిలా లేచి వెళ్లి, హోటల్‌వాళ్లు కాఫీ చేసుకోవటం కోసం పెట్టి ఉంచిన పాలపొడిపాకెట్లు నాలుగు వాడి, వేడిపాలు తయారు చేయబూనుకున్నది. అది గమనించిన సుందర్ మనసులో ఏదో "చిన్ని చిన్ని ఆశ" మిణుక్కుమంది "దంపతులు తొలిరాత్రి 'పాలు' పంచుకోవాలన్న మొదటి లాంఛనాన్ని పాటిస్తున్నట్లుంది' అని మురిసిపోయేడు.

అయితే, శోభ కాస్త పంచదార కలుపుకుని ఆ గ్లాసుడు పాలూ ఊదుకుంటూ కాళ్లూపుకుంటూ తనే పూర్తిగా తాగేసే సరికి నీరు కారిపోయేడు పైగా "నాకు పడుకోబోయేముందు వేడిపాలు తాగటం అలవాటు" అని ముక్త సరిగా చెప్పిన

మాటలకి ఇంకా ఉడికిపోయేడు "గుర్రుపెట్టి నిద్రపోవటం తప్ప మరే 'ఇతర కార్యక్రమం' ఉండదని చెప్పకనే చెప్పింది. ఈ అందాల రాక్షసి" అనుకుంటూ అటు తిరిగి పళ్లు నూరుకున్నాడు. అదేమీ పట్టించు కోకుండా, సోఫా కమ్ బెడ్ మీద పక్క సర్దుకుంటూ ఉండిపోయింది శోభ. నడుం వాల్చబోతూ 'సడన్'గా అడిగింది. "ఔనూ – నాకు కరాటేలో బ్లాక్ బెల్ట్ ఉందని మీకుతెలుసా"

"నాకు నిన్ను ముట్టుకునే ఉద్దేశంలేనేలేదు. హాయిగా నిద్రపో" అని ఉక్రోషంగా అనేశాడు గాని క్షణంలోనే సర్దుకుని "స్నేహితులుగానైనా కాసేపు 'అదీ ఇదీ" మాట్లాడుకుంటే బాగుంటుంది కదా అని చాలా ప్రాధేయ పూర్వకంగా అడిగేడు.

"అది ఇదీ అంటే – దాంపత్యం – పవిత్ర బంధం – సృష్టిమహత్యం, సంతాన, మాధుర్యం ఇలా ఏదేదో సొల్లు చెబుదామను కుంటున్నారా? మీరెన్ని ఉపన్యాసాలిచ్చినా నా మనసు మారదుగాక మారదు – నేనేమీ మిమ్మల్ని మోసం చేయలేదు. "అది"కుదరదని, ముందే చెప్పేను. నిష్కర్షగా 'భార్య' చెప్పిన మాటలకి తలవంచేశాడు.

'ఛ! నాక్కూడా నిద్రపట్టడంలేదేంటి? విసుగ్గా అనుకుంటూ కప్పుకున్న శాలువాలోంచి తలపైకెత్తి మంచం మీద మూడంకె వేసుకుని అసహనంగా అటూ ఇటూ కదులుతున్న సుందర్‌ని చూసి జాలిపడిపోయింది – "ఏమండీ" అంటూ మురిపెంగా పిలిచింది. ఆ పిలుపుకే ఢంగైపోయేడు. వెంటనే మంచం మీదలేచి కూర్చున్నాడు. శోభకూడా ఉత్సాహంగానే లేచి కూర్చుంటున్న క్రమంలో కనువిందుచేస్తున్న అందాల్ని, పరవశంగా చూస్తూ

అదేం పట్టించుకోకుండా – "స్నేహితులుగా కబుర్లు చెప్పుకుందాంలెండి కాసేపు –"ఔనూ – నేనైతే చండీరాణిలా ఎవర్నీ దగ్గరికి రానీయలేదు గాని – మీరు ... మీరు... బాగానే ఉంటారు గదా.... మరి ... మరి చదువుకునే రోజుల్లో ఎవర్నైనా.... అదే ఇష్ట పడ్డారా... 'వన్‌వేలవ్' అయిపోయిందా పాపం?" శోభప్రశ్నలకి సుందర్ సమాధానమీయలేదు. "బాగానే ఉంటారు కదా" అన్నమాటల్నిఆస్వాదిస్తూ ఉండిపోయాడు.

"మన మధ్య రహస్యాలుండకూడదుకదాండి" అని మళ్లీ అనేసరికి, భార్యా భర్తల మధ్య రహస్యాలేంటి'' అన్న అర్థం స్ఫురించిన సుందర్‌కి బాగా ఉత్సాహమొచ్చింది.

''ఇంటర్ చదివే రోజుల్లో'' రాధిక అని సన్నజాజి పూవులాంటి అమ్మాయిుండేది. తను... తనంటే... కొంచెం ఇష్టం ఏర్పడింది. కాని వాళ్లనాన్న పోలీస్ ఆఫీసర్ – నేను ధైర్యం కూడగట్టుకునే లోగానే కూతుర్ని చదువు మాన్పించేసి పెళ్లిచేసేశాడు. ఈ మధ్యన ఏదో ఫంక్షన్‌లో కలిసింది. అబ్బ ఎంత లావైపోయిందో పిప్పళ్ల బస్తాలా – తనని వదిలించుకోవటం చాలా కష్టమైపోయింది". ఇంకా చెప్పబోతూ పడీపడీ నవ్వుతున్న శోభని, ఎగిరెగిరి పడుతున్న తన వక్షోజాల్ని చూస్తూ ఇంకనోట మాటరాక ఆగిపోయేడు. అంతలోనే మళ్లీ ఉత్సాహమొచ్చి, "యూనివర్శిటీలో చదువుతున్నప్పుడు శిల్ప, కల్ప అని ఇద్దరు స్వయానా అక్క చెల్లెళ్లు క్లాసుమేట్లుగా ఉండేవారు. నీ అంత కాదు గాని కొంత బాగానే ఉంటారులే ఒకళ్లు లేనప్పుడు ఒకళ్లు నా వెంటపడేవారు. వాళ్ల వరస నాకసలు నచ్చలేదు. ఇద్దరికీ'నో' చెప్పేశాను. చాలా రోజులు నా వెంట బడ్డారుగాని ఆఖరికి విసుగొచ్చి " రియాక్షన్‌కోసం ఆగేడు.

"ఊ విసుగొచ్చి – ఏం చేశారు – మీదపడ్డారా ఆ సిగ్గులేని ముఖాలు? కోపంగా అడిగిన శోభకేసి కాస్త విస్మయంగా చూసి – "అదేం కాదు – మీద పడలేదు – అత్యాచారమూ చేయలేదు – విసుగొచ్చి ఏం చేశారంటే – ఏం చేశారంటే– పెద్దదేమో ఓ ముసలి కెమిస్ట్రీ ప్రొఫెసర్‌ని, చిన్నదేమో తనకన్న చిన్నవాడైన ఒక'ప్యూన్'ని పెళ్లాడేశారు" అని ఊరిస్తూ ఊరిస్తూ చెప్పి ఇంకా నవ్వించేశాడు!

"మరి వాళ్లు మిమ్మల్ని తర్వాతెప్పుడూ కలవలేదా? "శిల్ప కెమిస్ట్రీ ప్రొఫెసర్‌ని చేసుకుందని చెప్పానే – తను ఈ మధ్యనే ఓ సూపర్ బజార్‌లో కలిసింది. వాళ్లిద్దరికీ 'కెమిస్ట్రీ' కుదిరినట్లులేదు – పక్కన ముసలి మొగుడున్నా నావైపుచూసి కన్నుకొట్టింది – కల్ప ఎక్కడుందో తెలియదు............"

తన మాటలు రుచించనట్లుగా ముఖం చిట్లించుకున్న శోభని పట్టించు

కోకుండా“శిల్ప “కల్ప”లని ఎలాగైనా నీ దగ్గరికి తీసుకొచ్చి పరిచయం చేస్తాను... సరేనా... భలే కలివిడి అమ్మాయిలులే.....

ఇంక కోపం ఆపుకోలేక గట్టిగా అరిచేసింది శోభ” ఇంకాపండి– మీ సొల్లుకబుర్లు– నాకు నిద్రవస్తోంది”. – మీరు పడుకోండి– మీపాత స్నేహితురాళ్లతో కలల్లో విహరించండి– అంటూ ముసుగేసేసుకుంది.

“ఛ – నామొగుడు రాముడు లాంటి మంచి బాలుడనుకున్నాను. సిగ్గులేకుండా తన ‘కృష్ణలీలలన్నీ’ చెబుతున్నాడు. దొంగ రాస్కెల్స్. వాళ్లని నాకు పరిచయం చేస్తాడంట? – నా దగ్గరకొస్తే వాళ్లపీకలు నొక్కేయనూ – లోలోపలే సణుక్కొంది. సుందర్ కూడా మాటలు పెంచే ప్రయత్నం చేయకుండా అటు తిరిగి పడుకున్నాడు. డబుల్ బెడ్ మీద సింగిల్‌గా – మొదటి జాము గడిచిపోయింది.

శోభన ఏదో అస్పష్టంగా కీచుగా అరుస్తూంటే, సోఫావైపు చూసిన  అతనికి “యా–హు–చంపేస్తానే – అని కాళ్లూచేతులు గాల్లోఊపుతూ పక్కమీద కరాటే చేస్తున్న శోభ కనపడింది. లేవబోతున్న అతని చెయ్యితగిలి కిందపడ్డ జగ్గు చప్పుడుతో జాగ్రదావస్థ లోకి వచ్చి చాలా సిగ్గు పడింది.

“ఏమైంది – శోభా – ఏదైనా పీడకల వచ్చిందా” అని గోముగా అడిగిన అతని ప్రశ్నకు సమాధానమీయకుండా మళ్లీ శాలువాలోకి దూరిపోయింది. అంతేగాని, రాధికఅనే “పిప్పళ్లబస్తా” తలుపులు బద్దలు కొట్టుకొని లోపలికి వచ్చి సుందర్‌ని కిడ్నాప్ చేసి తీసుకుపోవడానికి ప్రయత్నిస్తుంటే, రక్షించమని అతను తనవైపు బేలగా చూస్తోంటే, తను కరాటే విద్యతో ఆ పిప్పళ్ల బస్తాతో కలబడినట్లు పీడకల వచ్చిందని చెప్పలేక పోయింది. రెండో జాముగడిచి పోయింది. మెళ్లో మూడుముళ్లు వేసిన అధికారాన్ని చలాయించు కోవాలన్న ప్రయత్నాలేవీ చేయకుండా సంస్కారవంతంగా ఉంటున్న“మా ఆయన నిజంగా బంగారం” అనిపదే పదే అనుకుంది శోభ తనకి నిద్రరాలేదు గాని ఎన్నో రకరకాల ఆలోచనలు వచ్చేయి. “జీవితాంతం నేను కన్యగానే ఉండిపోవాలి మరి ఆయన ఏ సుఖమూ లేకుండా ఎందుకుండి పోవాలి పాపం! “అనుకుంది.  ఏమండీ నిద్రపోతున్నారా” అంది.

"లేదులే – ఊ చెప్పు – ఏంటి "ఏవో కబుర్లు చెప్పలేరా, మరి... మీ ఆఫీసులో ....... ఎవరైనా మీతో సన్నిహితంగా ఉంటారా".

"ఓ! మా కజిన్‌శేఖర్ నా తో సన్నిహితంగా ఉంటాడు. మా ఆఫీసులోనేకదా పనిచేసేది, వాడు" కోపంగా చిరాగ్గా చూస్తున్న శోభకి భయపడి మాటల మధ్యలో మింగేశాడు. కాసేపాగి ఎటో చూస్తూ మెల్లగా అన్నాడు. "అరవింద" అని ఆఫీస్‌లో నా బాస్ – చాలా బాగుంటుంది. నాకన్న పదేళ్లే పెద్దది! నేనంటే చాలా ఇష్టం. కాని... కాని తనకి పెళ్లి అంటే ఇష్టంలేదు. 'సహజీవనం' చేద్దాం అంటోంది. నేనే ఎటూ నిర్ణయించు కోలేక పోయాను. ఈ లోగా నీతో పెళ్లైంది అఫ్‌కోర్స్ అదుండదనుకో పోనీలే ఏంచేస్తాం" ఇంక మాటలు రానట్లుగా ఆగిపోయాడు. ఈ సారి నిజంగా జాలి కలిగింది. కాసేపు దీర్ఘాలోచనలో మునిగిపోయింది. అతని కళ్లల్లోకి చూడలేని అశక్తతతో తలదించుకుని ఉంది. "కన్యగానే ఉండిపోవాలన్న నా నిర్ణయంలో మార్పు అసాధ్యం. అలా అని విడాకులు అనుకుని మా వాళ్లకి తలవంపులు తేలేను పోనీ మనమిలానే ఉండిపోయి, ఉభయ తారకంగా మీరు ఎవరో ఒకరితో సహజీవనం – అదే ఎవరికీ తెలియకుండా "ఇంక ఏడుపాపుకోలేక పోయింది.

"ఛ! ఊర్కో బాధపడకు ఏదో ఆలోచిద్దాంలే" ఈ మాటలతో ఏడుపుపోయి ఆస్థానంలో బాగా కోపం, ఉక్రోషం వచ్చేయి. అయినా పైకేమి అనకుండా అటూ తిరిగి పడుకుంది ఏమాత్రం వళ్లు కనపడకుండా శాలువా కప్పుకుని

"ఛ ! ఎంతైనా మగబుద్ధి మగబుద్ధే వివాహం పవిత్రబంధం ఇవేమీ మాట్లాలడకుండా'ఆలోచిద్దాంలే' అంటున్నాడు. ఏంటి ఆలోచించేది? సరే 'తను' ఎలా నిర్ణయించుకుంటే నాకెందుకు?" అని ఉడుక్కుంటూ ఉండిపోయింది రకరకాల వైరుధ్య ఆలోచనలతో అకస్మాత్తుగా చలిజ్వరం వచ్చేసింది. తన మూలుగు వినపడలేదు కాబోలు మంచం మీదకదలకుండా ఉన్నసుందర్ మీదబాగా కోపం వచ్చి కప్పుకున్నశాలూవానే విసిరికొట్టింది. అప్పుడు లేచి వచ్చేడు. తనపక్క దగ్గరికి వచ్చి నిలబడ్డాడు.

"అమ్మో నన్ను ముట్టేసుకుంటాడా? ప్రేమతో చుట్టేసుకుంటాడా" అన్నభయం

కలిగి ఇంకా గజగజా వణికిపోయింది.

అప్పుడు సుందర్ మెల్లగా వంగి.... నేలమీద శాలువాతీసి శోభకి కప్పి తన పక్కమీదికి వెళ్లిపోయేడు. అటు తిరిగి పడుకున్నాడు. అంతే శోభకి వళ్లు మండిపోయింది. ఎందుకంటే, శాలువా కప్పుతున్నప్పుడు అతని వేళ్లుకొద్దిగా తన మెడని తాకేయి. ఇష్టుడైన పురుష స్పర్శ ముందు మెడలోని విద్యుత్తులా ప్రసరించి తర్వాత వళ్లంతా పాకి షాకిచ్చింది. ఏదో తెలియని మాయలో కూరుకునిపోయింది. నిశ్చేతనంగా ఉండిపోయింది. మూడో జాము గడిచిపోయింది. శోభకి మాగన్నుగా నిద్రపట్టింది. కాని తనని కుదురుగా నిద్రపోనిస్తే కదా ఆ పాడు దెయ్యాలు. ఈ సారి రాధిక, శిల్ప, కల్ప, అరవింద, కొంత మంది రౌడీలతో కలిసి తన 'స్వామి'ని ఎత్తుకుని పోదామని వచ్చేరు. తన సొమ్ముని అన్యాయంగా అక్రమంగా దోచుకు పోదామని ప్రయత్నిస్తోంటే ఊరుకోగలదా? శాయశక్తులా వాళ్లతోపోరాడింది. కాని వాళ్ల పశుబలం ముందు, మూక బల ముందు నిలబడలేక పోతోంది. "రాధిక" ఆ పిప్పళ్లబస్తా తన జుట్టు పట్టుకుని తోసేస్తే, తను తంతే బూర్లె గంపలో పడినట్లుగా సుందర్ మీద పడిపోయింది.

'ఆయనా', తనను పొదవి పట్టుకున్నారు. ఇద్దర్నీ విడదీయాలని ఆ నాలుగు దెయ్యాలూ ప్రయత్నిస్తున్నాయి. కాని ఆయన గువ్వలా తనలో ఒదిగిపోయిన అర్ధాంగిని వదలకుండానే వాళ్లని విదిల్చికొడుతున్నారు. వాళ్లెలాగు ఓడిపోతారు. పారిపోతారు. అబ్బ! భర్త రక్షణ ఎంత మధురంగా ఉందో నడుం చుట్టూ తన ఉడుం పట్టు ఎంత బాగుందో. నడుం చుట్టూ ఉన్న చేతుల్ని ఇంకెక్కడోవేసి, ముఖం మీదికి వంగుతూ ముద్దు పెట్టుకోబోతున్న మొగుణ్ని చూసి ఒక్కసారిగా ఈ లోకంలోకి వచ్చేసింది. శోభ అతన్ని తోసేయలేదు గాని, అటూ ఇటూ చూసింది ఎవరన్నా చూస్తున్నారేమోనని అబ్బే తామిద్దరం తప్ప గదిలో ఇంకెవరూ లేరని గ్రహించి, రాధిక వగైరా దెయ్యాలు కలలోకి మాత్రమే గాని ఈ గదిలోకి రాలేదని అర్ధమై సిగ్గు పడిరది 'ఏంటండీ ఇది నా పక్కలోకి ఎందుకొచ్చారు మీరు?" అతని డొక్కలో మెల్లిగా గుద్దుతూ కోపం నటిస్తూ అడిగింది.

‘అబ్బే నేను నీ పక్కలోకి రాలేదు నువ్వే ఏదో అరుస్తూ నా పక్కలోకి వచ్చి నన్ను కరుచుకునిపోయేవు’ “నిజాయితిగానే చెబుతూ భార్యను ఇంకా అల్లుకున్నాడు. తన వళ్లు ఇంకా జల్లుమని ఆమత్తులో వాగేసింది, ‘ఏమండీ నన్ను స్వీకరించండి నన్ను క్షమించండి దంపతులు శరీరాలతో బాటు మనసులనీ పంచుకోవాలండి. ఎవరితోనూ సహజీవనం వద్దండి. పదేళ్ల పెద్ద దానితో సంసారం ఆయుక్షీణమండి, వద్దండీ నన్నే స్వీకరించండి. ఇంకేం మాట్లాడొద్దండి ప్లీజ్ ఇంకేం మాట్లాడుతాడు కోరుకున్నవరం లభిస్తున్నప్పుడు? మౌనంగానే కార్యరంగం లోకి దిగేడు పరస్పర సహకారంతో, అంగీకారంతో ‘శోభ శోభనం’ జరిగిపోయింది నాలుగో జాములో బ్రహ్మ ముహూర్తంలో. తెల్లారేకేనే, సుందర్ అసలు విషయం చెప్పేడు. రాధిక, శిల్ప, కల్పన ఆఖరికి అరవింద కూడా తను సరదాగా సృష్టించిన కల్పిత పాత్రలే గాని అలాంటి వారెవరూ తన జీవితంలో ఎప్పుడూ తారసపడలేదని, తను మంచి బాలుడినని శోభకి అప్పుడు కోపం వచ్చిందో, అపారమైన సంతోషం కలిగిందో తెలియదు గాని మొగుణ్ని గట్టిగా గిల్లేసి, ఇంకా గట్టిగా మెత్తగా, వెచ్చగా హత్తుకుపోయింది. పైగా ‘ఎంత మోసం చేశావురా? ఓర్నీ’ అనేసి వెంటనే నాలుక కరుచుకుంది. అంత ప్రేమగా పెళ్లాం తనను“ ఓర్నీ, ఒరే అనటం సుందరానికి బాగా నచ్చింది”.

# ఎన్.ఆర్.ఐ. రాముడు - భరతుడు ఐ.ఏ.ఎస్

నవ్యాంధ్రలో, విజయవాడ దగ్గర, గన్నవరం విమానాశ్రయంలో తెల్లవారు జామున, ఫ్లైట్ దిగిన "ప్రవాసాంధ్రుడు" రామారావు, అక్కడి నుండే నేరుగా పశ్చిమగోదావరిజిల్లా, "నర్సాపురం" పట్టణానికి చేరువలోఉన్న"పేరుపాలెం, గ్రామానికి "టాక్సీ" లో చేరుకునేసరికి, ఉదయం 9 గంటలైంది. కొంచెం వెదుక్కుంటూ, 30ఏళ్ల క్రితం తనుపుట్టిన ఇంటిని పట్టుకో గలిగేడు. "సత్యమూర్తి, ఆకెళ్ల బి.ఏ., బి.యిడి- రిటైర్డ్ హెడ్మాస్టర్" అని ఉన్న నీరెండలో మెరిసిపోతున్న బోర్డుని చూసి అది "మన ఇల్లే" అని నిర్ధారించుకున్న తర్వాతనే, కారు దిగి, డ్రైవర్‌కి ఇవ్వాల్సిన డబ్బు, ఖచ్చితంగా లెక్క పెట్టి ఇచ్చి, వాడిని పంపించేసిన తర్వాతనే, బయటి గేటుకి తాళం వేసి ఉన్న ఆ ఇంటిని పరిశీలించి చూశాడు. 'ఆశ్చర్యచకితుడై పోయాడు,- ఐదేళ్ల తర్వాత, భారతదేశానికి, "స్వగృహానికి" వచ్చిన ఎన్.ఆర్.ఐ. (కొందరి విషయంలో నెవర్ రిటర్న్ టు ఇండియా" అని అర్థం) రామారావు.

ఔనుమరి, ఐదేళ్ల సమయంలో ఎంతో మార్పు వచ్చింది. నాడు, ముందూ వెనకా పిచ్చి మొక్కలతో, అక్కడక్కడా పెచ్చులూడిన గోడలతో, వెలిసిపోయిన రంగులతో, ఎంతో కళాహీనంగా ఉండిన పాతడాబా ఇల్లు, ఇప్పుడు, అందమైన పూల మొక్కలతో, ఏపుగా ఎదిగిన ఫల వృక్షాలతో, కళాత్మకమైన రంగులతో మెరిసిపోతూ, అద్దాల మేడలా అలరారుతోంది! పైగా 'ఒక అంతస్థు పెంచుకుని', గృహస్తుకి పెరిగిన ఆర్థికస్థాయినీ తేటతెల్లం చేస్తోంది. ముంగిట్లో ఒక 'ఫౌంటెన్' వయ్యారాలొలికిస్తోంది. నాన్న ఈ ఇంటిని వేరెవరికో అమ్మేసి ఏదో ఒక చిన్న అద్దె కొంపకి మారిపోయాడేమో' నన్న అనుమానం రావడానికి వీలులేకుండా, గేటు మీదున్న నాన్న పేరున్న నామఫలకం కళ్లెదురుగా ఉంది గదా మరి మరి తనెప్పుడూ నాన్నకి ఒక 'డాలర్' కూడా పంపలేదు గదా?. ఇంత వైభవంగా పాత ఇంటిని పునర్నిర్మాణం చేయించటం, ఎలా సాధ్యమైందాయనకు? అంటే, వారం రోజుల క్రితం తనకెవరో శ్రేయోభిలాషి, ఈ మెయిల్ ద్వారా తెలియజేసిన మూడు విషయాలూ నిజమేనన్న మాటేగా!మొదటిది, మానాన్న ఇప్పుడు భోగభాగ్యాలతో

ఉన్నాడన్నది నిజమేనని, ఈ విలాసగృహం, చెబుతోంది. ప్రాంగణంలో కనపడుతున్న ఆ లగ్జరీ కారూ చాటుతోంది కాబట్టి, 'ఒక ధనిక వితంతువుని, పెళ్లాడి నడమంత్రపు సిరి పొందాడులే నీ ముసలి తండ్రి అని ఆ శ్రేయోభిలాషి తెలియజేసిన రెండో అంశం కూడా నిజమే అయ్యుండాలి. ఇంకేం అనుమానం లేదు. ఇకపోతే, మూడో అంశం, 'జాగ్రత్త పడకపోతే ఇండియాలో ఈ సిరిసంపదలన్నీ ఏకైక కుమారుడివి నీకు కాకుండా, ఇంకెవరో మూడో వ్యక్తికి 'భరత్'కి పోయే 'ప్రమాదం' ఉందన్న "హెచ్చరికే కదా, ఎప్పుడో ఐదేళ్ల క్రితం 'అమ్మ' పోయినప్పుడు మాత్రమే వచ్చి నాన్నని చూసుకోవడానికి ఎంతో బాధ్యతగా ఒక "కేర్ టేకర్" గా "భరత్"ని కుదిర్చి మళ్లీ ఆరు నెలలోపునే వస్తానని చెప్పి తిరిగి అమెరికా చెక్కేసి ఇన్నాళ్లుగా నాన్నతో బాటుగా అందరికీ ముఖం చాటేసిన తనని అర్థాంతరంగా 'స్వదేశం లోని స్వగ్రామానికి రప్పించింది! భారతీయ సంస్కృతి కుటుంబ విలువలు ఒక ఉపాధ్యాయుడిగా అందరికీ బోధించిన ఆయన ఇంత నికృష్టానికి పాలుబడటం అనుచితమని నాన్నని కడిగేయాలని, అంతేగాని "నీ నీచసంపద" నాకవసరం లేదని కూడా చెప్పేయాలని అమెరికా నుండి బయలు దేరిన తనను, ఇప్పుడు కళ్లెదురుగా గోచరిస్తున్న ఈ అపార సంపద నాకు కాకుండా పోనీయరాదన్న 'ప్రలోభం', స్వలాభం కమ్ముకుంటున్నాయా ఏమో .............

ఇలా రకరకాల ఆలోచనలతో, సతమతమవుతున్న "ఎన్.ఆర్.ఐ రామారావు, గేటుకున్న తాళాన్ని అసహనంగా చూస్తూ ఈ ముసలాయన పడుచు పెళ్లాంతో ఎక్కడికో హనీమూన్‌కి చెక్కేసినట్లున్నాడు.. 'ఇప్పుడు నేనేం చెయ్యాలి? ఎక్కడుండాలి? అనకుంటూ ఉక్రోషంగా పళ్లునూరు కున్నాడు.

అంతలోనే ఎక్కడినుంచో సైకిల్ మీదవచ్చి, గేటు ముందు నిలబడి ఉన్న తనని పరికించి చూస్తూ, పోల్చుకోవడానికి ప్రయత్నిస్తున్న ఒక యువకుడివైపు, కొంచెం తీక్షణంగానే చూసేడు రామారావు 'ఎవడ్రా నువ్వు' అన్నట్లుగా.

క్షణంలోనే ఆ యువకుడు, బాగా పొట్టవచ్చి జుట్టంతా ఊడిపోయున్న రామారావుని గుర్తించ గలిగేడు. వెంటనే "మీరా అన్నయ్యగారూ" – అంటూ కాళ్ల మీదపడి పోయాడు. పైకి లేవకుండానే "మీరొస్తారని తెలియనే తెలియదు. ఇల్లు

తాళం వేసి వెళ్ళిపోయాను. ఎంతసేపు ఎండలో ఉండిపోయారో ఏంటో క్షమించండి". అంటూలేచి గేటు తాళం తీశాడు. రామారావు సూట్‌కేసుని తానే ఎత్తిపట్టుకుని 'పదండన్నయ్యా' అంటూ ఇంకా అయోమయంగా తనని చూస్తున్న రామారావు తనని పోల్చుకోలేదన్న సంగతి అర్థమై "నేనండీ భరతుడిని! మీనాన్న గారిని చూసుకోమని కుదిర్చిన "సంరక్షకుడి"ని – అని నవ్వుతూ చెప్పేడు. "ఓసారీ కేర్ టేకర్ భరతుడివా? పోల్చుకోలేక పోయానులే"

"ఆ పర్వాలేదన్నయ్యగారూ ఐదేళ్లయిపోయింది గదాండీ? "భరతుడు మామూలుగానే అన్నా అందులో ఏదో వెటకారం గోచరించిందో ఏమో! లేదా మాటి మాటికి అన్యయ్యా అంటున్నాడని కోపం వచ్చిందో తెలియదుగాని రామారావు సీరియస్‌గా అన్నాడు. "ఏయ్ కొంచెం నీ లిమిట్స్‌లో ఉండటం నేర్చుకో మాటి మాటికీ అన్నయ్యా అంటున్నావెందుకు?" అని కసిరేడు. దాంతో అతని ముఖం బాగా మ్లానమైపోయింది. అయినా మౌనంగానే సూట్‌కేస్ మోస్తూ లోపలికి దారితీశాడే గాని, "నా స్వంత తమ్ముడిగా భావించుకుని నాన్నను సంరక్షించుకునే బాధ్యతను నీకప్పగిస్తున్నా భరతుడూ ఓ ఆరునెలల్లో మళ్లీ వస్తానులే అని "అయిదేళ్ల క్రితం మీరన్నారు" అని జ్ఞాపకం చేసే ప్రయత్నం చేయలేదు భరతుడు! రామారావుకీ జ్ఞాపకం రాలేదు.

రామారావు కూడా ఖరీదైన సోఫా సెట్లు, విలాసవంతమైన ఫర్నీచర్‌తో ఉన్న హాలుని అబ్బురంగా పరిశీలిస్తూ కుడివైపునున్న బెడ్‌రూమ్‌లోకి అతడిని అనుసరించాడు. అది కూడా చాలా గొప్పగా, అమెరికాలోని తన బెడ్‌రూమ్ కన్న "రిచ్"గా ఉండటాన్ని గమనించాడు. ఎంత గాఢంగా పరిశీలించినా, కింది భాగమంతా ఎంతో పరిశుభ్రంగా విలాసవంతంగా ఉన్నా ఆడవాళ్లు మసలిన దాఖలాలు కనపడలేదు. "ఆవిడి" రాణీవాసం పై పోర్షన్‌లో కాబోలు 'అదింకెంత ఘనంగా ఉంటుందో' అని కక్షగా అనుకున్నాడు. ఐనా వాళ్లిద్దరూ ఎక్కడికి పోయారు. వీడి మీద ఇల్లంతా వదిలేసి? అని మూలుక్కున్నాడు. రూమ్‌లో, ఏసీ ఆన్‌చేసి, "సార్ – మీరు కాసేపు రెస్ట్ తీసుకోండి. క్షణంలో "బ్రేక్‌ఫాస్ట్" సిద్ధం చేస్తా. అన్న భరతుడికేసి, "సార్" అన్నందుకు ప్రసన్నమైపోయి "ఏర్‌పోర్ట్‌లోనే కానిచ్చేసేనులే

గాని, ఒకకప్పు కాఫీచాలు. వంట మనిషి ఉందా మరి? అది రావటానికి లేటవుతుందా! అని అడిగి అతను చెప్పే లోగానే ‘ఆతృత ఆగలేక మరో మూడు ప్రశ్నలు సంధించేశాడు. ఇంత ఘనంగా ఇంటిని రినోవేట్ (మెరుగు పర్చటానికి) ఎంత ఖర్చైంది (2) ఈ ఇల్లు కాకుండా ఆయనకిప్పుడు ఎంత సంపదఉందో తెలుసా? (3) నాన్నా... ఆవిడా... ఎక్కడికెళ్లారు?

వంటమనిషి గురించి “ఆవిడ” అంటున్నాడేమోనని తర్కించుకుని తలవంచుకుని వివరంగా జవాబిచ్చేడు భరతుడు.

“సార్–వెళ్లేప్పుడు మీరు ఒక వంట మనిషిని పెట్టుకోమని చెప్పినా, ఇద్దరి కోసం ఆ అదనపు ఖర్చెందుకు, నాకు ‘కేర్‌టేకర్‌గా ఇచ్చే జీతానికి అదనంగా అనిపించి, మొదట్నుంచీ నాకొచ్చినట్లుగా నేనే వంట చేస్తున్నా. ఇకపోతే మీరు వెళ్లేటప్పటికే, నాన్నగారికి అమ్మగారి స్త్రీ ధనంగా వచ్చిన రెండెకరాల బీడు పొలం ఉండేదిగా. ఆ ఊళ్లోఏదో నీటి పారుదల ప్రాజెక్టు పూర్తయినందు వలన ఆ భూమి చెరకు పంటకు యోగ్యమైంది. ఒకరైతు కూలీ కొడుకుగా నాకున్న అనుభవంతో అందులో చెరకు పండిస్తున్నాం. ఆ ఆదాయంతో రెండేళ్లలోనే పక్కనున్న మరో రెండెకరాలు కొన్నారు నాన్నగారు. అందులో కూడా చెరకు పండిస్తూ నాన్న గారు మరింత ఆదాయం, పొందుతున్నారు. కాబట్టి, ఈ ఇంటి పునర్నిర్మాణం సాధ్యమైంది. ‘రినోవేషన్‌కి’ ఓ పదిలక్షలైందనుకుంటాను.

“ఈ సమాచారం రామారావుకి ఎంతో సంతుష్టిని కలిగించింది. ‘అంటే నాన్న ఇప్పుడు “మిలియనైర్” అన్న మాటేగా! ఇల్లు, నాలుగెకరాల పొలం మరి కొత్త పెళ్లాం ద్వారా వచ్చిన ఆస్తి విలువ ఇంకా ఎంతుంటుందో మరి, అనుకుని .... “మరి నాన్నగారు ఇప్పుడెక్కడున్నారంటే... మరి ..... ” అని నసుగుతున్న భరతుడిని వారిస్తూ “అది సరే.... ఇప్పుడు ‘నాన్నకున్న ఆస్తి మొత్తం విలువ ఎంతుంటుందంటావ్!” అని మరో ప్రశ్న సంధించాడు. నాన్న గురించి తెలుసుకోవటం కన్నా, ఆయన ఆస్తి విలువల వివరాలు పట్లనే ఎక్కువ ఆసక్తి చూపుతున్న అతని ధోరణికి విస్తుపోయినా, కాసే పాగి సమాధాన మిచ్చాడు భరతుడు.

“మీకు తెలియదనుకుంటాను. రెండేళ్ల క్రితం ఎప్పుడో మీ కుటుంబంతో

కులాంతర వివాహం మూలంగా బంధాలు తెగిపోయి చెన్నైలో స్థిరపడిపోయిన, మీ మేనత్త "భాగ్యలక్ష్మి" చనిపోయారు. ఆవిడకి ఇంకెవరూ వారసులు లేనందున. ఆవిడరాసిన వీలునామా ప్రకారం కొంత ఆస్తి, చెన్నైలో కొన్ని భవనాలు బ్లూచిప్ కంపెనీలో కొన్నిషేర్లు నాన్నగారి పరమయ్యాయి. వాటి విలువ ఓ ఐదుకోట్లు ఉండొచ్చు".

ఈ అదనపు సమాచారం రామారావుకి అదనపు సంతోషాన్ని కలిగించింది. అయినా బయట పడలేదు గాని "మరిన్నాళ్లూ నువ్వుగాని, నాన్నగాని ఇదంతా నానుంచి ఎందుకు రహస్యంగా ఉంచారు? నాకు వాటా ఇవ్వాల్సొస్తుందనా? "నిష్ఠూరంగానే అన్నాడు. "అయ్యో- అదేం కాదు సార్ మాకు తెలిసిన మీ పాత చిరునామా, ఫోను నెంబర్లు మారిపోయాయి. ఎంత ప్రయత్నించినా మిమ్మల్ని కాంటాక్ట్ చేయలేకపోయాం. ఏమైనా ఈ ఆస్తి అంతా మీకే చెందాలన్నది ఆయన దృఢసంకల్పం" అని దృఢంగా చెప్పిన భరతుడివైపు సాలోచనగా చూసిన రామారావుకి అతనిలో నిజాయితీ తప్ప మరేమీ కనిపించలేదు. 'ఛ! నాన్న ఎవర్నో పునర్వివాహం చేసుకున్నాడన్న వార్తని నమ్మినందుకు, చెడ్డగా ఊహించుకున్నందుకు, చాలా పశ్చాత్తాపానికి గురయ్యాడు. భారమైన హృదయంతో అవాక్కైపోయాడు.

ఇది గమనించక పోయినా, అడగకపోయినా, చెప్పటం తన ధర్మమనుకున్న భరతుడు "ఇప్పుడు నాన్నగారు నర్సాపురం పట్నంలో ఒకమంచి హాస్పిటల్‌లో ఐ.సీ.యు.లో ఉన్నారు. నేనే వారం రోజుల క్రితం చేర్పించాను. కంగారు పడొద్దు - మైల్డ్ హార్ట్‌స్ట్రోకేనన్నారు. ఒకస్టెంట్ కూడా వేశారు. ఈ రోజే డిస్చార్జ్‌చేస్తున్నారు. ఇన్నాళ్లూ నేనూ హాస్పిటల్‌లోనే ఉన్నా, బిల్‌పేమెంట్ ఇతర ఫార్మాలిటీస్ పూర్తవ్వడానికి సాయంత్రం కావొచ్చు. "ఈ రోజైనా నాన్నగారికి ఇంటి భోజనం తినిపించాలనిపించి, ఆయన దగ్గర నా మిత్రుడొకడిని సాయంగా ఉంచి, వాడి సైకిలు మీదనే నింటి కొచ్చాను. ఓ గంటలో భోజనం కేరేజీ తీసుకుని వెళ్లిపోతాను. కారు తీసుకెళ్లాల్సిన అవసరంలేదు. నర్సాపురంలో ఒక స్వచ్ఛంద సంస్థకు ఈ మధ్యనే నాన్నగారు ఒక అంబులెన్స్ కొని దానమిచ్చారు. అందులోనే, ఇంటికి తీసుకొస్తా. మీరు కాసేపు విశ్రాంతి తీసుకోండి. కాఫీ తీసుకొస్తా" అని చెప్పేసి వంటింట్లోకి వెళ్లిపోయేడు.

గతానికి సంబంధించిన ఆలోచనల్లో మునిగిపోయేడు రామారావు. వంటింట్లోంచి వినవస్తున్న శబ్ధాలతో అమ్మగుర్తు కొచ్చింది. "అమ్మ మహాలక్ష్మిలా ఎంత అందంగా హుందాగా ఉండేది. నన్ను ఎంతో గారాబంగా పెంచింది. ఇంజనీరింగ్ పూర్తి కాగానే బెంగుళూరులో ఉద్యోగం వస్తే ఎంతో సంబరపడి పోయింది. పదవీ విరమణకి ఇంకో ఆరునెలలు సమయం ఉన్న నాన్నగారిని వదలలేక, నన్నూ ఒంటరిగా బెంగుళూరులో ఉంచలేక, ప్రతీనెలా నా దగ్గరికి వచ్చేసి వారం రోజులు ఉండిపోయేది. నాన్న పదవీ విరమణ చేశాక, బాగా పోరి "ఇద్దరం", 'అబ్బాయి' దగ్గరికి వెళ్లిపోదామని ఒప్పించింది. ఇంతలో తనకి అమెరికా వెళ్ళే అవకాశం వచ్చింది. తాత్కాలికంగానైనా మమ్మల్ని విడిచి వెళ్లొద్దని చాలా బతిమాలింది. తన అయిష్టాన్ని బహిరంగంగా చెప్పటం లేదని భర్త మీద ఆగ్రహించింది. తను అమెరికా వెళ్లడానికే నిర్ణయించుకున్నందుకు హతాశురాలై పోయింది. అలిగి భర్తతో, కొడుకుతో మాట్లాడడం కూడా మానేసింది. అయినా తుది వీడ్కోలు పలకటానికి ముంబై విమానాశ్రయానికి వచ్చింది. ఫ్లైటు ఎక్కేముందు మూడునెలలోపే తిరిగి వస్తానని తను ఎంపిక చేసిన పిల్లని పెళ్లి చేసుకుని తిరిగి వెళ్లిపోయినా, శాశ్వతంగా అమెరికాలో ఉండిపోనని మాట తీసుకుంది.

కాని నేను, ఆ వాగ్దానాన్ని నెరవేర్చలేదు సరికదా, ఆరునెలలు తిరక్కుండానే అమెరికన్ వనిత, సహోద్యోగి జూలీని పెళ్లిచేసేసుకున్నాను, త్వరితంగా గ్రీన్‌కార్డు, ఆపైన అమెరికా పౌరసత్వం పొందడానికి మార్గం సుగమం చేసుకోవడానికి. జూలీకి ఎందుకో చిన్నప్పట్నుంచీ భారతదేశమన్నా, అక్కడి సంస్కృతి, కుటుంబ విలువలన్నా ఇష్టం ఉంటూ వచ్చింది. తనతో పెళ్లికి ఒప్పుకోవడానికి అదే ప్రధాన కారణమేమో కూడా. భార్య బలవంతం మీద పెళ్లైన నెల్లాళ్ల పిమ్మట ఫోన్‌చేసి విషయం చెబితే, ఆయన కాసేపు మౌనంగా ఉండి "ఇద్దరూ ఇండియా అప్పుడప్పుడూ వస్తూండండి" అని ఫోను పెట్టేశాడు. ఇంకో రెండు రోజుల తర్వాత ఉండ బట్టలేక "జూలీ" ఫోన్‌చేస్తే ఈ సారి అమ్మ ఎత్తింది. "హాయ్ మామ్ – నమస్తే – అందో లేదో, అమ్మ మండిపోయి యూ డెవిల్, డెడ్ ..... నో .... మై సన్‌డెడ్....నెవర్ టాక్–" అని తనకొచ్చిన ఇంగ్లీషులో అరిచేసి ఏడ్చేసింది. స్పీకర్‌లో నాకూ వినపడింది. ఫోన్‌పెట్టేసిన జూలీకి కోపం వచ్చిందేమో అన్న భయం కలిగింది నాకు. కానీ

జూలీ కన్నీళ్లు కార్చుకుంటూ, “ఇటీజ్ నేచురల్ –డాడ్‌సైలెంట్ – మామ్ వైలెంట్ – జస్ట్‌లైక్ మైన్– ” అని గొణుగుతూ పక్క గదిలోకి వెళ్లిపోయింది.

ఈ సారి నాకు పట్టలేని కోపం వచ్చింది. “జూలీ” అనుమతి తీసుకోకుండా, అడ్రస్ ఫోను నెంబర్లూ మార్చేశాను. అమ్మ నాన్నలతో సహా ఇండియాలో ఎవరికీ అందుబాటులో ఉండని జాగ్రత్తలన్నీ తీసుకున్నాను. రెండేళ్లు గడిచేయి. ఇద్దరికీ ఉన్నఉద్యోగాలు మానేసి స్వంత కంపెనీ పెట్టుకుని అధిక ధనార్జన పొందే అవకాశాలు తన్నుకొచ్చేయి. జూలీకి మాతృత్వమూ సిద్ధించింది. “మామ్ అండ్ డాడ్‌లతో మళ్లీ మాట్లాడుదాం. మనవడిని చూడ్డానికి రమ్మని రిక్వెస్ట్ చేద్దామని” జూలీ పదే పదే కోరుతున్న సమయంలో, మా పాత అడ్రస్‌కి నాపేరున వచ్చిన ఒక ఉత్తరాన్ని మా దగ్గర ఆ ఇల్లు కొనుకున్న అమెరికన్ మిత్రుడు పనికట్టుకుని వచ్చి నాకిచ్చి వెళ్లాడు. అది అమ్మకి అసలు బాగుండటం లేదని ఓసారి ఇద్దరూ వచ్చి వెళ్లండని నాన్న క్లుప్తంగా వ్రాసిన లేఖ. ‘ఒక్కడివే రమ్మన్నార’ని అబద్ధం చెప్పి ఒక్కడినే వచ్చాను, అప్పుడు సరిగా ఐదేళ్లక్రితం.

అప్పుడు ఇంటికి చేరుకునేసరికి అమ్మను బయట పడుకోబెట్టేశారు. అంతిమ క్షణాలొచ్చేశాయని గమనించి కాబోలు. అమ్మను చేరుకుని చేతుల్లోకి తల తీసుకునే సరికి ఆ స్పర్శకు ఒక్కక్షణం కళ్లు తెరిచింది. కొడుకుని గుర్తుపట్టినట్లుగా ఆ తడారిన కళ్లు మిల మిలలాడాయి. అటూ ఇటూ కదిలేయి. రాని కోడలిని చూద్దామని కాబోలు! వెంటనే నిరాశతో వాలిపోయాయి. వెంటనే మూసుకుపోయాయి. తలకూడా వాలిపోయింది. అమ్మ ‘కోడలిని మనవడిని చూడకుండా చనిపోయిందని’ అర్థమై భోరు భోరున ఏడిచేశాను. నాన్నతో ఎక్కువగా మాట్లాడలేని నైతిక దుర్భలత్వానికి గురయ్యాను. పదిరోజులపాటు అమ్మ అంత్యక్రియల కోసం ఊళ్లోనే ఉండిపోయాను. తిరిగి వెళ్లిపోయే రోజు వచ్చింది. ఊళ్లోపెద్దాయన ఒకరు, ఈ భరతుడిని మా దగ్గరకు తీసుకొచ్చేడు. ఇంటర్మీడియట్ మంచి మార్కులతో పాస్ అయ్యాడని తల్లీ తండ్రిలేని అనాథగా వున్న పై చదువులకు వెళ్లలేని దుస్థితి, అని చెప్పి ఆగిపోయాడు నాన్న ఏదో ఆర్థికసహాయం ప్రకటిస్తాడన్న ఆశతో.

అప్పుడు నా తలలో ఒక బ్రహ్మాండమైన ఐడియా మెరిసింది. వెంటనే అతడి

అంటే భరతుడి భుజం మీద ఆప్యాయంగా చెయ్యివేసి ఇలా అన్నాను. "ఎవరైనా స్వశక్తితో పైకి రావాలి. ఇప్పుడు నీకున్న విద్యార్హతకి మంచి ఉద్యోగం రాదు, ఇంకొంచెం చదవాలి. మానాన్నకు సంరక్షకునిగా అంటే 'కేర్‌టేకర్' గా ఉండటానికి ఒప్పుకుంటే, నెలకు రెండు వేలు ఇస్తాం. పెద్ద పనేం కాదు, ఆయనతోపాటు ఇంట్లో సాయంగా ఉండటమే - వేరే వంటమనిషిని పెడదాం - నీ భోజనం, ఆశ్రయం ఇక్కడే నన్నమాట. ఒక్క సంవత్సరానికి వచ్చిన జీతం డబ్బులతో వచ్చే ఏడాదిలో కాలేజీలో చేరొచ్చు. ఆరునెలల్లో నేను మళ్లీవచ్చి అన్ని ఏర్పాట్లూ చేస్తాను. సరేనా, నెలకురెండువేల జీతం, ఫ్రీ లాడ్జింగ్, బోర్డింగ్ ఏమంటావ్–"

"జీతం మాట ఎందుకులెండి "నాన్నగారి స్కూల్లోనే నేను చదువుకున్నాను. ఎంతో ప్రేమగా చూసేవారు. ఎన్నోసార్లు ఇంటి దగ్గర పాఠాలు చెప్పేరు. చాలా సార్లు నా ఫీజు కట్టేవారు. ఆరునెలలు లేదా ఒక సంవత్సరం మా గురువుగారి సేవ చేసుకోవటం నా ధర్మం అనుకుంటాను" అని భరతుడనే సరికి నాకు చాలా సంతోషం కలిగింది. "థాంక్యూ తమ్ముడూ" అనేశాను అప్రయత్నంగా - కాని ఐదేళ్లు గడిచేక ఇప్పుడిలా ఎవరో ఆకాశరామన్న హెచ్చరిస్తే ఇలా వచ్చి "అన్నయ్యా" అని పిలిచినందుకు విసుక్కున్నాను అనుకుంటూ కొద్దిగా పశ్చాత్తాప పడ్డాడు, రామారావు "సార్ - కాఫీ తీసుకోండి" భరతుడి మాటలతో ఆలోచనలు తెగి తలెత్తి చూశాడు రామారావు.. స్టూల్ మీదపెట్టిన తెల్లటి మల్లిపువ్వుల్లాంటి ఇడ్లీలను కొబ్బరి చెట్నీ, కారప్పొడిని, ఆవుపాల నెయ్యి ఉన్న గిన్నెను ఆనందంగా చూసి ఆరగించాడు. టిఫినే కాదు. కాఫీ కూడా చాలా బాగుంది. "లంచ్ కూడా త్వరలో రెడీఅవుతుంది సార్" అంటూ వెళ్లిపోయేడు భరతుడు. మరో గంటలోపే లంచ్ రెడీ అయిందని చెప్పటానికి వచ్చిన భరతుడి కేసి కొంచెం అపరాధ భావనతో చూస్తూ "ఏదో స్వంత కంపెనీ గొడవలతో బిజీ ఐపోయి ఇన్నాళ్లూ రాలేక పోయేను. నీ చదువు ఇంటర్‌తోనే ఆగిపోయిందాపాపం".

"అయ్యోలేదు సార్ - నాన్నగారు పట్టుబట్టి తనే స్వయంగా పాఠాలు చెబుతూ దూర విద్యావిధానంలో బి.ఏ. ఆపైన డబుల్ ఎమ్మేడిగ్రీలు పొందేలా చేశారు. బోధనా ఖర్చూ, అంతా ఆయనదే. ఆయన ప్రోత్సాహంతో ఈ మధ్యనే "ఇంకా ఏదో చెప్పబోయి ఆగిపోయేడు. 'సివిల్స్' కూడారాసి ఐ.ఏ.యస్" కి అర్హత

పొందానని చెప్పటం మానేశాడు. మళ్లీ గొంతు సవరించుకుని, ఒకనెల క్రితం నాన్న గారికి మొదటిసారి గుండె నొప్పి వచ్చింది. త్వరలోనే నయమైందిగాని మీమీద బెంగ ఎక్కువై పోయింది. క్రమంగా మానసికస్థైర్యం క్షీణిస్తూ వచ్చింది. ఎలాగైనా నాకొడుకుని “కాంటాక్ట్ చేయాలిరా. ఈ ఇంటికి ఇంత వైభవం నీకోసమే? ఇక్కడి జీవనశైలికి తీసిపోకుండా నువ్వు నీ కుటుంబంతో సుఖంగా ఉంటానికీ ఇప్పుడున్న సంపదంతా మీదే అని చెప్పాలిరా!..”అని పదే పదే వాపోతూంటే నాకున్న స్వల్ప పరిజ్ఞానంతో, ఫేస్‌బుక్‌లో గూగుల్‌లో శోధించి మీ ప్రస్తుత కంపెనీ అడ్రస్సు మీ పర్సనల్ ఈ మెయిల్ ఐడీ సంపాదించి ఆయనకిచ్చేను. మిమ్మల్ని కాంటాక్ట్ చేయగలిగారన్న మాట– అందుకే ఇప్పుడు మీరు వచ్చారనుకుంటున్నా, చాలా సంతోషం సార్ ఇప్పుడింక ఆయన సంపూర్ణ ఆరోగ్యవంతుడై పోవటం ఖాయం, గద్గద స్వరంతో భరతుడు చెప్పిన సమాచారం దిగ్భ్రాంతిని కలిగించింది. “శ్రేయోభిలాషి పేరుతో వచ్చిన ఈ మెయిల్ నాన్నగారే ఇచ్చి ఉంటారన్న అనుమానం మొలకెత్తింది.

“మీరు లంచ్ చేస్తానంటే భరతుడి మాటలకి అంగీకారయోగ్యంగా తలూపేడు. అతను కొసరి కొసరి వడ్డిస్తూంటే అన్నీ ఆస్వాదిస్తూ తిన్నాడు. వావ్! ఇంత తక్కువ సమయంలో ఇన్ని రకాలు ఎలా వండ గలిగాడో రెండు రకాల బిర్యానీలు, పనస బిర్యాని, మటన్ బిర్యానీ, నాటుకోడి కూర, రొయ్యల వేపుడు, గుత్తొంకాయ అరటికాయ వేపుడు, ముద్దపప్పు, గుమ్మడికాయ పులుసు, గడ్డపెరుగు అన్నీ ఇష్టంగా తిన్నాడు.“బ్రేవ్” మన్నాడు.

“మా అమ్మచేతివంటే తిన్నట్లైంది. థేంక్యూ తమ్ముడూ” ఈ సారి మనస్ఫూర్తిగా, అన్నాడు. దాంతో భరతుడి ముఖం వెలిగిపోయింది. కేరేజీ సర్దేసుకొని ‘వెళ్లొస్తాసార్’ నాన్నగారిని సాయంత్రానికల్లా తీసుకొచ్చేస్తా. బిల్ పేమెంట్‌కి ఏం ప్రాబ్లెం లేదు. ఫుల్ ఇన్సూరెన్స్ కవరేజి ఉంది లెండి. మీరు రెస్ట్ తీసుకోండి ఫ్లాస్క్‌లో టీ ఉంది. ప్లేటులో జీడిపప్పు పలుకులు, బిస్కెట్లున్నాయి. మీకు ఇష్టమైతే తాగడానికి ఫ్రిజ్‌లో మామిడిరసాలు జ్యూస్ లేదా లస్సీ ఉంది. తాటి ముంజెలూ ఉన్నాయి” అని చెప్పేసి సైకిల్ మీద వెళ్లిపోయేడు.

మంచం, మీదకు చేరుకున్న రామారావుకి చాలాసేపటివరకు నిద్రపట్టలేదు. ఈ ఆరేడు ఏళ్లుగా అమెరికా జీవిత వ్యామోహంలో 'తల్లితండ్రులకు ఎంత అన్యాయం చేశానో అన్న పశ్చాతాప భారంతో, తనని ఏదో విధంగా ఇంటికి ఒక్కసారికైనా రప్పించాలన్న సంకల్పంతో నాన్నే ఆ ఈ మైల్ "శ్రేయోభిలాషి" పేరుతో ఇచ్చి ఉంటారని అర్థమైంది. దాంతో మరింత అపరాధ భావం ముంచెత్తింది. ఎప్పటికో గాఢనిద్ర పట్టింది. ఎప్పటికో మెలకువ వచ్చింది, పక్క గదిలోంచి మాటలు వినపడుతూంటే. దిగ్గునలేచి నాన్నగారు గదిలోకి వెళ్లేడు. మంచం పక్కన వంగొని, నాన్న కాళ్లు పడుతూన్న భరతుడి భుజం మీద ఆప్యాయంగా చేతులు వేశాడు. కళ్లుతెరిచి చూసిన తండ్రి కాళ్లు నద్దుకున్నాడు. కూర్చోమని ఆయన సైగ చేస్తే పక్కమీదే కూర్చున్నాడు. ఎన్నో చెప్పాలనుకున్నా నోరు పెగల లేదు – "క్షమించండి నాన్నా" అని మాత్రం అనగలిగేడు.

"నేనెన్నాళ్లింకా ఉంటానో చెప్పలేను. నేను బలవంతం పెట్టనుగాని, ఇప్పుడు నువ్వు కుటుంబంతో సహా స్వదేశానికి తిరిగి వచ్చేసినా సరిపడేంత సంపద మనకుంది. అంతా నీపేరుమీద మార్చేయటం జరిగింది. తృణమో ఫణమో' ఇన్నాళ్లూ ఇంత బాగా చూసుకున్న భరతుడి కిద్దామనుకున్నా అతను 'ససేమిరా' ఒప్పుకోలేదు. అన్నట్టు నీకు తెలిసిందో లేదో మన భరతుడు సివిల్స్ రాసి "ఐ.ఏ.ఎస్‌కి "సెలక్ట్ అయ్యాడు. ఓ పదిరోజుల్లో శిక్షణకి రిపోర్ట్ చేయాలి. 'మిమ్మల్ని వదిలి వెళ్లను', అని భీష్మించుకుని కూర్చున్నాడు. నా మాట వినటంలేదు. మీరు ఇద్దరూ ఆలోచించుకుని ఏదోటి నిర్ణయించుకోండి. 'ముద్ద ముద్దగా మాట్లాడి ఆయాసం వచ్చి ఆగిపోయేడు సత్యమూర్తి. రామారావు తండ్రి మంచం పక్కనే దివాన్ మీద పడుకుని ఆ రాత్రంతా ఆలోచించుకున్నాడు. ఆ గదిలోనే చాప మీద పడుకున్నాడు భరతుడు కాబోయే ఐ.ఏ.యస్!

తెల్లవారు జామున సత్యమూర్తి మూలుగు వినపడి ఇద్దరూ లేచేరు. ఎగిసి పడుతున్న ఆయన గుండెలను కొడుకు రుద్దుతుంటే, భరతుడు గదిలో సిద్ధంగా ఉన్న ఆక్సిజన్ సిలిండర్‌ని ఎంతో అనుభవమున్న వాడిలా ఆయన ముఖానికి అమర్చి ప్రాథమిక చికిత్సలు చేస్తూనే, డాక్టర్‌కి ఫోన్‌చేశాడు. అరగంట లోపే

డాక్టర్ వచ్చేడు. ఓ గంటసేపు తంటాలు పడ్డాడు. కాని ఫలితం దక్కలేదు. “ఆకెళ్ల సత్యమూర్తి” సూర్యోదయం అయ్యేసరికి తుది శ్వాస విడిచేశారు. రామారావు భరతుడు భోరుమని విలపించేరు. కర్మకాండలు ఘనంగానే జరిగేయి. రామారావు వెళ్లేరోజు వచ్చింది. భరతుడిని పిలిచి“నేను నెలరోజుల్లోపే కుటుంబంతో సహా తిరిగి వచ్చేస్తాను. మీ వదినకి కూడా అంగీకారమే. అక్కడున్న వన్నీ అమ్మేసుకుని వచ్చేస్తాం–ఆసొమ్ము మాకు సరిపోతుంది, బాగా బతకడానికి, నాన్నగారి ఆశయాల కణుగుణంగా, సమాజ సేవ చేయడానికి కూడా. ఇకపోతే, నాన్నగారి ఆస్తి నాకు వద్దు. ఒకట్రస్టుని స్థాపించుదాం దానికి మన అన్నదమ్ములిద్దరం ‘ట్రస్టీలు’గా ఉండి సివిల్స్ కోసం ప్రయత్నించే పేద యువకులకి సాయం చేద్దాం నువ్వు ఐ.ఏ.యస్‌లో చేరి తీరాలి. ఏమంటావ్‌తమ్ముడూ? అన్నాడు –“సరే అన్నయ్యా అన్నాడు భరతుడు.

(రచనాకాలం – 2014)

# రాజకీయ భాష

నా భార్యభానుమతి ఎంతో మంచి ఇల్లాలు. అయితే తనకి ఇతరత్రా ఎన్నో సుగుణాలు ఉన్నా, నాతో సహా ఎందరో, ఈవిడితో ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిది”, అని భావించే దుస్థితి తెచ్చుకుంటోంది పాపం! తను నియంత్రించు కోలేకపోతున్న ఒకే ఒక పాడు అలవాటు మూలంగా ! ఒక మంచి భర్తగా, ప్రధాన బాధితునిగా, నేనే, తను ఈ వ్యసనాన్ని కొంత మేరకైనా తగ్గించుకునేలా చేయటం, ‘నా ధర్మం, కర్తవ్యం’ అనుకుని చేతనైన అన్ని ప్రయత్నాలు చేసినా, ఇప్పటి వరకు విఫలమవ్వటం మా ఇద్దరి దురదృష్టం! నోరు మంచిదైతే, ఊరు మంచి దవుతుందంటారు కదా. మరి మా ఆవిడ అందమైన ముఖంలో ముక్కూ నోరు కూడా చూడ చక్కగానే ఉంటాయి. ఎవరితోనూ పరుషంగా మాట్లాడదు. అయినా ఊరువాడా కూడా తనని ఇష్టపడలేని, ఆ మాట కొస్తే ‘దూరంగా ఉంటే శ్రేయస్కరం’ అనుకునే దుస్థితి ఎందుకు వస్తోందో, మీకు అర్థమయ్యేలా చెప్పాలంటే, ముందుగా మానవ సమాజంలోని అంటే దాదాపు అన్ని దేశాలలో ఉండే ఒక ప్రత్యేక వర్గానికి భాష, కుల మత ప్రాంతాల కతీతంగా ఉండే ఒక వైవిధ్యమైన భాషాశైలి, దాని ప్రత్యేకతలు, లక్షణాల గురించి ప్రస్తావించాలి.

మీకు తెలియదనిగాని, అనుభవం లోకి వచ్చుండదనే సాహసం చేయను గాని, నా సంతృప్తి కోసం, కథా గమనం కోసం, దాని లక్షణాలను, క్రోడికరించే ప్రయత్నం చేయనీయండి. (అన్నీభాషలలోనూ ఉంటుంది కదా, కొంత ప్రత్యేకంగా సౌలభ్యం కోసం “రాజకీయ భాష” అందాం ఇటువంటి భాష మాట్లాడే వర్గం రాజకీయ వాదులు మాత్రమే కాబట్టి (1) మాట్లాడే వ్యక్తి (అదే లెండి రాజకీయుడు) “వింటున్న వాళ్లకన్న తను ఎంతో తెలివైన వ్యక్తి ననే భ్రమలో లేదా అంచనాలో ఉండడం (2) సూటిగా స్పష్టంగా అందరికీ అర్థమయ్యేలా చెప్పటం తనకి నష్టమనే బలమైన నమ్మకంతో విషయాన్ని “డొంక తిరుగుడు”గా తిప్పి, తిప్పి చెప్పటం (3) వింటున్న వాళ్లు నమ్ముతారా లేదా అనే జంకు గొంకు లేకుండటం (4) ఈ భాషలో కొన్ని జంట పదాలు వాళ్లకే స్వంతమైన పడిగట్టు పదాలు చాలా వరకు సందర్భోచితం కాని రీతిలోనే వాడడం. (5) ఇంట్లో వాళ్లతోనో, ఆప్తులతోనో మాట్లాడే భాషస్థాయి,

శైలిలో కాకుండా, అసహజంగా ఉండడం. "ఆ యొక్క", "ఈ యొక్క", ఏదైతే ఉ ందో, వంటి వ్యర్థపదాలు, అనుచిత అసందర్భ ఊత పదాలు ఎక్కువగా వాడడం. (7) కేవలం శ్రోతలను రంజింప చేయడానికి చెప్పేదేగాని, అసందర్భంగా ఉండి, అభాసుపాలయ్యే రీతిలో ఉండడం. (8) శ్రోతలకు నచ్చని, విపరీత ప్రాస ప్రయోగాలతో కూడి ఉండడం. (9) ఎక్కువగా బడుధాతువు వినియోగం ఉండడం. (10) మొత్తానికి తనకు సహజంగా ఉన్నభాషపై వున్న పట్టుస్థాయి, పాండిత్యానికి మించిన పదాడంబరం ప్రాసా నైపుణ్యం ప్రదర్శించాలన్న యావతో స్థాయికి మించిన గ్రాంధిక భాష వాడటం. వగైరా, వగైరా ఇలా కాకుండా చక్కగా పండిత పామరుల నలరించేలా మాట్లాడే రాజకీయవాదులు అరుదు. మరి రాజకీయ భాషగురించి ఇంత చెప్పిన తర్వాత, ఒక ముఖ్య గమనిక ఏమిటంటే, నాకు తెలిసినంత వరకు, రాజకీయ వాదులు, ఈ కృత్రిమ "భాషశైలిని" కేవలం వాళ్లు చిన్నదో పెద్దదో ఏవో రాజకీయ సభలలో లేదా మైకు ముందు ఎక్కువ మంది శ్రోతలనుద్దేశించి ప్రసంగించి నప్పుడేగాని, స్వంత ఇళ్లల్లోగాని, రాజకీయేతర సందర్భాల్లో గాని ఉపయోగించరు. అలాంటి సందర్భాల్లో తమ సహజ ధోరణిలోనే, భాషలోనే మామూలుగానే మాట్లాడుతారు!

మరి అదేం ఖర్మోగాని, మా ఆవిడ, భానుమతి అన్నిసందర్భాల్లోనూ (రాజకీయ సందర్భాలు ఎలానూ ఉ ండవు), అంటే నాతో సహా బంధుమిత్రులతో గాని, ఇరుగింటి పొరుగింటి వాళ్లతో సహా తనతో సంభాషించే సాహసించిన అందరితోనూ, ఈ రాజకీయభాషలోనే మాట్లాడు తుండటమే, తన ఇతర సుగుణాలన్నీ మరుగుపడి పోవటానికి కారణం – నేనెంత చెప్పినా, బుజ్జగించినా ఈ వ్యసనాన్ని–నిత్యవ్యవహార సంభాషణల్లో కూడా మానుకోలేక పోతోంది. 'ఈ పాడు అలవాటు నేనంటున్న "రాజకీయ భాష" తనకు వాళ్ల నాన్ననుంచి సంక్రమించిందని నా అనుమానం. ఆయన ఒకదఫా పంచాయితీ వార్డు సభ్యుడిగా ఒకచిన్న పదవికి ఎన్నికవ్వటం మినహా పెద్దగా రాజకీయాల్లో వెలగలేదు. కానైతే నిత్యం ఇప్పటికీ ప్రాంతీయ రాజకీయవాదులతో సంచరిస్తూ ఉంటాడు. మా ఆవిడ సంగతికొస్తే అవకాశం దొరికినప్పుడల్లా"మీకు గాని ఎవరికి గాని, నా యొక్క ఈ చిన్నసరదా లేదా, 'సామాన్య యువతిగా నాకు రాజ్యాంగం ప్రసాదించిన మహత్తర

హక్కుని లాక్కునే స్వాతంత్ర్యం లేదు. మీకూ లేదు గాకలేదు. ఆ మాటకొస్తే త్యజించే హక్కు నాకూలేదు" అని రాజకీయ భాషలోనే సమాధానమిస్తూంటే, నేనేం చేయాలి? ఈ ఒక్క ఉదాహరణతో కొటేషన్‌తో మీకు సమస్య తీవ్రత అర్థం కాదు. మా ఆవిడి "రాజకీయ భాషాశైలి "ఎంత కృత్రిమంగా ఉంటుందో తన పదాడంబర ప్రాసా నైపుణ్యప్రదర్శనా కుతూహలం, "యాక్" అనుకునేంతగా ఎలా కంపరం కలిగిస్తుందో వినే వాళ్లకి అనేది, అర్థం కావాలంటే మరి కొన్ని ఉదాహరణలు, ఉదంతాల్ని చెప్పి విసిగించాలి. మరి కాసుకోండి. నవ్వుకోండి. కనీసం జాలి పడండి తొలుత తొలి రాత్రి నా అనుభవాన్ని సిగ్గు లేకుండా పంచుకో నివ్వండి. తను, అదేలెండి, నేను ఇష్టపడి తాళి కట్టిన నా భార్య భానుమతి అందరు పెళ్లికూతుళ్లు లా సిగ్గు లొలికిస్తూ తలొంచుకుని రాలేదు శోభనం గదిలోకి!! మరి ఎలా వచ్చిందను కుంటున్నారు? ఏదో ఒకపెద్ద బహిరంగ సభావేదికపైకి వస్తున్న రాజీయ నాయకిలా తలెత్తుకుని, (జయలలితలా) నిశితంగా అన్ని వైపులా చూస్తూ మాత్రమే కాదు, ఆత్మవిశ్వాసం ప్రదర్శించేలా నవ్వుతూ రెండు చేతులతో పదే పదే నమస్కారాలు చేస్తూ, మధ్యమధ్యలో కుడిచేతి రెండు వేళ్లతో "విక్టరీ సింబల్" అభినయిస్తూ ఎంతో హుషారుగా వచ్చింది.

వెంటనే నా భుజాల మీద చనువుగా చెయ్యివేసి "అందరూ బాగున్నారా... బాగున్నారా... బాగున్నారా..." అని పలికింది. (అలా హుషారుగా శోభనం గదిలోకి వస్తే మగడికి బెరుకుతనం' ఉండదని అనిపించి ఎవరూ చెప్పక పోయినా అలా చేశానని తను తర్వాతెప్పుడో చెప్పింది లెండి కాని నాకు బెరుకుతనం ఉంటుందని ఎందుకు అనుమానం వచ్చిందో చెప్పలేదు) అప్పుడు, అంటే శోభనం గదిలోకి మా ఆవిడ ఆగమనా దృశ్యం, తీరు వీక్షించినప్పుడు మతిపోయిందంటే నమ్మండి! 'ఏమిటిది, శోభనం గదిలో మేమిద్దరం తప్ప ఎవరున్నారని చుట్టూచూస్తోంది. ఇక్కడేదో పెద్ద ప్రజా సమూహం ఉన్నట్లుగా, లోపలికి వస్తూ వస్తూ అన్నేసి నమస్కారాలు పెట్టింది ఎవరికి? కనిపించని దేవతలకా? పైగా, 'బాగున్నారా అని ముమ్మార్లూ అడిగిందేమిటి? అది తన ఊతపదమా? ఎంతో ఆత్రంగా ఎదురు చూస్తున్న శృంగారానికి ఇదేం నాంది! ఇలా పలువిధాల ఆశ్చర్యపోవటం నా వంతైంది. మరుక్షణంలో తను ప్రారంభించిన సంభాషణతో నా ఆశ్చర్యానికి

ఇదమిద్ధంగా తెలియని ఆందోళన తోడైంది. నోట మాట రాని స్థితిలో వింటూ ఉండి పోయాను. తన తొలివేటుని మౌనంగా భరిస్తూ ఆ మాటల వేటు ఇలా సాగింది. "ఈ యొక్క మీ యొక్క ధర్మపత్ని సవినయంగా చిత్త శుద్ధితో, నిండు మనసుతో మనవి చేసుకునేదేదైతే ఉందో, ఆ మనవి ఏంటంటే మీ యొక్క ఏ ఆనతి, ఆదేశం (ఈ రెండు పదాలకి అర్థం ఒకటే) సందేశం ఏదైతే ఉందో, (ఆదేశం పదంతో ప్రాసకోసం సందేశం అన్నపదం జాలు వారిందన్నమాట), దాన్ని తు.చ.తప్పకుండా ప్రాణం ఉన్నంత వరకు (నాదా, తనదా) చివరి ఊపిరి వరకు (ప్రాసకాస్త కుదిరింది), ఉరివేసుకోమన్నాసరే, మీరు ఇష్టపడి (నిజమే) కష్టపడి (కేవలం ప్రాసకోసం) కట్టుకున్న దాన్ని అంటే నేను, కట్టుబడి ఉంటానని, గట్టుదాటనని, ఇందు మూలంగా ఇక్కడున్న సూర్య చంద్రుల సాక్షిగా (అన్ని తలుపులు కర్టెన్లు మూసివేసి ఉన్న గదిలో సూర్యచంద్రులు, అందునా ఒకేసారి జంటగా ఎక్కడున్నారు?) నేను వాగ్దానం చేయుచున్నాను.

"అయితే నన్నెలా చూసుకోవాలో నిర్ణయించుకునే అధికారం మీ విజ్ఞతకే వదిలేస్తున్నాను. నా ప్రియాతి ప్రియమైన నాధా,– అనాధా "అంటూ నావైపు కాకుండా పైకి చూస్తూ గడగడా పాఠం అప్పచెప్పినట్లు పలికేసింది. (ఈ భాషఏమిట్రా బాబూ రాజకీయ నాయికలా ఏక బిగిన గ్రాంధికంలో ఉపన్యాసమేమిట్రా నాయనా అనిపించి దిమ్మతిరిగింది. కొన్నిక్షణాల తర్వాత, అలా కలవరపడ్డ మదిలో ట్యూబులైటు వెలిగింది. అప్పట్లో నాతో సహా మాకుటుంబ సభ్యులెవరూ పెద్దగా పట్టించుకోని, అర్థం చేసుకోని, కాబోయే అత్తవారి ఊళ్లోనే ఉండే మా సమీప బంధువొకావిడ, వీడికి కాబోయే శ్రీమతి అన్నివిధాలా సరైనదే, గుణవతే గాని, కాస్త రాజకీయ భాష అలవాటున్నది – అని పెద్ద హెచ్చరికలా కాకుండా యధాలాపంగా చెప్పిన మాట గుర్తుకొచ్చింది. 'ఓహో, ఇదన్నమాట, 'రాజకీయభాష' అలవాటు ఉన్నదంటే అంతర్లీనార్థం, 'పర్వాలేదులే, క్రమంగా ఈ పాడు అలవాటు తగ్గించొచ్చులే' అయితే నా ప్రధమ కర్తవ్యం మర్చిపోరాదు. ప్రస్తుతానికి ఆ ప్రధమ లేదా తక్షణ కర్తవ్యానికి భంగం కలిగేది, ఏమీ చేయకూడదు, అనకూడదు. అని ప్రాప్తకాలజ్ఞతతో నిర్ణయించు కున్నాను.

ఆ తక్షణ కర్తవ్య నిర్వహణకు ఉపక్రమించాను. తను కూడా, మధ్య మధ్యలో పానకంలో పుడకల రీతిలో తన శైలిలో మాట్లాడటం కొనసాగించినా, శారీరకంగా బాగానే సహకరించింది. ఇంతకుమించి ఏం చెప్పాలి. మొత్తానికి తొలిరాత్రి బాగానే జరిగిందిలెండి. మూడు రాత్రుళ్లూ అదే రీతిలో గడిచాయి. "మధ్యే మధ్యే పుడకల సమర్పయామి" అన్నట్లుగా! అప్పగింతలప్పుడు ఎందుకనో, కుటుంబ సభ్యులు నలుగురైదుగురు మాత్రమే ఉన్నారు. "రాజకీయులకైతే" తమ ఎదుట అధిక సంఖ్యలో జనం ఉన్నప్పుడే ఆవేశం తన్నుకొస్తుంది. కాని ఈ విడికి అలాంటి 'శషభిషలేవీ' ఉండవు కాబోలు వామపక్షాల నాయకుల మాదిరిగా పిడికిలి బిగించి ఇలా రాజకీయ భాషలోనే "మంగమ్మ శపథం" చేసేసింది. "ఈ నాయొక్క ప్రియమైన ప్రజాబాహుళ్యం సాక్షిగా, చిత్త శుద్ధితో, ప్రమాణం చేయుచున్నాను. ఏమని ఏమని ఈ యొక్క నా యొక్క కంఠంలో ప్రాణం మిగిలి ఉన్న ఆఖరి క్షణం వరకు, నా యొక్క పుట్టిల్లు ఏదైతే ఉందో, దానికి, మెట్టిఇల్లు ఏదైతే ఉందో దానికి కూడా సరి సమానంగా కీర్తి ప్రతిష్టలు తెచ్చుటకు సర్వదా శతథాశ్రమిస్తానని, చెమటలోడుస్తానని శపథం చేస్తున్నాను." నాకు మళ్లీ తల గిరగిరా తిరిగింది!!!

ఈ మాటలకి వాళ్ల నాన్న ముఖం వికసించింది, కాని మా అత్తగారు, ఇద్దరు బావమరుదులు మాత్రం నా వంకజాలిగా చూశారు. దాంతో నాకు మా ఆవిడ దురలవాటుని క్రమంగా తగ్గించుకోవచ్చు నేమో అని అంత వరకున్న చిన్ని చిన్ని ఆశ ఒక్కసారిగా తగ్గిపోయింది! కాపురాని కొచ్చిన సంవత్సరం దాటినా, ఇప్పటికే తన ధోరణి మారలేదు. మా అమ్మ కూడా బాధితులు జాబితాలో తను కాపురానికి వచ్చిన రోజునే చేరిపోయింది. ఎలాగంటే మెట్టింట అడుగుపెట్టిన రోజునే మా ఆవిడ తనతో ఇలా అంది. "మాతంగీ" నా యొక్క ప్రియమైన "మాతంగీ" ఈ క్షణం నుండి మిమ్మల్ని సంపూర్ణంగా సమస్త బాధలు, వ్యధలు, బాధ్యతల నుండి విముక్తి రాలిని చేయుచున్నాను. మీరింక ఒకమూల చూసుకుని జపమాల తిప్పుకొనుడు కృష్ణా రామా అనుకుంటూ ఉండుడు" ఈ మాటల్ని అమ్మ సహజంగానే అపార్థం చేసుకుంది. 'ఈ మాయదారి కోడలు పిల్ల ఇక నుంచి అన్నిహక్కులు, పెత్తనం తనదేనని స్పష్టం చేస్తోందని పైకి మాత్రం "నాకే మంత వయసయి పోయిందని" అని మెల్లగా గొణిగింది. మూతి ముడుచుకుంది కూడా!

అప్పుడు నేను నానా తంటాలు పడి నాకిద్దరూ ముఖ్యమే – మీకు ఒకరికొకరు ముఖ్యమే – వయసుకి తగ్గట్లుగా, పని, బాధ్యతలు పంచుకోవచ్చు. పరస్పరాను రాగంతో అందరి కన్ను కుట్టేలా ఉండొచ్చు. అని ఇద్దర్నీ మెప్పించాను. ఒప్పించాను, గండం గడిచిందనుకున్నానో లేదో, మా అమ్మ అనుమానిస్తూనే అడిగింది. “నాపేరు అనసూయ అని తెలిసినా, మీ ఆవిడ“మాతంగీ” అని పిలుస్తోందేమిట్రా, నన్ను? అదేదో సినిమాల్లో సూర్యకాంతం లాంటి పాత్రా అది? నాకు కూడా“మాతంగి” అన్నది పురాణాల్లో ఒక గంధర్వ స్త్రీ పేరని సూచన ప్రాయంగా తెలుసుగాని అంతకు మించి తెలియదు. అందుకే మా ఆవిడినే అడిగాను ‘మాతంగీ అంటే అర్థం ఏమిటని “ఏమో నాకూ తెలియదు. ‘మదరిన్లా’ అంటారు కదా ఇంగ్లీషులో, అమ్మతో సమానురాలనే అర్థంలో, మాత అన్నపదం నుండి మాతంగి అన్న కొత్త పదం సృష్టించానంతే, అదే అర్థం వచ్చేలా’ అని అమాయకంగా నిజాయితీగా చెప్పే సరికి మా అమ్మకూడా నవ్వేసింది. “పోన్లే మాతాజీ” అని పిలుద్దువు గానిలే ‘మాతంగి’ అని వద్దులే అంది.

రాజకీయ భాషలో కొత్త పదాల సృష్టించే కోణం కూడా ఉంటుందని నాకా విధంగా తెలిసొచ్చింది, “మాయా బజారు” సినిమా జ్ఞాపకం వచ్చింది. పింగళి వారు గుర్తు కొచ్చారు. రాజకీయులు ఒకోసారి పొరపాటున గానీ అవగాహనా లోపంతో గాని సరైనది కాని పదం వాడి అభాసుపాలయ్యే ఉదంతాలు ఎన్నో వింటూంటాం గదా మనం, దంతాలు కనపడేలా నవ్వుకుంటాం కదా. తను కూడా ఒకసారి మా పక్కింటి ముసలాయనతో “మీరదృష్టవంతులు –మీ యొక్క కుమారులు తమ ప్రియమైన తండ్రియొక్క “వర్ధంతిని” అత్యంత ఘనంగా జరుపుట తథ్యం”. అనేసింది. (జయంతి అనబోయి ‘వర్ధంతి’ అనేసిందన్నమాట) దాంతో ముసలివాడై నప్పటికీ ఆరోగ్యంగానే ఉన్న ఆయనకి చాలా కోపం వచ్చింది. “నా మాటల్ని బేషరతుగా ఉపసంహరించుకుంటున్నానని” మా ఆవిడ రాజకీయ భాషలోనే వేడుకున్నా ఆయన కోపం తగ్గలేదు.

మరో ఉదంతం ఒకసారి కాస్త సాయం చేద్దామనే ఉద్దేశంతోనే తను వద్దన్నా బెండకాయలు తరుగుతున్నాను. అప్పుడే వచ్చిన నా మిత్రుడు “మాచెల్లెమ్మ మావాడితో

బాగానే ఇంటిపనులు చేయిస్తోందే!" అని పరిహాసంగా అన్నాడు. మా ఆవిడ ఆగ్రహోదుగ్రురాలై పోయింది. "ఏమిటిది ఇతగాడు ఈ వాచాలుడు ఇంత అపనింద ఈ యొక్క ఇంతి, పరమ పతివ్రత మీదవేయుచుంటే, ఏమిటి ఈ, నాయొక్క పెనిమిటి ఖండించుటలేదే! ఏమినా దౌర్భాగ్యం?" అంటూ బుడ బుడ కన్నీళ్లు కార్చేసింది. దాంతో ఆభాషకి. ఏడ్పుకి బెదిరిపోయి వాడు పారిపోయేడు, అయినా మా ఆవిడ 'ఏమండీ ఏమండీ శ్రీవారరూ అతడినిందలను ఎందులకు ఖండించబూనుకోలేదు? ఏల ఈ బేలను ఆదుకోలేదు? చెప్పుడు చెప్పుడు" ఇలా గ్రాంధికంలో తినేస్తూంటే నోట మాటరాక బిత్తరపోయేను. కాని అమ్మ సమయోచితంగా రంగంలోకి దిగి నన్ను రక్షించింది. "ఏవిధంబున ఖండించునమ్మా– నా యొక్క ఈ కుమారుడు? సుకుమారుడు – సున్నిత మనస్కుడమ్మా నా యొక్క కుమారుడు? ఒక పక్క చక్కగా ముదురు బెండకాయలను, నదురు బెదురు లేకుండావీడు, ఖండోప ఖండాలుగా నరికినది, నూరుశాతం నిజంకాదా? అట్టి, నిజాన్ని ఎటుల మరుగుపరచ గలడమ్మా నీ మగడు, సత్యసంధుడు "అంది ముదురు గ్రాంధికపాకంలో..

కోడలు ఒక్కసారిగా విస్తుపోయింది!! ముఖంలో ఆశ్చర్యం, కోపం, ఉక్రోషం, ఒక దాని తర్వాత ఒకటి తన్నుకొచ్చాయి!!! అవమానభారంతో తల వంచేసుకుంది. కళ్లల్లో నీళ్లు సుడులు తిరిగేయి. చాలాసేపు దీర్ఘాలోచనలో మునిగిపోయింది. అమ్మ, నేను ఊపిరి బిగబెట్టుకుని తననే చూస్తూ ఉండిపోయాం. ఆఖరికి భానుమతి, నా ప్రియసతి మా ఇద్దరి వంకచూస్తూ బాగా సిగ్గులొలికిస్తూ చిరునవ్వులు చిందించింది! అమ్మయ్యా, అనుకున్నాను. అయితే మా అమ్మ ఈ సదవకాశాన్ని వదులుకోలేదు. ఒడిసి పట్టుకుంది. "అమ్మా లోకంలో ఏమాత్రం అనుకరించదగని వాళ్లు రాజకీయ వాదులు. వాళ్ల భాషని అసలే అనుకరించరాదు. ఒక ఉదాహరణ చెబుతావిను తల్లీ. ఎవరైనా మరణించారన్న వార్త విన్నప్పుడు రాజకీయవాది "నా ఆప్తమిత్రుని అకాల మరణానికి "దిగ్భ్రాంతి చెందా" నంటాడు. మరణించినాయన్ని, తన రాజకీయ ప్రత్యర్థి కాబట్టి "వాడు చస్తే దేశం బాగుపడుతుందని గతంలో ఎన్నోసార్లు అతడే దూషించిన సంగతి అందరికీ తెలుసు.

అదలా ఉంచి చనిపోయిన వ్యక్తి తొంభై ఆరేళ్లవాడు! అకాల మరణమేంటి నా బొంద! అంతేకాదు ఆయన నాలుగేళ్లుగా క్యాన్సర్ వ్యాధికి చికిత్స తీసుకుంటున్నాడు. రెండేళ్ల క్రితమే, చికిత్స చేస్తున్న డాక్టర్లు లాభం లేదని పెదవి విరిచేశారు. అయినా ఇంతకాలం ఆ ముసలాయన నెట్టుకొచ్చాడు, ఈ వేళో రేపో అన్నట్లుగా అన్నది అందరికీ తెలుసు. మరి "దిగ్భ్రాంతి చెందటమేమిటి? కాని రాజకీయ వాదులు, "దిగ్భ్రాంతి" చెందాననే అంటారు. ఎవరు పోయినా "సంతాపం" అని ఏడవచ్చుకదా – రాజకీయ వాదులకి కొన్ని పడిగట్టు పదాలుంటాయి. ఇదీ అంతేనన్న మాట. వాళ్లెన్నో వ్యర్థపదాలు, 'ఆ యొక్క' 'ఈ యొక్క' లాంటివి వాడతారు. గొప్పవాడను కోవాలని వచ్చీరాని గ్రాంధిక భాషలో మాట్లాడుతారు. శ్రోతలకు అర్థంకాని "తికమకభాషే" మాట్లాడుతారు, కావాలనే. సామాన్యులం సామాన్యులతోనే కలిసి మెలిసి ఉండాల్సిన వాళ్లం కదా మనం, అందరికీ అర్థమయ్యేలానే మాట్లాడితేనే మంచిది కదా నీకు గ్రాంధిక భాషంటే మోజు ఉంటే అది ఇంకో విధంగా ఉపయోగించుకో. మంచి గ్రంధాలు రాసుకో అయితే నిత్యవ్యవహారాల్లో, సంభాషణల్లో అందరికీ అర్థమయ్యే భాషే మాట్లాడాలి గ్రాంధిక మెందుకు? రాజకీయ వాదుల భాష శైలినెందుకనుకరించాలి?

ఎందుకు అభాసుపాలవ్వాలి? ఆలోచించుకో, వింటున్న వాళ్ల స్థాయిభాష మాట్లాడితే మనదేం పోతుంది? నువ్వు పని మనిషితో అంటూంటావు. "నాయొక్క ఈ పాత్రలు శుచిగా శుభ్రంగా భద్రంగా తీర్చబడవలెను "అని. అది అర్థం కాక పైకి చూస్తుంది. "అంట్లు బాగా తోము" అని అందరిలా అంటే సరిపోదా? ఆలోచించుకోనా బంగారు తల్లీ, కృత్రిమ భాషవద్దమ్మా, "ఎప్పుడూ ఎవరితోనూ" అంత అధికంగా అమ్మ మాట్లాడటం నేను విన్లేదు. ఆశ్చర్యపోయాను. మా ఆవిడ అత్తగారి మాటలన్నీ సావధానంగా వినటం మరింత ఆశ్చర్యాన్ని కల్గించింది! శ్రీమతి మళ్లీచాలా సేపు దీర్ఘాలోచనలో పడలేదు. ప్రతివాదం చేయలేదు. మౌనంగా లోపలికి వెళ్లిపోయింది. అయితే వెళ్తూ వెళ్తూ మా ఇద్దరి వైపు చూస్తూ ఇంచక్కా నవ్వింది! చూడాలి మరి ఏమవుతుందో ఏమోమో, ఆవిడతన రాజకీయ భాషాశైలి గ్రాంధిక భాషా ప్రీతి వగైరా క్రమంగా నైనా మార్చుకుంటుందో లేదో? నాకైతే నేను సాధించలేనిది మా అమ్మ సాధించింది అనే ఆశ కలుగుతోంది. చూడాలి మరి.

# విలా(సి)పిని !!!

ఎదురుగా గోడమీద, గంధపు చెక్కల పూల దండవేసి ఉన్న మానాన్న ఫోటోకేసి చూస్తూ అంటోంది మా అమ్మ "మీకేం, అర్జెంటుగా, దర్జాగా వెళ్లిపోయేరు పైకి – నేను చస్తున్నాన్నిక్కడ, మీ కొడుక్కి సంబంధాలు చూడలేక. ఒక్కటీ కుదిరి చావటం లేదు, వీడికి పాతికేళ్లు నిండినా బోల్డు డబ్బులు మింగిన ఆ పెళ్లిళ్ల పేరయ్యగాడూ రాలేదు ఈ మధ్యన "ముండాకొడుకు" ముదనష్టపోడు.....

అప్పుడు నాకు నవ్వాగలేదు ఎందుకంటే సదరు పేరయ్యగాడు, "ముండా కొడుకు" ముదనష్టపోడు", అప్పుడే ఇంట్లోకివస్తూ, అమ్మ మాటలు వినేసి గతుక్కుమని, బిక్కుమంటూ, నాకేసి చూస్తూండటం గమనించి నందు వలన. అంతలోనే, అమ్మ కూడా చూసిందాయన్ని. అయినా ఏమాత్రం తడబడకుండా "మీరా, పేరయ్య శాస్త్రిగారూ. దయచేయండి. కూర్చోండి. వేరే పేరయ్యను సంప్రదించటం, నాదే తప్పులెండి. అది సరేగాని, ఇంకేద్కైనా సంబంధం చెప్పడాని కొచ్చారా? మీకిప్పుడే, నిమ్మకాయ పిండిన మజ్జిగ తీసుకొస్తా – స్థిమితంగా కూర్చోండి" గడగడా అనేసి లోపలికి వెళ్లిపోయింది అమ్మ"ముండాకొడుకు" "ముదనష్టపోడు", వగైరా వగరా తిట్లు, తన గురించి కాదన్నమాట, అని నమ్మాడో లేదో తెలియదుగాని, పేరయ్యశాస్త్రి నెమ్మదిగా కుర్చిలో కూర్చున్నాడు. మజ్జిగ కోసం ఎదురుచూస్తూ ....

ఈ మజ్జిగ సేవించండి" శాస్త్రిగారూ అంటూ గ్లాసు ఆయనకిచ్చి తాగేవరకు ఓపిగ్గా ఆగి – " ఇక్కడే ఉన్నాడుగా, అమ్మాయి ఫోటో మా వాడికిచ్చి మిగతా విషయాలు నాకు వివరంగా చెప్పండి" అంటూ సోఫాలో ఆసీనురాలైంది. నా చేతికొచ్చిన ఫోటోలోని అమ్మాయి అందాన్ని, విశాల నేత్రాల్ని, అంగ సౌష్టవాన్ని పరవశంగా చూస్తూ "ఈ సంబంధమైనా కుదిరేలా చూడు దేవుడా", అని మనసులో ప్రార్థిస్తూ, చెవులు వాళ్లిద్దరి సంభాషణ వినడానికి కేంద్రీకరించాను.

"అమ్మగారూ, మీ వంశ ప్రతిష్ఠలకు తగ్గ సంబంధమండి ఇది. శాఖాపరమైన తేడాలు లేవు–సగోత్రికులు కాదు. జాతకాలు బ్రహ్మాండంగా కలిసాయి. వాళ్ల ఇంటిపేరు "హాసం"–తండ్రి తాసిల్దారు. ఇంకా మూడేళ్ల సర్వీసు ఉంది. తప్పక

“డిప్యూటీ కలెక్టర్” అవుతాడు. ఇకపోతే, ఆయనకు ఊళ్లో ఏడెకరాల మామిడితోట పదెకరాల కొబ్బరి తోట, ఇంకో పదెకరాల మాగాణి, పట్నంలో ఒక మేడ ఉన్నాయండి.

“వాళ్లకెంతున్నదన్నది కాదు ముఖ్యం, మనకి ఎంతిస్తారో చెప్పండి” తెచ్చి పెట్టుకున్న విసుగుతో అంది అమ్మ ఆయన వాక్ప్రవాహానికి అడ్డుపడుతూ ముఖం మాత్రం వెలిగిపోతోంది,

“ఆయ్! మరండీ, అమ్మాయి” వాళ్ల ఏకైక సంతానమండీ తదనంతరం అంతా అంటే, అంతా, మనదేనండి ఇప్పటికిప్పుడు, ఎంతివ్వాలో మీరు మీరూ మాట్లాడుకుంటే మేలు ఈ “ముండాకొడుకు” “ముదనష్టపోడు” అలాంటివి మాట్లాడట మెందుకనుకున్నానండీ”

శాస్త్రి మాటల్లోని శ్లేషని, ఉక్రోషాన్ని గ్రహించే ఉంటుందిగాని, పైకి గంభీరంగా అంది అమ్మ“వచ్చే సోమవారం, పెళ్లిచూపులకి,”అన్నీమాట్లాడు కోవడానికి వస్తామని చెప్పండి అన్నట్టు మీరూ మాతో ఉంటారు. సరేనా!

“శుభం అమ్మగారూ అమ్మాయి అందచందాలు ఫొటోలో కన్న చాలా మెరుగ్గా ఉంటాయి. అబ్బాయికి నచ్చి తీరుతుంది. ఇకపోతే “తక్షణ కట్న కానుకల” విషయంలోనూ మీకు ఆశాభంగం ఉండదు. ఐతే, మీకో ముఖ్యమైన విషయం చెప్పి తీరాలి. ఉభయుల దగ్గర కొంత సొమ్ము తీసుకోవటం మా పెళ్లిళ్ల పేరయ్యల వృత్తి ధర్మం. నిజాయితీగా, అన్నిగుణ దోషాలు దాచకుండా చెప్పటం, ఈ పేరయ్య శాస్త్రి వ్యక్తిగత నిబద్ధత” అని కాసేపు మౌనంగా ఉండిపోయాడాయన.

“ఇంత అందమైన అమ్మాయికున్న గుణమేమిటో “బస్ట్‌ఫొటోలో కనపడని ఆ దోషమేమిటో” అని నామనసు కొట్టుమిట్టులాడింది. కాని అమ్మ నిబ్బరమైంది కదా, మామూలుగానే, ఆయనవైపు చూసింది – ‘అదేంటో చెప్పేడు’ అన్నట్టు

“ఆయ్! అన్నీ నిజాయితీగా చెప్పడానికే కదండీ, నేనున్నది వాళ్లింటి పేరు “హాసం” అని చెప్పేను కదండి. దానికి తగ్గట్టుగానే అమ్మాయి తల్లిదండ్రులు, దగ్గరి బంధువులంతా, ఎప్పుడూ, జాలీగా కిలకిలలాడుతూ, నవ్వుతూ ఉంటారు చాలా సరదాగా ఉంటారు ”

"ఏమిటీ అసందర్భపు ప్రేలాపన' అని నాకనిపించి, ఏదో అనేలోగానే, ఆయనే మళ్లీ అందుకున్నారు. "కారణమేంటో తెలియదుగాని అమ్మాయి మాత్రం ఎప్పుడూ "యమా సీరియస్‌గా ఉంటుందండి ఎప్పుడో గాని నవ్వదండీ"

"అదో పెద్ద లోపమా? ఎప్పుడూ వెకిలిగా నవ్వుతూ ఉండటం, పెద్ద గొప్పా? హుందాగా, అదే, సీరియస్‌గా ఉండటం పెద్దదోషమా?" "నేను అందామనుకున్న మాటలు అమ్మే అనేసింది.

"అంటే అమ్మగారూ అమ్మాయి నెత్తి మీద ఎప్పుడూ ఓ పెద్ద నీళ్లకుండ ఉంటుందండి. కళ్లల్లో నీళ్లు జలపాతాల్లా రెడీగా ఉంటాయండి. మరీ ఏడుపుగొట్టు ముఖం అని చెప్పను గాని, ముక్కూ ముఖం, కళ్లు అన్నీ చాలా కళగానే ఉంటాయి గాని" చాలా జాలిగుండె కాబోలు పిల్లది" అని అమ్మ సాలోచనగా అనేసరికి నా గుండె కొంచెం కుదుటబడింది.

"శుభం, సుభద్రమ్మ గారూ! మీరంత విశాల హృదయంతో ఆలోచిస్తూంటే, అంతకన్న కావాల్సిందేముంది! అన్నట్టు మీకాబోయే వియ్యంకుడి గారి పేరు "హాసం హర్షవర్ధనరావు" ఇకపోతే అమ్మాయి పేరు "విలాసిని" కాదంటే స్నేహితులు సరదాగా "విలాపిని" అంటూంటారట" అని ఇంకో చిన్న బాంబు పేల్చాడు. నాతో బాటు, అమ్మ కూడా కొంచెం గతుక్కుమంది. కాని ఇద్దరం పైకేమీ తేలలేదు. నాకైతే ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ సంబంధం వదులు కోరాదని బలంగా అనిపించింది. ఫోటోలో అమ్మాయి అంత నచ్చింది మరి!

అమ్మ శాస్త్రిగారికి, సంభావన బాగానే ముట్టజెప్పి సాగనంపింది. ఆయన బయటికి వెళ్లేవరకు ఓపిగ్గా ఆగి నాన్నఫొటో ముందుకి వెళ్లింది "ఏమండీ, ఇందాక, అనవసరంగా తిట్టేను గాని పాపం, ఈ శాస్త్రి పొట్టివాడైనా గట్టివాడే "మంచి సంబంధమే తెచ్చేడీసారి. ఎలాగైనా ఈ సంబంధం కుదిరితే బాగుంటుంది కదండీ ఏమంటారు? నాన్న ఫొటో ఎలాగూ జవాబు చెప్పదు కాబట్టి, నేను కూడానిశ్శబ్దంగా ఉండిపోతే బాగుండదని, "ఔనమ్మా కుదిరితే ఎంతబాగుంటుందో" అనేశాను గాని, 'తను ఏమంటుందో ఏమిటో, అని భయమేసి లోపలి గదిలోకి జారుకున్నాను వెంటనే.

సోమవారం పెళ్లిచూపులకి వెళ్లేం 'హాసం' వారు చాలా సాదరంగా ఆహ్వానించేరు. అమ్మాయిని చూపించక ముందే, తదనంతరం మాకు వచ్చే ఆస్తిపాస్తుల వివరాలతో బాటు, "తక్షణం" ఎంతిస్తారో చెప్పేసే సరికి, అమ్మ ముఖం దేదీప్య మానంగా వెలిగి పోయింది. 'దాన్దేముంది అన్నయ్యగారూ, వదినగారూ" అని వరసలు కూడా కలిపేసింది. కాబోయే కోడలికి ఇంటిపని, వంటపని బాగానే వచ్చునని పనిలోపనిగా నిర్ధారించుకుంది. విలాసిని దర్శనం ఎప్పుడవుతుందా అన్న ఆతృత నాకు బాగా పెరిగి పోసాగింది. ఇంతలో లోపల్నుండి ఎవరో వెక్కి వెక్కి ఏడుస్తున్నట్లు వినిపించి, నేను, అమ్మ, విలాసిని తల్లితండ్రుల వైపు ఆశ్చర్యంగా చూశాం. హాసం హర్షవర్ధనరావు గారు ముఖంలో దరహాసం చెదరకుండా మెల్లిగా గొంతు విప్పేరు.

"శాస్త్రిగారు కొంతైనా చెప్పి ఉంటారు మా "చిట్టితల్లి" గురించి. తను'హాసం' వారి కుటుంబంలో తప్ప బుట్టింది – ఎందుకనో ఎప్పుడూ "శోకం" లోనే ఉంటుంది. తనకేమైనా చిన్నకష్టమొచ్చినా కన్నీళ్లు జలజలా కార్చేస్తుంది. ఇంకెవరికైనా, ఆఖరికి, ఇంట్లోని కుక్క పిల్లకో వీధిలోని పిల్లి పిల్లకో ఏ చిన్న కష్టమొచ్చినా, దు:ఖం వచ్చేసి వెక్కి వెక్కి ఏడ్చేస్తుంది. ఇది కొత్తవాళ్లకి వింతగా ఉంటుందేమో గాని మాకు అలవాటైపోయింది. ఇంకో తమాషా ఏమిటంటే, తనకి ఆనందం కలిగినా తట్టుకోలేదు. ఏదో ఆనందభాష్పాలు కార్చటం కాదు, భోరున ఏడ్చేస్తుంది. ఇప్పుడు, తనకి ఇంత మంచి సంబంధం ఖాయమై పోయిందన్న ఆనందంతో మరీ గట్టిగా, ఏడిస్తే బాగుండదన్న ఇంగితం ఉంది కాబట్టి కొంత కంట్రోలు చేసుకుంటూ వెక్కి వెక్కి ఏడుస్తోందన్నమాట? కొంచెం తేరుకున్నాక అమ్మాయిని తీసుకొస్తాం లెండి" ఆయన అంత యధాలాపంగా చెప్పిన మాటలకి నాతో బాటు అమ్మకూడా కొంచెం కంగు తిన్నది. మేం ఏదో అనేలోపునే, ఆయనే మళ్లీ చిద్విలాసంగా చెప్పేడు. "ఇలా జాలి గుండె ఉండటం, చిన్న చిన్న విషయాలకి కూడా తరచుగా దు:ఖించటం పెద్ద దోషం కాదనుకుని, వచ్చిన మీరు, చాలా విశాల హృదయులు. అన్నట్టు ఇంకో విషయం. వయసు పెరుగుతున్న కొద్దీ, మా అమ్మాయిలోని ఆ చిన్నదోషం తగ్గుముఖం పడుతోందని చెప్పను గాని కొంత నియంత్రణలో ఉంచుకోగలుగుతోంది. అంటే చిన్నప్పుడు భోరున ఏడ్చేసే విషయాలకి

ఇప్పుడు కొద్దిగా కొద్దిగా వెక్కి వెక్కి ఏడ్చి, త్వరలో మామూలైపోతోంది. పుష్పవతి అయిన తర్వాత కొంత మార్పు వచ్చింది. పెళ్లై పరిసరాలు, మారితే మరింత మార్పు వస్తుందని నా మనసు చెబుతోంది"

మా ముఖాల్లో ఉన్న సానుకూల భావాల్ని అర్థం చేసుకుని "ఏయ్! ఇంకా ఆలస్యం చేయకండి. వెంటనే అమ్మాయిని ప్రవేశపెట్టండి" అని లోపలి వాళ్లని తాసిల్దారు దర్జాలో ఆదేశించాడు.

కాసేపటికి మెరుపుతీగలా 'విలాసిని' హాల్లోకి వచ్చింది. సజల నేత్రాలతో ఆగకుండా వస్తున్న ఏడ్పుని దిగమింగు కోవడానికి విశ్వ ప్రయత్నాలు చేస్తూ మా అమ్మకాళ్లకి దణ్ణం పెట్టి ఒద్దికగా నా ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంది. పదే పదే కొంగుతో కళ్లు తుడుచుకుంటున్నందువలన వంపు సొంపులన్నీ నాకు కనువిందు చేసాయి. ఎత్తైన పరువాలు, లోతైన పొట్ట, సన్నని నడుము స్పష్టా స్పష్టంగా కనబడి నాకు పిచ్చెక్కించాయి. ఆపారవశ్యం ముందు సందర్భానికి తగని తన శోకరసం దిగదుడుపై పోయింది! పైగా సమయం గడిచే కొద్దీ, ఆశోకం తగ్గింది, పూర్తిగా పోలేదు గాని, అమ్మ అడిగిన మొదటి ప్రశ్న 'నీపేరేమిటమ్మా' అన్నదానికి గద్గదస్వరంతో జవాబిచ్చి నందువలన కాబోలు, నాకు "విలాసిని" అనిగాక, "విలాపిని" అనే వినిపించింది. అయినా ఏమీ పట్టించు కోలేదు. అమ్మ అడిగిన అన్ని ప్రశ్నలకి వినయ విధేయతలతో బాటు కన్నీళ్ళు కారుస్తూ తగు సమాధానాలిచ్చి బాగా మెప్పించింది.

"నువ్వూ ఏమన్నా అడగాలంటే స్వేచ్ఛగా అడగవోయ్" అని శాస్త్రిగారు బాంబు పేల్చేసరికి, వెంటనే ఏమీ లేదన్నట్లు తల అడ్డంగా ఊపేను. దాంతో, ఆనందం పెల్లుబుకిపోయి కాబోలు విలాసిని వినీవినిపించ కుండా కాస్త రోదించింది.

"ఈ సంబంధం ఖాయం" మా అమ్మ అనవలసిన మాటనేనే అనేశాను కాదు అన్నానను కున్నాను, కాని మాటలు నోట్లోనే ఉండిపోయేయి. అంతలో అమ్మ గంభీరంగా "పలికింది" త్వరలో ముహూర్తాలు పెట్టించండని దాంతో విలాసిని భోరున ఏడ్చేసింది!! వాళ్ల అమ్మ నాన్న ఇతరులు కూడా ఆనందభాష్పాలు కార్చేరు. విలా(పి)సినిని లోపలికి తీసుకుని పోయేరు ఏడ్పు ఆపటంలేదని గమనించి! వారం

గడవక ముందే, మా పెళ్లి రంగ రంగ వైభోగంగా జరిగిపోయింది. పెళ్లి పీటల మీదవిలాసిని విలపించలేదో, భాజా భజంత్రీల చప్పుళ్లలో ఎవరికీ వినిపించ లేదో గాని, తరచుగా కళ్లు తుడుచుకోవటం మాత్రం అందరూ గమనించేరు. పెళ్లికూతురి సంగతి తెలిసిన వాళ్లు 'ఈ పిల్ల ఇంతే అదేంటోగాని! "అనుకుంటే తెలియని వాళ్లు' 'సాంబ్రాణి ధూపం పడక కన్నీళ్ళు వస్తున్నాయి పాపం,"అనుకున్నారంట!

పెళ్లిలో లేదా శోభనం సందర్భంగా జరిగిన అన్నీ విశేషాలు, పూసగుచ్చినట్లు చెప్పటం బాగోదుగాని, అప్పగింతలప్పుడు మా ఆవిడ విలాసిని, పెద్దగా విలపించకుండా, కన్నీళ్లు మాత్రం కార్చుకుంటూనే, గంభీరంగా ఉండిపోవటం, నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. అప్పుడుతనని చూస్తే, మొదటి సారి బడికి పోయే చిన్న పిల్లలోని, ఆందోళన, ఉత్సాహం భయాలతో కూడిన గందరగోళం కన్పించింది.

మా ఇంట్లో తొలిసారిగా కుడికాలితో గడప దాటినప్పుడు కొంచెం పట్టు తప్పితే, నేను వెంటనే తను పడిపోకుండా పొదివి పట్టుకున్నప్పుడు విలాసిని ముఖంలో సిగ్గుతో కూడిన చిరునవ్వు మెరిపింది. ఒక్కక్షణం మాత్రమే. ఆ క్షణం తర్వాత కూడా ఏడవలేదు. మామూలుగా లోపలికి వెళ్లింది.

అప్పగింతల తర్వాత, కారెక్కించే ముందు "మావగారు" ఆప్యాయంగా నా భుజాలు తట్టుతూ, అన్నమాటలు అప్రయత్నంగా జ్ఞాపకం వచ్చేయి. శోక భాష్పాలో, ఆనందభాష్పాలో ఇదమిత్థంగా చెప్పలేంగాని కన్నీళ్ళ కారుస్తూ అప్పుడాయనే మన్నారంటే "బాబు అల్లుడు గారూ, శోకాన్ని గాని, ఆనందాన్ని గాని మనసులోనే అదిమి పెట్టుకోలేక పోవటం, బహుశా మనుష్యులందరికి ఉండే బలహీనతను కుంటాను. కాదంటే, ఆ బలహీనత జన్మత: మా అమ్మాయిలో కొంచెం ఎక్కువ స్థాయిలో ఉంటూ వచ్చింది. ఇది కొంత దోషమే గాని, మిగిలిన అన్నీ విషయాల్లోనూ, చాలా సహజంగా ఉంటుంది తన ప్రవర్తన. తనని మార్చడానికి మేమేమీ ప్రయత్నాలు చేయలేదను కోవద్దు. డాక్టర్లకి, మానసిక నిపుణులకీ చూపించాం. 'ఇదే రోగమూ కాదు ఆమె వ్యక్తిత్వానికి సున్నిత మనసుకి ప్రతీక. కాలక్రమేణా జీవితంలో కొన్ని డక్కా మొక్కీలు తిన్నాక, భిన్న విభిన్న అనుభవాలు కలిగిన తర్వాత కొంత వరకు మార్పు రావడానికి అవకాశం ఉంది. పెళ్లయ్యాక అత్తారింటికి వెళ్లాక, చాలా

మార్పు రావచ్చు. అంతే గాని ఏ చికిత్సా అవసరం లేదని ఆ డాక్టర్లు నమ్మబలికేరు. దైవానుగ్రహం ఉన్నందువల్లనే, మీ వంటి సహృదయుల ఇంట్లో పడుతోంది. ఈ మాటలు కారులో ఉన్న విలాసిని వినలేదు కాని నా పక్కనే ఉన్న అమ్మ విన్నది.

"మీరేం ఆందోళన చెందకండి అన్నయ్యగారూ" అని భరోసా ఇచ్చి కార్లో కూర్చుంది ఏధైర్యంతో అంత భరోసా ఇచ్చిందో నాకప్పుడు అర్థం కాలేదు! విలాసిని కాపురానికి వచ్చిన రోజునే, అమ్మ నన్ను పక్కకి పిలిచి రహస్యంగా చెప్పింది, ఎంతో ఆత్మవిశ్వాసంతో" "ఒరే కన్నానువ్వు అమ్మాయిని బాగా చూసుకోవాలి. తనకే మాత్రం అభద్రతా భావం, రాకుండా జాగ్రత్తపడు. ఎప్పుడూ సంతోషంగా ఉండేలా ప్రవర్తించు. ఎప్పుడూ విసుక్కోవద్దు. నువ్వే నా ప్రాణం అన్నట్టుగా ఉండాలి నీ మాటలు చేతలు. అయితే, నేను మాత్రం కొంతకాలం "తేడా"గా ఉంటాను. ఒక్కోసారి అమ్మలా, అత్తలా, స్నేహితురాలిగా, డాక్టరులా ఉంటాను. తనకి తగు చికిత్స, "మార్గదర్శనం" చేస్తాను. అంతా నాకొదిలేయ్ తప్పకఫలితం ఉంటుంది మధ్యలో కలుగజేసుకోకు సుమా"

అమ్మచికిత్స వివిధ రూపాలలో ప్రారంభించింది. కాపురానికి వచ్చిన మొదటినెల రోజులలో, కొత్తగా హాస్టల్‌లో చేరిన ఆడపిల్లలా, భయం భయంగా, ముభావంగా, గందరగోళంలో ఉన్నట్టుగా ఉండేది విలాసిని. వార్డెన్, అదే అత్తగారంటే భయభక్తులతో, బెరుకుగా ఉండేది. ఈ క్రమంలో, పుట్టింటిలో ఉన్నప్పటి తన సహజ గుణాలను, అంటే, మామూలు విషయాలకి కూడా, అతిగా స్పందించటం, శోకించటం వంటి వాటిని, అనివార్యంగా కొంత నియంత్రణలో ఉంచుకునే ప్రయత్నాలు చేసి కొంత వరకు సఫలమయ్యేది. అంతేకదా, చిన్న పిల్లలైనా కొత్త వాళ్లింటికి వచ్చినప్పుడు ఇంట్లోలా అల్లరి చేయరుగదా కొంత కంట్రోల్‌లో ఉంటారు గదా. పరిసరాలు చుట్టూ ఉన్న వారి స్వభావాల్లోని వ్యత్యాసాలు వలన ఎవరైనాసరే తమసహజస్వాభావిక గుణాల్ని కొంత నియంత్రణలో ఉంచుకుంటారు. అదే జరిగింది విలాసిని విషయంలో! అలా అని ఒక్కసారిగా తన పాత గుణాలన్నీ మారిపోలేదు. మరుగున పడిపోలేదు. అప్పుడప్పుడు బయటపడుతూనే ఉన్నాయి.

ఒకసారి నేను నీ బుగ్గలు ఎంత ఎర్రగా ఉన్నాయో! అంతకు మించి పెదాలు" అని ఇంకా ఏదో అనబోతుంటే, వెంటనే ఆనందం పట్టలేక వెక్కి వెక్కి ఏడ్చింది. నేను నోరుమూసుకున్నాను. ఇంకోసారి, అత్తగారు "నువ్వు నేను లేకుండానే చేసిన కూర చాలా బాగా కుదిరింది తల్లీ" అంటే ఏడ్వలేదు. నవ్వుతూ కన్నీళ్లు కార్చిందంతే అంటే వెక్కి వెక్కి ఏడిస్తే అత్తగారికి కోపం వస్తుందన్న భయం పనిచేసినట్లే గదా!

ఒకసారి మా పని మనిషి "అమ్మాయి గారి జడఎంత పెద్దదో అని అమ్మతో అంటుంటే విని, మామూలుగా ఏడ్చేయబోయి అమ్మ "కళ్లెర్ర" చేసుకునే సరికి తమాయించుకుని ఏడ్పు దిగమింగేసుకుని, కళ్లు తుడుచుకుంటూ పక్కకి వెళ్లిపోయింది. దాంతో నాకు అమ్మకి విలాసిని కొంచెం కొంచెంగా తన దోషాన్ని తెలుసుకుంటోందని, దాన్ని నియంత్రించుకోవడానికి సకల ప్రయత్నాలు చేస్తోందని అర్థమైంది. ఇంకేముంది. అమ్మ క్రమంగా విజృంభించింది. ఉదయం 9గంటల నుండి రాత్రి 8 గంటల వరకు నేను ఇంట్లో లేని సమయాల్లో తన చికిత్సా పద్ధతులను విస్తరించింది. రాజేంద్రప్రసాద్‌ది గాని అల్లరి నరేష్‌ది గాని ఏదో ఒక సినిమా కేసెట్ రోజుకొకటైనా చూడటం కోడలికి నిర్బంధం చేసింది. మధ్యాహ్నాల్లో అత్తా కోడళ్లు సీరియల్సు టీవీలో చూడటం అలవాటు చేసింది. హాస్య సన్నివేశాలు వచ్చినప్పుడు తను పడిపడి కడుపు చెక్కలయ్యేట్లు నవ్వి, మొహమాటానికి కోడలు చిరునవ్వులు చిందించడం చూసి తృప్తి పడేది. ఇక విషాద సన్నివేశాలొచ్చినప్పుడు కోడలు తనంటే ఉన్న భయం భక్తితో పెద్దగా ఏడ్చేయకుండా కళ్లు వత్తు కోవటంతో సరిపెట్టటం చూసి తృప్తి పడింది. అప్పుడప్పుడు "రివర్స్‌డోస్", 'ఏంటీడోస్' చికిత్సలు కూడాచేసేది. ఒకే ఉదాహరణ చెబుతాను.

ఒకసారి అమ్మ విలాసిని దగ్గరికి ఏడ్చుకుంటూ వచ్చి "ఇప్పుడే ఫోను వచ్చింది. "మా అన్నయ్య చెప్పేడు. వాళ్ల పక్కింట్లో వాళ్లు పెంచుకునే కుక్క కాలులో ముల్లు దిగిందంట – మంగలి వచ్చి ముల్లు తీసేసినా ఇంకా కుంటుతోందట పిచ్చి ముండ. మొన్నవేసవిలో వెళ్లినప్పుడు ఎప్పుడూ నా కాళ్లు నాకుతూనే ఉండేది పాపం–"అని భోరుమంది.

"ఊరుకోండి అత్తయ్యా! ఇంత చిన్న విషయానికంత ఏడుపా? ఎవరన్నా వింటే బాగోదు" అని మెత్తగా అంది. విలాసిని మాటలు విన్న నేను అమ్మ ఒకరి ముఖాలొకరు చూసుకుంటూ తృప్తిగా నవ్వుకున్నాం – కాని అమ్మపైకి "నాకే బుద్ధులు చెబుతున్నావా" అని కసురుకుంది, బాగా గట్టిగా కఠినంగా కాని విలాసిని కొద్దిగానైనా ఏడవటం గాని, కన్నీళ్లు పెట్టుకోవడం గాని చేయలేదు! పైగా అత్తగారివైపు ముసి ముసి నవ్వులు చిందిస్తూ చూసింది.

"నా దోషానికి మీరు చేసిన చికిత్స ఫలించింది అత్తమ్మా. ఇదే పని నా చిన్నప్పుడు మా అమ్మచేసి ఉంటే బాగుండేది అందుకే మీరు మా అమ్మ కన్న ఎక్కువ" అంటూ అత్తగారిని కౌగిలించుకుంది. సందర్భోచితంగా ఆనంద భాష్పాలు కార్చింది. కాని ఈ సారి అమ్మకే ఆపుకోలేనంతగా ఏడుపు వచ్చింది.

నాకు ఏడుపు రాలేదు కాని పట్టపగ్గాలు లేని సంతోషం కలిగింది. ఏమైనా ఇప్పుడు "విలా'సిని" "విలాపిని" కాదు. అలాగని ప్రతీ చిన్న విషయానికి పడిపడినవ్వే "ఉల్లాసినీ" కాదు. విషాద సంఘటనలకి ప్రతిస్పందించని, కన్నీళ్ళు తెచ్చుకోని కఠినురాలూ కాదు. ఇదివరలోలా కాకుండా శోకహాసాల అసమతౌల్యతను అధిగమించి అమ్మపుణ్యాన కొంత, స్వీయ అవగాహన వలన మరింత సామాన్య స్థాయిని పొంద గలిగింది – ఇంత కన్నా ఏం కావాలి?

(రచనా కాలం – 2016.)

## "సీమంతం వేడుకలో కరోనా కథాకమామిషూ...."

దేశం: భారత్ ప్రదేశం: తెలుగు రాష్ట్రాల్లో ఒకటి ప్రాంతం: రాష్ట్ర రాజధానికి చేరువలో ఉన్న"సిరిపల్లె" అనే గ్రామం స్థలం/సభా ప్రాంగణం: గ్రామ'సర్పంచ్' మాధవరావు గారి మామిడితోట కాలం: "కరోనా కాలం" సమయం: 2020 ఆగష్టు శ్రావణ శుక్రవారం. సభ ఉద్దేశ్యం: మాధవరావుగారు తన స్వాగతోపన్యాసం లో చెబుతారుగా విందామా మరి!

మాధవరావు: "అందరికీనమస్కారం స్వాగతం సుస్వాగతం సభా ప్రారంభం లోనే కరోనా కారణంగా మరణించిన మన పోస్ట్‌మాన్ 'రంగయ్య', 'లాక్‌డౌన్' కారణంగా ఇక్కడ అర్ధాంతరంగా ఆగిపోవాల్సి వచ్చి, మనమంతా సాయపడినా, స్వస్థలానికి తిరిగి వేళ్ళేలోగా, 'కరోనా' పొట్టన బెట్టుకున్న పంజాబ్‌కి చెందిన లారీడ్రైవర్ "కర్తార్‌సింగ్‌ల' అకాల దుర్మరణానికి సంతాప సూచకంగా మనం రెండు నిమిషాలు మౌనం పాటించుదాం. "సరే మళ్ళీ సభకు నమస్కారం. అందరికీస్వాగతం – ఈ సమావేశానికి 'స్థానిక పోలీస్ అధికారుల' నుండి 'అనుమతి' పొందాను, 'భౌతికదూరం' 'ముఖ కవచాలు (మాస్క్‌లు) సభికుల, సభయొక్క 'శుచి శుభ్రతలు' (సానిటైజేషన్) వగైరా అన్ని నిబంధనలను పాటిస్తామని రాత పూర్వకంగా హామీ ఇచ్చి, ఈ సమావేశం పేరుకి, నా కోడలు చి॥సౌ॥ లక్ష్మీకళ 'సీమంతం' సందర్భాన్ని పురస్కరించుకుని ఏర్పాటు చేసిందే అయినా ఆ కుటుంబ ఉత్సవ లాంఛనాలన్నీ మా ఇంట్లోనే పూర్తి చేసుకుంటామని, తోటలో నిర్వహించే సమావేశంలో మా కుటుంబ సభ్యులతో సహా ఇతర అతిథుల మొత్తం సంఖ్య' యాభై'కి మించ నివ్వమని, సభని దాదాపుగా ఒక "కోవిడ్ అవగాహనా" సదస్సు గానే నిర్వహిస్తామని, అన్ని నిబంధనల్ని తప్పక పాటిస్తామని, నేను హామీ ఇచ్చిన మీదటనే, అనుమతి లభించిందని గ్రహించి, ఎప్పటిలా ఊళ్ళో అందర్నీ కాకుండా, చాలా పరిమితంగా ఆహ్వానించినందుకు క్షమించ గోర్తాను – ఇప్పుడు నా కోడలు "లక్ష్మీకళ"ని గ్రామంలోని వారందరి తరపున, ఇద్దరు ముత్తయిదువులు లాంఛనంగా ఆశీర్వదిస్తారు – అంతా రెండు నిమిషాల్లో ముగిసిపోతుంది.........

"నా కుటుంబం తరపున, అందరికీ ధన్యవాదాలు – ఇంకొక్క కుటుంబ అంశం చెప్పిన తర్వాత "కరోనా సభ"ని ప్రారంభిద్దాం. అదేమిటంటే నా కోడలు పంజాబ్‌కి చెందిందని మీ అందరికీ'చూచాయ'గా తెలుసనుకుంటున్నా. అయితే, తనకి తల్లితండ్రులు లేనందున, 'సీమంతం' ఇక్కడే చేసినట్లుగానే ప్రసవానికి కూడా పుట్టింటికి పంపించం – ఇక్కడే జరుగుతుంది. పుట్టే బిడ్డకు, మన ఊరిపేరు కలిసి వచ్చేటట్లు, బాలికైతే 'సిరిచంద్రిక' అని బాలుడైతే, 'సిరిచంద్రరావు' అని పెట్టాలన్నది నా కొడుకు కోడలి అభిలాష– అందుకు మీ అనుమతి కోరుతున్నాను...

"ధన్యవాదాలు, ఉన్నచోటనే నిర్దేశిత 'చదరా'ల్లో కుదురుగా కూర్చుని ముమ్మారు. చప్పట్ల ద్వారా మీ 'అనుమతి' ప్రసాదించినందుకు........"ఐతే, మరో విషయంలో కూడా మీ అనుమతి తీసుకోవాలి. అదేంటంటే ... ఇప్పటికే మన గ్రామం ఘనత, 'దేశమంతటా మోగిపోతోందంటే నమ్మండి! కరోనాకి ముందే, మన గ్రామానికి 'స్వచ్ఛభారత్' అవార్డు, కొత్తగా ఎక్కువ మొక్కలు నాటిన 'రికార్డు' లభించాయన్నది మీకు తెలిసిందే. అలాగే, కరోనా 'లాక్‌డౌన్' కాలంలో మనం అన్ని నిబంధనల్ని తు.చ. తప్పకుండా పాటించామని, ఆ కష్టకాలంలో ఒకరికొకరు సహకరించు కోవటమే గాక కాలి నడకన నగరం నుండి తమ స్వస్థలాలకు మన గ్రామం మీదుగా వెళ్తున్న ఎందరో "వలస కూలీలకు" ఎన్నో విధాల స్వచ్ఛందంగా సాయ పడ్డామని మన గ్రామ ప్రజలకి ఎంతో మంచిపేరు వచ్చింది.

కొన్ని ప్రాంతీయ, జాతీయ టీవీ ఛానళ్ళలో కూడా అందుకు సంబంధించిన కథనాలు వచ్చాయి కూడా! మరికొంత సమాచారం సేకరించడానికి కాబోలు, నగరానికి చెందిన ఒక ప్రముఖ తెలుగు టీవీ ఛానల్ ప్రతినిధులిద్దరు ఈ మధ్యాహ్నం వచ్చి నన్ను కలిశారు. ఈ సాయంత్రం జరగబోయే సమావేశం గురించి చెబితే, తాము కూడా పాల్గొంటామని, కొంత చిత్రీకరణ (షూటింగ్) చేసుకుంటామని అభ్యర్థించారు.

వారిద్దరు ఏదో సినిమాలోని జంట పేర్లే లెండి, "కెమెరావుమన్ మంగతో రాంబాబు" – వారిద్దరూ ఇప్పుడు నా పక్కన నిలబడిఉన్నారు. వారిద్దరూ ఈ సమావేశంలో పాల్గొనడానికి, కొంత చిత్రీకరించుకోవడానికి మీ సమ్మతి ఉంటే చప్పట్ల ద్వారా తెలియజేయండి...........

శభాష్ చాలా గట్టిగా కొట్టారు చప్పట్లు– వాళ్ళు మన సమావేశాన్నంతటినీ కాకపోయినా, కొన్నిభాగాలు చిత్రీకరించుకుంటా రనుకుంటాను. ఇప్పుడే లైవ్‌లో ప్రసారం కాదు తర్వాత, బాగా ఎడిట్ చేసుకొని కొన్ని 'ఎపిసోడ్'లుగా ప్రసారం చేస్తారేమో, రేపో, ఎల్లుండో వీలును బట్టి వాళ్ళ పని మొదలు పెట్టేలోగా, "మగాళ్ళు తలలు దువ్వుకోండి. ఆడవాళ్ళు పౌడర్ అద్దుకోండి" అని చెప్పను. పళ్ళికిలిస్తూ ఉండమని కూడా చెప్పను "మాస్క్"లు మాత్రం తీయకుండా ఉన్నచోటనే క్రమశిక్షణతో కూర్చోండని మాత్రం అభ్యర్థిస్తున్నాను. కెమెరా ఎవరి మీద ఎప్పుడు 'ఫోకస్' అవుతుందో మనకి తెలియదు – అంతా జాగ్రత్తగా సహజంగా ఉండండి– సరేనా...

ధన్యవాదాలు... ఇప్పుడు సభా నిర్వాహకుడిగా, ఈ గ్రామ సర్పంచ్‌గా కొన్ని మాటలు చెప్పాల్సిన బాధ్యత నామీద ఉంది కదా... మరి మన ఊరు "సిరిపల్లె" గురించి క్లుప్త పరిచయం రాష్ట్ర రాజధానికి కొంచెం దూరంగా "అంతర్జాతీయ విమానాశ్రయా"నికి బాగా చేరువలో ఉన్నా, ఇంకా పల్లెశోభలు పూర్తిగా అంతరించిపోని గ్రామం మనది. ఊరినిండా చుట్టూ, పూల, కూరగాయల, మామిడి, సపోటా తోటలు, వరి, పత్తి పండే చేలు ఉన్నాయి. ఊళ్ళో మేడలు, మిద్దెలతో పాటు, కొన్ని పాతకాలపు మండువా లోగిళ్ళు, నూతన నిర్మాణాలు, గుడిసెలు కూడా ఉన్నాయి. భిన్నమతాలు, వృత్తులు, కులాల ఆర్థికస్థాయిల, ప్రజలు ఐకమత్యంగా ఉంటున్నాం. అన్నిపార్టీల వాళ్ళూ ఉన్నారు ఇకపోతే... ఏదో ఉపాధి కోసమో, విలాసాలకోసమో రోజూ నగరానికి పోయి, రాత్రికి తిరిగి వచ్చేసే వాళ్ళూ ఉన్నారు మన ఊళ్ళో మరో విషయం నగరంలో "జూబ్లీహిల్స్, ఫిల్మ్‌నగర్‌లో ఉన్న విలాస గృహాలకు తోడుగా, మన ఊరి శివార్లలో కొందరు ప్రముఖులు, సినిమా వాళ్ళు, అతిథి గృహాల తో పాటు ఇళ్ళు (ఫార్మ్‌హౌస్) నిర్మించుకున్నారు. వాటికి కాపలాదారులుగా మాత్రం మన ఊర్లోవాళ్ళని కాకుండా, ఇతర ప్రాంతాల వారిని ఏరికోరి తెచ్చుకుంటారన్నది మనకి నచ్చని విషయమనుకోండ. మన ఊళ్ళో ఐకమత్యం, చక్కని కుటుంబ విలువలు ఉన్నాయని గర్వంగా చెప్పగలను. ముందే చెప్పానుగా, ఈ సమావేశం పేరుకే నా కోడలి సీమంతం కోసం గాని, అసలు ధ్యేయం కరోనా గురించి చర్చించుకోవడమే!

మాధవరావు: "సభికులలో మరొకరు మాట్లాడే ముందు, మన ఊరువాడే అయిన ప్రస్తుతం న్యూయార్క్‌లో ఒకప్రముఖ యూనివర్శిటీలో బోటనీ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న డాక్టర్ పతంజలిగారు "ఈ రోజు ఉదయం అంటే వాళ్ళకి సాయంత్రం లెండి ఫోన్ చేశారు. ఈ రోజు సాయంత్రం సభ గురించి చెబితే సంతోషించి మనకోసం తన "స్వర సందేశాన్ని" అదే "వాయిస్ మెసేజ్"ని ఇచ్చారు. ఈ సందేశాన్ని మన గ్రామ ప్రజలకి వినిపించటం సందర్భోచితంగా ఉంటుందని పించింది.

స్వరసందేశం: "నా స్వగ్రామ ప్రజలందరికీ నమస్కారాలు. కరోనా చైనాలో పురుడు పోసుకున్న కొన్నివారాలకే అమెరికాకి పాకి ఎందరికో సోకి, ఈ "అగ్రరాజ్యాన్ని" అతలాకుతలం చేసేసిందని మీకు తెలుసనుకుంటున్నాను. చైనాకి, పొరుగు దేశం భారత్‌లో కన్నా ఎక్కువ వేగంగా, తీవ్రంగా అమెరికాలో విధ్వంసకాండ సృష్టించడానికి ప్రధాన కారణం ఇక్కడి ప్రజలకు రోగనిరోధకశక్తి చాలా బలహీనంగా ఉండటం. దానికి ఏకైక కారణం, ఆహార విహారాల్లో వాళ్ల విశృంఖలత ఈ దేశంలో ఇప్పటికీ "కరోనా" పెద్దగా కట్టడి కాకపోవడానికి కారణం, అధ్యక్షుడిగా ట్రంప్ అనబడే మూర్ఖుడు ఉండటం. అదలా ఉంచితే, ఈ దేశంలో కరోనా ప్రబలిన తొలి రోజుల్లోనే నాకూ, నా భార్యకూ కూడా సోకింది. స్వయంగా కొంత "పలుకుబడి" ఉన్న అధికారైన ఆమె ఎంత ప్రయత్నించినా ఇద్దరిలో ఏ ఒక్కరికీ ఏ హాస్పిటల్ లోనూ "అడ్మిషన్" దొరకలేదు. మరప్పుడు అన్ని హాస్పిటల్స్ నిండిపోయున్నాయి. "ఇప్పటికే కిక్కిరిసి ఉన్న రోగులతో చస్తున్నాం మీ చావేదో ఇంట్లో చావండి. మా దగ్గర ఆక్సిజన్ సిలిండర్ల కొరత ఉంది. వెంటిలేటర్లూ సరిపోవటం లేదు. ఇంట్లోనే ఉండిపోండి – అప్పుడప్పుడు ఫోన్‌చేస్తే ఏ మందులు వాడాలో చెబుతాం" అన్నారు. వృక్షశాస్త్రంలో ప్రొఫెసర్‌గా నాకుకొంత తెలుసు. ఐనా, ఆంధ్రాలో ఉన్నమా మేనత్త కామేశ్వరమ్మ గారికి ఫోను చేసి ఏయే వంట దినుసులు "విషజ్వరాలకి" మందులుగా పనికి వస్తాయో, ఏయే ఆకులతో కషాయాలు తయారు చేసుకోవచ్చో వివరంగా తెలుసుకున్నాను. వేపాకు, పసుపు, జిందాతిలస్మాత్ చుక్కలు వేసి మరిగించిన నీటి ఆవిరి పట్టించుకోవటం వంటి చిట్కాలతో, కషాయాల సేవనంతో, మేం ఇద్దరం వారంరోజుల్లో బాగైపోయాం. అప్పుడప్పుడు, పారాసిటమాల్ మాత్రలు, రోజూ విటమిన్‌మాత్రలు కూడా వేసుకున్నాం లెండి. కరోనా నెగిటివ్ వచ్చిన

తర్వాత కూడా 14 రోజులు గృహనిర్బంధంలో కొనసాగాములెండి. ఈ విషయాలతో పాటు, ఆధ్యాత్మికత కూడా మనం "రోగ విముక్తులం" కావడానికి తోడ్పడుతుందని మీకుచెప్పమని మా శ్రీమతి పదేపదే కోరింది. ఇక ఉంటాను. నమస్తే... జై హింద్.

మాధవరావు "పతంజలి"గారు చెప్పింది విన్నారుగా నా అభిప్రాయంలో కరోనా మరీ ఎక్కువ తీవ్రస్థాయిలో సోకని వారికి గృహవైద్యం సరిపోతుంది గాని మరీ తీవ్రంగా సోకినవారు ఆయుర్వేదం గానీండి, లేదా ఆధునిక వైద్యం కానివ్వండి పొందటం మంచిది – అలక్ష్యం. అశ్రద్ధ కూడదు. మన ఊళ్ళో మరణించిన పంజాబ్, లారీడ్రైవర్ "కర్తార్‌సింగ్" అంత్యక్రియలు ఆయన కుటుంబసభ్యుల కోరికమేరకు, ఇక్కడే జరిపించినందుకు ఆయన అభినందించారు. అలాగే లాక్‌డౌన్ సడలింపులు మొదలైన తర్వాత నగరం నుండి, ఈ ప్రాంతం నుండి 'కాలినడక' న వెళ్ళిపోతున్న వలస కూలీలకు మనకు సాధ్యమైన మేరకు ఆహారం పొట్లాలు, ఇతర సదుపాయాలు, కల్పిస్తున్న విషయం చెబితే, ఇంకా ఆనందించి అటువంటి సేవాకార్యక్రమాలు మనం కొనసాగించేందుకు వీలుగా ఇరవైవేల డాలర్లు మన పంచాయితీ బోర్డుపేరున, రేపే పంపిస్తానని చెప్పారు. కావున ఆ సేవా కార్యక్రమాలు కొనసాగుతాయి

'సరే, ఇప్పుడు మన ఊర్లో అందరికీ "తల్లోనాలుక" వంటివాడు, "రాజారావు"గారు తన "కార్పొరేట్ హాస్పిటల్" అనుభవాన్ని చెబుతానంటూ చిట్టీ పంపించారు. వారు ఉన్నచోటు నుండే మాట్లాడుతారు...

రాజారావు: నేను నగరంలో నా కొడుకు కుమారస్వామి ఇంటికి చుట్టపు చూపుగా వెళ్ళి, జ్వరం వచ్చి ఒక కార్పొరేట్ హాస్పిటల్‌లో "కరోనా చికిత్స" పొంది, తర్వాత మరో పద్నాలుగు రోజులు అక్కడే "హెూం క్వారంటైన్"లో ఉండి పదిరోజుల క్రితమే స్వగ్రామానికి తిరిగి వచ్చిన సంగతి మీకు తెలుసు. ముందుగా నా గ్రామ ప్రజలందరికీ ఈ సభాముఖంగా "ధన్యవాదాలు" తెలియ జేసుకోవటం నా కర్తవ్యం ఎందుకంటే, ఈ రోజులెలా ఉన్నాయంటే, కరోనాతో చనిపోయిన వారికి అంత్యక్రియలు చేయటానికి ఎన్నో శ్మశానాల్లో అనుమతి లభించటం లేదు కోలుకున్న రోగుల్ని ఇంటికి తీసుకుని వెళ్ళటానికి స్వంత కుటుంబ సభ్యులే ఇచ్ఛగించటం లేదు. అయితే నేను కరోనా బారినపడిన వాడినని తెలిసి కూడా, ఈ గ్రామప్రజలు

నాపట్లఎటువంటి వివక్షా చూపించలేదు సరికదా తిరిగి వచ్చాక ఎంతో ఆదరించారు. రోగాన్ని ద్వేషించాలి గాని, రోగిని కాదని మనస్ఫూర్తిగా చాటారు. అందుకు అందరికీ కృతజ్ఞతలు. ఇకపోతే, నాకు జ్వరం, వళ్ళునొప్పులు వస్తే నా కొడుకు కంగారు పడిపోయాడు. ముందు గవర్నమెంటు హాస్పిటల్ "గాంధీ"కి వెళ్ళాం. "బెడ్లులేవు" చేర్చుకోలేం అన్నారు. అయితే, మా ఎదురుగానే ఓ డజనుమందిని మినిష్టర్లు, ఎమ్మెల్యేల సిఫార్సు లేఖలు తెచ్చిన వాళ్ళని చేర్చుకున్నారు! చేసేదేం లేక ఎన్ని ప్రైవేట్ హాస్పిటల్స్‌కి తిరిగినా అదే జరిగింది. ఆఖరికి శ్రీకృష్ణుని తల్లిపేరు మీదఉన్న "దేవకీ" హాస్పిటల్ వారి ఒక కొత్త శాఖలో చేర్చుకున్నారు. రెండులక్షల రొక్కం ముందే కట్టించుకుని కరోనా టెస్ట్ చేశారు, "పాజిటివ్" వచ్చిందని చెప్పారు. ఐ.సి.యు.లో ఉంచుతాం, కుటుంబ సభ్యులెవరూ చూడటానికి కూడా అనుమతి ఉండదని చెప్పారు. వారంరోజుల వరకూ ఎవరికీ చూపించ లేదన్న మాట నిజమేగాని, నన్ను జనరల్ వార్డులోనే ఉంచారు. కొత్త శాఖ కాబట్టి డాక్టర్లు, ఇతర సిబ్బంది, సదుపాయాలు పెద్దగా లేవు. నాకిచ్చిన చికిత్స ఏంటో తెలుసా "రోజూ నాలుగుసార్లు ఆవిరి పట్టించటం, మూడుసార్లు పల్స్, బి.పి. చెక్ చేయటం". ఒకసారి ఏదో ఇంజక్షన్ ఇచ్చి అది చాలా ఖరీదైందని చెప్పారు. "డోలో టాబ్లెట్లు", విటమిన్‌మాత్రలు మింగించేవారు. అంతే వారం తర్వాత నా కొడుకుకి మీ నాన్నకి 90 శాతం కరోనా తగ్గిపోయింది. మా దగ్గరకి కొత్త రోగులు వస్తున్నారు. ఇంటికి తీసుకుపోవచ్చు. కొన్ని మాత్రలిస్తాం, మీ బిల్లు ఏడులక్షల నలభైవేల మూడు రూపాయలైంది. మరి ఐ.సి.యు. చికిత్సంటే మాటలా?" అన్నారు. బిల్లుపూర్తిగా కట్టకపోతే మా నరకం నుండి మీ నాన్న చచ్చే వరకూ విడుదల ఉండదు – ముఖం మీద కరోనా ముద్రపోదు' అని బెదిరించారు కూడా!....

"అయ్యా అదీ సంగతి ఇప్పటికీ, నాకు వచ్చింది, తగ్గింది "కరోనా" అవునో కాదు తెలియదు. కరోనాను "మహమ్మారి" అని అందరు అంటున్నారు. నా పాలిట మాత్రం అది మహోపకారి!! ఎలా అంటారా? నా శ్రీమతి సూర్యకాంతం, ఇన్నాళ్ళూ ఎంతో యోగ్యురాలైన మా కోడలు "సక్కుబాయి"ని ఆరళ్ళు పెద్దగా పెట్టలేదు గాని, అస్సలు ఇష్టపడేది కాదు – మరిప్పుడైతే, కోడల్ని నెత్తిమీద పెట్టుకుని పూజిస్తోంది, నా పసుపు కుంకుమలు కాపాడిన దేవత అంటూ మరి నా హాస్పిటల్

బిల్ కట్టడానికి ఉత్తమురాలైన నా కోడలు, తన నగలన్నీ మనస్ఫూర్తిగా అమ్మి, ఆ సొమ్ము “దేవకి”కి చెల్లించింది లెండి. అంత ఖర్చు అయింది గాని, ‘మా కుటుంబానికి, ‘కరోనా’ పరోక్షంగా మేలుచేసినట్లే కదామరి?’

మాధవరావు: అంత కష్టంలోనూ, తన హాస్య చతురతను కోల్పోని రాజారావు గారిని అభినందిస్తూ, ఇప్పుడు మన ఊళ్ళోని మహిళామండలి కార్యదర్శి శ్రీమతి కరుణని కరోనాపై తన కవితను చదవమని ఆహ్వానిస్తున్నాను. కరుణ స్వయానా నాకు మేనకోడలు కాబట్టి చనువు తీసుకుని చెబుతున్నా ‘అమ్మా! మేమంతా నువ్వు ఉచ్ఛరించే ప్రతి అక్షరం, పదం, వాక్యాన్ని శ్రద్ధగా వింటాం కాబట్టి ఏదీ ఒకసారి కన్నా ఎక్కువసార్లు అనవలసిన పలకవలసిన అవసరం ఉండదు” మాపై కరుణ జూపు తల్లీ– ఏదీ రిపీట్ చేయొద్దమ్మా

**కరోనాపై కరుణ కవిత**

ఒకేవైపు చూస్తే పాడు కరోనా చేస్తున్న చేటు –
రెండోవైపు కూడాచూడు, అది పరోక్షంగా ఎన్నిచేసిందో మేళ్ళు
ఇప్పుడందరూ, విధిగా కడుక్కుంటున్నారుగా, చేతులు కాళ్ళు
అందరూ శుభ్రంగా ఉంచుకోవడం లేదాఇళ్ళు ఒళ్లు?
కొందరు అగచాట్లుపాలైనా కాలేదా అందరికీ మంచి అలవాట్లు?
కరోనా మూలంగా దాపురించిన నెలల తరబడి “గృహనిర్బంధం”
పెంచ లేదా కుటుంబ సభ్యుల మధ్య మంచి అనుబంధం
జరగలేదా, ఇంటి పనుల్లో“అందరూ తలో చెయ్యివేయటం”
ఫలితంగా “ఇల్లాలి”కి చాకిరీ భారం కొంత తగ్గటం
క్రమంగా ఇంటి భోజనాన్నే అందరూ ఇష్టపడటం
ఇంక, “కుర్రాడు” కుదరక దొరకక ధూమపానం మానేయటం
మరో అనూహ్య కానుక– దొరకక “శ్రీవారు మద్యపానం మానేయటం”

(అందుకు నేను సంతోషించి “ఉచితంగా” క్షవరం చేయటం ఎంతో బాగా కుదిరిందని అందరూ అంటుంటే “ఆయన శోభనం పెళ్ళికొడుకులా సిగ్గుపడటం)

సరే, ఒక్క అతిథీ రాక, ఇతరత్రా కూడా వృధా వ్యయాలు తగ్గటం –
అన్నిరకాల కాలుష్యాలు తగ్గి ప్రకృతి కాస్త తెప్పరిల్లటం
ఇలా, ఇలా ఎన్నని చెప్పను కరోనా పరోపకారాలు
అది "మహమ్మారి" నిజమే, కాని మహోపకారి కూడా,
కరోనా నేర్పిన మంచి అలవాట్లుమానేస్తే మళ్ళీ అగచాట్లే
భౌతికదూరం పాటించకపోతే పరలోకగతే !
సర్వేజనా సుఖినోభవంతు – టీకా కనుగొని చూద్దాం – కరోనా అంతు

మాధవరావు: ఎవరూ చప్పట్లుకొట్టలేదని "కరుణ" చింతించరాదు శ్రోతలందరూ తను చెప్పిన వాస్తవాల గురించి "చింతిస్తున్నారు", అంటే మౌనంగా లోతుగా ఆలోచిస్తున్నారని అర్థం చేసుకోవాలి.

"ఇప్పుడు ఇంతవరకు తన అవకాశం కోసం ఎంతో జాలిగా ఎదురుచూస్తూ ఉండిపోయిన మన గ్రామం "యువకవి" బ్రహ్మానందం తన కవిత వినిపిస్తాడు.

బ్రహ్మానందం కవి: శీర్షిక"బ్రహ్మపదార్థం" – బ్రహ్మ పదార్థ మంటే ఎవరికీ అర్థం కానిదని అర్థం – సరే చదువు బాబూ...........

కవిత: బ్రహ్మమొక్కటే... పరబ్రహ్మమొక్కటే...
అట్లే కరోనా కోవిడ్–19 ప్రత్యామ్నాయ నామాలే
అయితే "బ్రహ్మపదార్థ" మంటే అర్థమేంటని అడగొద్దు.
నేతి...నేతి...న+ఇతి, ఇదికాదు, అబ్బే ఇదీకాదు – అంతే!

ఇలా బ్రహ్మపదార్థంలాంటి కరోనాకి ఎన్నో పరస్పర విరుద్ధ వ్యాఖ్యానాలే!...

నోటికొచ్చే కోటి నిర్వచనాలే – నివారణ సూచనలే!!
ఏది నిజం? ఏది ఊహ? ఏది అపోహ??? ఏమో, ఏమో!!!

ఏదైనా నాకైనా తెలుసునా మాయదారి మహమ్మారి కరోనా?
నీ జననం వూహాన్ సంతలోనా లాబ్‌లోనా?
సృష్టి సహజమా? జీవాయుధ దుష్ప్రయోగ ఫలితమా?

స్ట్రాంగ్ వైరస్‌వా? రాంగ్ బాక్టీరియావా? జీవాయుధానివా?
మొండి రోగానివా? తొండివైరివా? కొరివిదెయ్యానివా!
అసలేమిటి నీ రూపం ఏదీ నీ జన్యుపటం
తాటకిలాంటి సుందరివా, కురూపివా? కామరూపివా?
అసలేమిటి నీ ధ్యేయం నరజాతి నిర్మూలనమా?
కాస్త నియంత్రణమా?
నరునిపై రణమా? పర్యావరణ లోపాల నివారణమా
ఏ రోగానికైనా ఉంటాయి నిర్దిష్ట లక్షణాలు

మరి నీకేం రోగం, వస్తావు లక్షణాలతో ఒకసారి నిర్లక్షణంగా మరోసారి గొప్ప మాయలమారివే? జిత్తులమారివే.

నీ పూర్వీకులు సార్స్ ఎబోలా వగైరాలని అంతమొందించినవాడిని

నువ్వొకలెక్కా? పక్కా టీకా కనిపెట్టి తుదముట్టిస్తా నిన్నుచూస్కో కాస్కో.

మాధవరావు: కరోనా గురించి నిజంగానే ఎంతో కన్‌ఫ్యూజన్ ఎన్నో ప్రశ్నలు వాటిని మన యువకవి బాగా ఆవిష్కరించినా, సరిగా అర్థం కాక కాబోలు మౌనంగా ఉండిపోయిన శ్రోతలు పక్కా టీకా కనిపెట్టి తుదముట్టిస్తా చూస్కో కాస్కో అని, గర్జించినప్పుడు, భలేగా చప్పట్లుకొట్టారు. సంతోషం ఇప్పుడు మన గ్రామం శివార్లలో తన స్వంత ఫార్మ్‌హౌస్‌లో, క్వారంటఇన్‌లో ఉన్న ప్రముఖ సినిమా నిర్మాత, దర్శకుడు, రచయిత “చంద్రమౌళిగారు” పంపిన “వాయిస్ రికార్డు” వినిపిస్తాం “చంద్రమౌళి” స్వర సందేశం: “సిరిపల్లె” గ్రామ ప్రజలందరికీ పేరుపేరునా ధన్యవాదాలు, కృతజ్ఞతలు. ఇరవైరోజుల క్రితం, ఏకాంతంగా ఏదో రాసుకోవాలనే ఉద్దేశంతో, వంట వచ్చిన డ్రైవర్‌ని మాత్రం, తోడుగా తెచ్చుకుని ఇక్కడ బసచేశాను. మర్నాడే మా డ్రైవర్ ఏదో పనుండి సాయంత్రానికి వచ్చేస్తానని, చెప్పి నగరానికి వెళ్ళిపోయాడు. ఏమైందో తెలియదు, ఇంతవరకు తిరిగి రాలేదు, ఒకరోజు ప్రభుత్వ బృందం వచ్చి నా శాంపుల్స్ తీసుకున్నారు. సాయంత్రానికే సందేశం ఫోనుకి పంపించారు – కోవిడ్ పాజిటివ్ వచ్చిందని” ఓ గంటలో అంబులెన్స్ వచ్చి నగరంలో

ఏదో హాస్పిటల్‌కి తీసుకొని వెళ్తుందని చెప్పారు – కాని ఇంతవరకూ ఎవరూ రాలేదు. నేను ఒంటరిగా వుండిపోయాను. ఒకరోజు సాయంత్రం ప్రభుత్వ అధికారులే కాబోలు వచ్చి గుమ్మం బయట కొన్ని మందుల పాకెట్‌లు, స్వీయగృహ నిర్బంధం సూచనలున్న ఓ కరపత్రం పెట్టి నన్ను పలుకరించకుండానే వెళ్ళిపోయారు. నా సంగతి ఎలా తెలిసిందో ఏమో గ్రామ సర్పంచ్ మాధవరావు గారొచ్చి గేటు బయటే నిలబడి, “ఏమీ అధైర్యపడొద్దు. మా ఊరివాళ్ళం మీ బాగోగులు చూసుకుంటాం” అని ఉపశమనం పలుకులు పలికారు. అలాగే, ఈ రోజు వరకు ప్రతిపూటా ఎవరో ఒకరి ఇంటి నుండి నాకు ఆహారం వస్తూనే ఉంది. మీ ఊరి ఆచారి గారు కూడా మందులు, కషాయాలు పంపిస్తున్నారు. నాకిప్పుడు పూర్తిగా నయమైపోయింది. దానికి ప్రధానకారణం నేనెప్పుడూ ఊళ్ళోకి వచ్చి ఎవర్నీ పలకరించక పోయినా, ఊరు ఊరంతా నాపై కురిపించిన మమతాను రాగాలకు సదా కృతజ్ఞుడిని. ఏం చేసినా, ఈ ఊరి ఋణం తీర్చుకోలేను. అయితే ఉడతా భక్తిగా రెండుమూడు రోజుల తర్వాత నగరానికి తిరిగి వెళ్ళాక, ఓ పదిలక్షలకుమీ ఊరి పంచాయితీ పేరున చెక్కు పంపిస్తాను మరోసారి అందరికీ కృతజ్ఞతలు.

మాధవరావు: “నా అభిప్రాయం ప్రకారం ఆయనిచ్చే సొమ్ము మన ఊరు మొదట్లో ఒక సత్రం ఆయన తల్లిగారి పేరుమీద కట్టిస్తే బాగుంటుంది. తుది నిర్ణయం పంచాయితీ బోర్డు తీసుకుంటుంది. ఇప్పుడు మన ఊరికి చెందిన పదిమంది కరోనా బారినపడినా నయమైన సంగతి మీకు తెలుసు వాళ్ళు సహృదయంతో ఇతర రోగుల చికిత్సకు పనికొచ్చేలా తమ “ప్లాస్మా” దానం చేయటానికి సంసిద్ధులుగా ఉన్న సంగతీ మీకు తెలుసు ఇప్పుడు ఆ కరోనా యోధుల పేర్లు ఒక్కోటి పేర్కొంటాను మీరు ముమ్మార్లు చప్పట్లు కొట్టాలి సరేనా...

మళ్ళీ మాధవరావుగారు: “మనకు ఈ సభ నిర్వహించు కోవడానికి అనుమతిచ్చిన సమయం మించి పోయేలోగా నా కోడలు లక్ష్మీకళ వందన సమర్పణ చేస్తుంది.

లక్ష్మీకళ: అందరికీ నమస్సుమాంజలి – పంజాబీ అమ్మాయి, ఇంత చక్కగా తెలుగెలా మాట్లాడుతుందోనని ఆశ్చర్యపోతున్నా రనుకుంటాను. మలయాళీ

అమ్మాయైనా టీవీ, యాంకర్ "సుమక్క", ఎంత బాగా తెలుగు దంచేస్తుందో మీకు తెలుసుకదా. మరి ఆమె అంత గొప్పగా, అనర్గళంగా మాట్లాడలేను గాని, నా బాల్యం, చదువు అంతా సుమక్కలాగానే సికింద్రాబాద్‌లోనే జరిగింది. ఉద్యోగరీత్యా సైనికాధికారైన మా నాన్నగారు "కార్గిల్ యుద్ధం"లో దేశం కోసం ప్రాణాలర్పించారు. తర్వాత నేను బెంగుళూరులో సాఫ్ట్‌వేర్ ఉద్యోగంలో చేరాను. మీ ఊరువాడు సదానంద్, సహోద్యోగిగా ఉంటూ ప్రేమిస్తున్నాని వెంటబడి కష్టపడి ఒప్పించి పెళ్ళాడేశాడు. ప్రేమ పెళ్ళి చేసుకోవటం తప్పు కాదుగాని, మా "మహానుభావుడు" తన "రిజిష్టర్డు మేరేజ్" గురించి తన తల్లిదండ్రులకు చెప్పటానికి భయపడ్డాడు! నేనెంత పోరినా, ధైర్యం నూరిపోసినా ఫలితం లేకపోయింది – ఆఖరి ప్రయత్నంగా, నెల తప్పానని 'అబద్ధం' చెప్పి బాగా బలవంతం చేసి పతి సమేతంగా అత్తవారింటికి వచ్చాను. ఇద్దరినీ చూసి, ముందు నిర్ఘాంతపోయినా, తొందరగానే అక్కున చేర్చుకున్నారు అత్తగారు ముందుగా, కాసేపు నటసార్వభౌముడు "యస్వీ రంగారావు"లా అటూ ఇటూ పచార్లు చేసి మామగారు హఠాత్తుగా "నా కడుపున చెడబుట్టావురా – హు! ఆ రోజుల్లోనే మీ నాన్నది కూడా ప్రేమ వివాహమేనని ఎలా మర్చిపోయావురా శుంఠా!" అని కొడుకుని బాగా తిట్టి, నన్ను మాత్రం తలమీద చెయ్యివేసి దీవించారు. పదిరోజుల సెలవు ఐపోయిన తర్వాత ఇద్దరం బెంగుళూరు తిరిగి వెళ్ళిపోదామనకున్నాం గాని, కరోనా పుణ్యాన ఇప్పటివరకు ఈ ఊళ్ళోనే ఉండిపోయే అదృష్టం కలిగింది. నిజంగానే అదృష్టం అత్తమామలకి మరింత దగ్గరై పోయే అవకాశం లభించటం తోబాటు, ఈ ఊరు గాలి, నీరు, మహత్యం వలన కాబోలు ఇక్కడికి రావటానికి మా ఆయనతో చెప్పిన అబద్ధం నిజమైపోయింది! ఆడవాళ్ళకి అర్థమైనట్లే ఉంది గాని, కొంతమంది మగాళ్ళు తెల్లమొగం వేసుకున్నారు. అదేనండి, బాబూ, నెల తిరక్కుండానే నేను నిజంగానే నెల తప్పానన్న మాట అదీ సంగతి అందుకే ఈ సీమంతం వేడుక. నిజంగానే అందరూ "మహమ్మారి" అని తిడుతున్న కరోనా మా దంపతులకు మేలు చేసింది "లాక్‌డౌన్ కారణంగా మేం ఇద్దరం బెంగుళూరు వెళ్ళకుండా ఇంట్లోంచి పని" అదేనండి "వర్క్ ఫ్రమ్ హోమ్" చేసుకుంటున్నాం ఫుల్‌గా జీతం తీసుకుంటున్నాం మావగారు చెప్పినట్లునా ప్రసవం ఇక్కడే, నా తల్లిదండ్రుల కన్న ఎక్కువైన అత్తమామల

'సంరక్షణలోనే జరుగుతుంది. పుట్టబోయే బిడ్డకు మీ అదరి ఆశీర్వాదాలు పొందడానికి ఏర్పాటు కాబడ్డ ఈ సమావేశం, "కరోనా గురించి చర్చించుకోవడానికి కూడా ఉపయోగపడటం చాలా ఆనందంగా ఉంది. ఆఖర్లో ఒకమాట. మనమంతా అతి త్వరలో కరోనా అంతం చూస్తామన్న విశ్వాసం నాకుంది - కరోనా సమావేశం ఇంతటితో సమాప్తం - జైహింద్– జై సిరిపల్లె.

(రచనా కాలం - 2020 లాక్ డౌన్ - 1)